సాహిత్యప్రస్థానం

# అన్‌లాక్ ప్లీజ్..!

కరోనా మూడవ తాకిడి వుంటుందా, వుంటే ఎంత తీవ్రంగా వంటి అంశాలపై పరిపరి విధాల అంచనాలు సాగుతుండగా దేశంలో రాష్ట్రాలు దాదాపుగా లాక్‌డౌన్లు ఎత్తివేస్తున్నాయి. అన్‌లాక్ దశలవారీగా ప్రకటిస్తున్నాయి. భయంభయంగానూ మరోవైపు సడలింపుల సంతోషంతోనూ జనం జీవిత పయనం పున:ప్రారంభిస్తున్నారు. అనివార్యంగా మానవులు ఆశాజీవులు గనక– కోవిడ్ తగ్గుతుందనే ఆశపడుతున్నా ఆందోళనా వదలడం లేదు. ఈ సమయంలో ఆశలు ఆందోళనల కన్నా అప్రమత్తతే కీలకం. ప్రభుత్వాలు పోలీసులు లాక్‌డౌన్ సడలించినంత మాత్రాన కరోనా నివారణ కోసం తీసుకోవల్సిన జాగ్రత్తలు కాస్తయినా సడలించకూడదు. ప్రాణ రక్షణ, ఆరోగ్య రక్షణ కుటుంబాల రక్షణ, కరోనా దెబ్బకు కమిలిపోయిన జీవితాల రక్షణ, పాలకులు హరించిన హక్కుల రక్షణ ... ఏది జరగాలన్నా అప్రమత్తత తప్పదు! కనుక మాస్క్ టు వాక్సిన్ ప్రతిదీ పాటించాల్సిందే. మనను మనం కాపాడుకుంటూ తమ వారిని కోల్పోయిన లేదా సమస్యల పాలైన కుటుంబాలకు తోడ్పడాల్సిందే.

ఇక రచయితలు, కవుల విషయానికి వస్తే ఆంక్షలు లేని సృజనశీలతను అన్‌లాక్ చేసుకోవడానికి సిద్ధం కావాలి. ఈకాలంలో కదలలేక, కదలికలు లేక కరోనా కబుర్లలోనే మునిగితేలిన పరిస్థితి నుంచి మనస్థితి నుంచి బయటకు రావాలి. ఇళ్లలోనే వుండిపోయి లోనికి, లోలోనికి చూసుకుంటూ లేదంటే ఆన్‌లైన్‌లో వర్చ్యువల్ గోష్టులకే పరిమితమైన దశ మారుతుంది. అందుబాటులోకి వచ్చిన ఈప్రక్రియ ఇక ముందు కూడా కొనసాగినా ప్రత్యక్ష సభలూ సమావేశాలు పెరుగుతాయి. అంతకంటే ముఖ్యంగా ఈ బంధిత కాలంలో గతాన్ని తలపోస్తూ... లేదంటే తమ జీవితాల్లోకి తామే చూసుకుంటూ గడిపిన దశ ముగించాలి. కలాలకు, కళలకూ మళ్లీ పూర్తిస్థాయి పని కల్పించాలి. కరోనా కాలం నేర్పిన పాఠాలు కవితల్లో, కథల్లో కళాత్మకంగా, వాస్తవికంగా అందించేందుకు సిద్ధం కావాలి. మామూలు కాలంలో అర్థం కాని ఎన్నెన్నో కఠోర వాస్తవాలు... ఇలాటప్పుడు ఇట్టే తెలిసొస్తాయి. వాటిని ఈ దశకే పరిమితం చేయడం గాక విశాల కోణంలో చూడగలగాలి. చూపగలగాలి. ఎంత గొప్ప సంతోషాన్నయినా, సమస్యనైనా దాటివచ్చాక... అవి విస్మృతిలో పడిపోవడం మానవ లక్షణం. లేకుంటే మనుగడ దుర్లభం. అందుకే వీధుల్లో అన్‌లాక్ ఒకటైతే, మనో వీధుల్లో ఆలోచనాత్మక సృజనాత్మక భావనలను అన్‌లాక్ చేసుకోవడం అంతకన్నా అవసరమైన క్లిష్టమైన సవాలు. మళ్లీ మర్చిపోయేలోగా వాటిని నెమరేసుకోవాలి. సాహిత్యవనరు చేసుకోవాలి. ■



Owned, Printed and Published by **V. Krishnaiah** 41-9 -16, 1st Floor, F-3, Ramalayam Street, Near Kalpana Prints, Krishna Lanka, Vijayawada (Urban) - 520013, Krishna District. Andhrapradesh. Printed at Sri Chaitanya Offset Printers, 29-7-36, Vishnuvardhan Rao Street, Suryaraopet, Vijayawada - 520 002, Andhrapradesh. Published at 27-30-4, M.B.Vignanakendram, 3rd Floor, Akulavari Veedhi, Governorpet, Vijayawada - 520 001, Andhrapradesh.
Editor : Telakapalli Ravi

## కథలు



## కవితలు



## వ్యాసాలు




ISSN No: 2581 - 7477

**సాహిత్య ప్రస్థానం మాసపత్రికను ప్రోత్సహించండి. తెలుగు భాష, సాహిత్య వికాసాలకు మీరూ తోడ్పడండి !**

:: రచనలు, చందాలు, విరాళాలు, మనీ ఆర్డర్లు, చెక్కులు, డిడిలు పంపవలసిన చిరునామా ::

సాహిత్య ప్రస్థానం, ప్రజాశక్తి భవనం, అమరారెడ్డి కాలనీ, తాడేపల్లి - 522501, గుంటూరు జిల్లా. .

ఫోన్ : 0866-2577248, చందా వివరాలకు : 94900 99057, రచనలకు : 94900 99167

ఇ-మెయిల్ : ssprasthanam@gmail.com, వెబ్‌సైట్ : www.prasthanam.com

1 సంవత్సర చందా రూ. 240 ◈ 5 సంవత్సరాల చందా రూ.1000 ◈ 10 సంవత్సరాల చందా రూ. 2000

Bank A/c Details: A/c Name: PRASTHANAM, SBI, Governorpet, Vijayawada. A/c No. 52001500585, IFSC: SBIN0020343. చెక్కులు, డిడిలపై prasthanam అని రాయగలరు.

## కథ



# ప్రజెంటెంట్ బై వసుధ

- వేణు మరీదు
98486 22624

నగరానికి వానొచ్చింది. కాలుష్యపు పొరల్ని చీల్చుకుంటూ కర్బన విషాల్ని తనలో కరిగించుకుంటూ వానొచ్చింది! కానీ ఈ రోజుల్లో నగరాల జనులు వానకు పులకరించరు. అసలు పులకరించడానికి సమయం ఎక్కడిదీ! డ్రైనేజీ కంపు, పొలిమేరల్లో 'దంపు' పెరగడం తప్ప నగరంలో ఇంతగా వానలొచ్చి పొడిచేసేదేముంది గనుక–' అని చాలామందికి గట్టి నమ్మకం. అడ్డంగా విరిగి పడిన చెట్లు, హోర్డింగులు అదనపు ఆకర్షణ! అంతటితో ట్రాఫిక్ తలనొప్పులు– రోడ్డు మళ్లింపులతో తిప్పలు. 'అబ్బ! వర్షం అంటే నిజంగా పట్టణానికి ప్రళయం – పల్లెకు మాత్రం ప్రణయం' అని సరదాగా ఒకప్పుడు అనుకునేదానిని! కానీ అదీ తప్పే అనిపిస్తుంది ఇప్పుడు. ఎందుకంటే తొలకరి చినుకులకు మేని పులకలను అనుభవించడంలోని మజాను పల్లెవాసులూ మర్చిపోయి చాలా ఏళ్లు గడిచిపోయాయి.

జోరున పడుతున్న వానకు నాతో పాటు కొంతమంది వాహనాలను హడావిడిగా ఓ బస్టాప్ ముందు నిలిపి లోపలికి పరిగెత్తాం. అప్పటికీ లోపల కొంతమంది ఉన్నారు.

'అరేయ్ ఇటు చూడ్రా... టిక్‌టాక్‌లో దీని వగలన్నీ ఎలా ఒలకబోస్తుందో చూడరోయ్!' అంటూ సగం తడిసి ఉన్న యువకుడొకడు తన స్నేహితులకు మొబైల్ చూపిస్తున్నాడు.

'ఔనురోయ్! 'దీన్ని' ఎంత 'ట్రోల్' చేసినా ఇంత కూడా ఫీల్ కాదురోయ్!' అంటూ ఇకిలించాడు మరో స్నేహితుడు! మొత్తం ఓ పదిమంది దాకా కూడారు ఆ బస్సు షెల్టరు కిందికి.

శ్రావణ మాసం... బహుళ పక్షపు రోజులు... చలితో పాటు కారు మేఘాలు కమ్మిన చీకటి. దగ్గరగా ఒత్తిగిలి కూర్చున్న ఓ యువజంట నీడలు వస్తూ పోతున్న లారీలు, బస్సులు హెడ్‌లైట్ల వెలుతురుకు రోడ్డుపై బారుగా పడుతూ నల్లగా మెరిసి చటుక్కున మాయమైపోతున్నాయి. ఆ లిప్తపాటు పడే వెలుతురును సైతం సెల్ఫీలు దిగటానికి సద్వినియోగం చేసుకుంటున్నారు. అందరి చేతుల్లోనూ స్మార్టు ఫోన్లు అర్ధరాత్రి నల్లటి అడవి పొదల్లో పొంచివున్న జంగు పిల్లుల గాజుకళ్లల్లా మిలమిలా మెరుస్తున్నాయి. ఒక బుడతడు 'పబ్‌జీ' ఆట మొదలుపెట్టాడు. 'మెరుపు లొస్తున్నాయి. ఇక ఫోను ఆపరా' అని తల్లి హెచ్చరిస్తున్నా పట్టించుకోకుండా వాడు ఆమెను నాలిక బయటపెట్టి వెక్కిరిస్తున్నాడు. కొంచెం దూరంలో ఉన్న పెద్దాయన ఒకరు కళ్ళు చిట్లిస్తూ ఫోను స్క్రీను వైపే తదేకంగా చూస్తున్నాడు. 'ఆ పక్షి కన్ను తప్ప నాకింకేమీ కనపట్లేదు గురువర్యా!' అని బాణం వేయబోతూ ద్రోణుడితో అంటున్న అర్జునుడి యొక్క ఏకాగ్రతతో ఆయన పంచేంద్రియాలూ తన ఫోను పైనే నిలిపాడు. బహుశా ఏదో ఓటీపీ కోసం అయింటుంది! కొంచెం దూరంగా ఒక యువకుడు తలమొత్తం హెడ్‌ఫోన్‌లోకి దూర్చి 'సంగీత సుధా పయోనిధి'లో మునిగి తేలుతున్నట్లు ఒళ్లు మొత్తం ఊపేస్తున్నాడు!

ఇంతకీ నాన్నేడి? నా వెనుకనేగా స్కూటీ దిగి బస్ షెల్టర్‌లోకి వేగంగా పరిగెత్తారు! ఏరీ ఎక్కడా కనిపించరేం? హమ్మయ్య ... నా వెనుకనే కూర్చొని ఉన్నారు. తన చేతిలో కూడా ఫోను! ఐతే నాన్న ఫోనును చాలా అరుదుగా వాడతారు. అదీ 'పుస్తకం' ఏదైనా అందుబాటులో లేనప్పుడు ఆన్‌లైన్ పుస్తకాలు చదవటం కోసం! వర్షం పడి వెలిసే మధ్యలో ఈ కొద్ది కాలాన్ని కూడా నాన్న చదవటానికే వాడుకుంటున్నారన్న మాట! నాన్న

అవిశ్రాంత చదువరి! ఇంగ్లీష్‌లో 'హోరేషియస్ రీడర్', ఇంకా 'బిబ్లియోఫైల్' వంటి పదాలు నాన్నకు చిన్నవేమో!

దగ్గరగా వెళ్ళి ఆయన గమనించకుండా చూసాను. 'కిండిల్ రీడర్'లో 'గాన్ విత్ ద విండ్' నవల చదువుతున్నారు. మార్గరెట్ మిచెల్ రాసిన ఈ పుస్తకాన్ని నాన్న ఎన్నిసార్లు చదివి ఉంటారో లెక్కే లేదు! దాదాపు వందేళ్ళ క్రితం వచ్చిన ఆ నవల తాలూకా మొదటి ఎడిషన్ కాపీని మనదేశంలోనే తమ లైబ్రరీలో కలిగి ఉన్న అతి కొద్దిమందిలో నాన్న ఒకరు అయి ఉంటారు! నాన్న గ్రంథ సంపదలో ఉన్న ఆ పుస్తకం ఒరిజినల్ హార్డ్ బౌండ్ వాల్యూమ్. వేయి పుటలు. పుస్తకం పైభాగంలో 'గోల్డ్ ఎంబా సింగ్'లా చేయించి అల్మారాలో పెట్టుకుని అల్లారు ముద్దుగా చూసుకుంటున్నారు ఆయన. నాన్న అప్పుడప్పుడూ ఆ పాత నవలను చేతుల్లోకి తీసుకుని ప్రేమగా తాకుతుంటారు. విచిత్రమేమంటే ఆ నవల ఆధారంగా తీసిన సినిమా మాత్రం తను కావాలనే చూడలేదంట. ఒక 'క్లాసిక్' రచనను సినిమాగా తీయడమంటే దాన్ని 'తెరకెక్కించటం' కాదు; 'ఉరికెక్కించటం' అంటుంటారు నాన్న.

వర్షపు జోరుతోపాటు 'టిక్‌టాక్' కుర్రాళ్ళ జోరు పెరుగుతుంది. వీళ్లంతా మామూలు కుటుంబాల నుంచి వచ్చిన వాళ్లలానే ఉన్నారు. చేతుల్లో మొబైల్ ఫోన్లు లేకపోతే ఉన్మాదులౌతారేమో! ఇంతసేపు వీడియోలు చూడటానికి ఎంత డేటా కావాలి? ఎంత బ్యాటరీ చార్జింగు? ఎంత కరెంటు కావాలి? వాళ్లల్లో ఒకడు నన్ను దొంగచూపులు చూస్తున్నాడు. నేను కాస్త కళ్ళు పెద్దవి చేసుకొని కొరకొరా చూసే సరికి వాడి కళ్లు బెదిరాయి. అటు పక్కన 'సెల్ఫీజంట' ఇంకా 'క్లిక్ క్లిక్' మనిపిస్తూనే ఉంది. పెద్దాయనకు 'ఓటీపీ' వచ్చి లావాదేవీ పూర్తయినట్లుంది. ప్రశాంతంగా కూర్చుని ఫోనుపై బొటనవేలు పైకి జరుపుతూ ఏదో ఆన్‌లైన్ వ్యాపారపు వెబ్ ప్రపంచంలో ప్రయాణం సాగిస్తున్నాడు.

నాన్న ఇంకా పుస్తకం చదువుతూనే ఉన్నాడు. ఎందుకు నాన్నకు పుస్తకాలన్నా, చదవటం అన్నా అంత ఇష్టం? ఆయనది అధ్యాపక వృత్తి. ఎవరైనా వాళ్ల సబ్జెక్టు పుస్తకాల వరకు వాళ్లు చదువుకుంటారు – సమకాలీన విషయ పరిజ్ఞానం పెంచు కోడానికి... కానీ నాన్నేంటి ఒక యజ్ఞంలా పుస్తకాలు చదవటం! వయసు మీద పడుతున్న కొద్దీ ఆ అలవాటు ఇంకా ఎక్కువవుతుంది. ఒకే సమయంలో నాలుగైదు పుస్తకాలు చదివేస్తారు. ఒక వారంలో ఉదయం శూద్రకుని 'మృచ్ఛ కటికం', మధ్యాహ్నం 'అభిజ్ఞాన శాకుంతలం'. సంధ్య వేళకు కాఫ్కా రాసిన 'ది మెటా మార్ఫోసిస్". అర్ధరాత్రి పోలీస్ వాహనాల సైరన్‌లమోత వినబడే వరకూ కాళోజీవో, కృష్ణశాస్త్రివో కవితలు! తులసీదాసు 'రామచరిత మానస్' నుంచి రిచర్డ్ డాకిన్స్ రాసిన 'ద సెల్ఫిష్ జీన్' వరకూ అన్నీ ఉన్నాయి, ఆయన పుస్తకాల సంపదలో!

వాన పూర్తిగా వెలిసింది. ఆలోచనల్లోంచి తేరుకుని అటూ ఇటూ చూస్తే ఎవ్వరూ లేరు. నాన్న ఇంకా ఆ నవలలోనే విహరిస్తున్నాడు.

"నాన్నా వర్షం తగ్గింది.. లేవండి వెళ్దాం" అన్న నా పిలుపు విని ఈ లోకంలోకి తిరిగొచ్చారు. చెత్తచెదారం అంతా కొట్టుకు పోయి అప్పుడప్పుడే ఆరుతున్న రోడ్లు సరస్సు ఒడ్డున రెక్కలార బెట్టుకుంటున్న కొంగల్లా ఉన్నాయి. మేఘాలు తొలగిపోయి విశాలమైన వెలుతురులు పరుచుకున్న నగరం... అప్పుడే తలస్నానం చేసినట్టు మెరుస్తుంది.

మధ్యమధ్యలో సన్నని తుంపర. స్కూటీ కాస్త వేగంగా నడుపుతూనే వెనక్కి తిరిగి చూశాను. నాన్న మళ్లీ కిండిల్ రీడర్‌లో 'గాన్ విత్ ద విండ్' లోకంలోకి వెళ్ళిపోయారు! నవ్వుకుంటు న్నాను నాలో నేనే! 'కృత్రిమ మేధ'లు రాబోయే రోజుల్ని ఏల బోతున్న తరుణంలో ఇంకా నేటి ప్రపంచంలో ఇంతటి 'చదువరులు' ఉండటం ఆశ్చర్యమే మరి!

♦ ♦ ♦

అది అమ్మ ఆరవ సంవత్సరీకం. నాన్న పుస్తకాల పురుగు. అమ్మది మాత్రం వాస్తవాల అరుగు. అమ్మకున్న లోక వ్యవ హారం, బాధ్యతతో కూడిన ముందుచూపు వల్లనే నేనూ, చెల్లి ఈ మాత్రం ఎదిగి చిన్న ఉద్యోగాలు చేసుకుంటున్నాం. నాన్న ధోరణిలో వెళితే మా పరిస్థితి ఎలా ఉండేదో అని అన్పిస్తుం టుంది. కొంచెం పాలన్నం, పులిహోర, గారెలు చేసి అమ్మ ఫొటోకు మాలవేసి, వండిన పదార్థాలన్నీ అక్కడ పెట్టి అందరం దండం పెట్టుకున్నాం. ఎప్పుడో తాతల నాడు గోదారి తీరాన్ని వదలి ఈ నగరానికి వలస రావడం జరిగింది. నాన్న ఉద్యోగం కోసమని, పెళ్లయిన కొత్తలో కూడా నాన్న పుస్తకాలు చదివే వాడట. కానీ మరీ ఇంతలా కాదు. వయసు పెరుగుతున్నకొద్దీ ఈ 'గ్రంథాభిలాష' ఓ పిచ్చిగా మారి కూచుంది! చాలా కుటుం బాల్లో లాగా అమ్మకు, నాన్నకు బట్టల గురించి కానీ, బంగారం గురించి కానీ, చేలో పండే పంట గురించి గానీ, ఇంట్లో వండే వంట గురించి గానీ గొడవల్లేవు! గొడవల్లా ఒక్కటే... నాన్న పుస్తకాలు, పత్రికలు, జర్నల్స్ వంటి వాటి కోసం పెట్టే ఖర్చు గురించే! ఆ రోజుల్లో ఉద్యోగుల జీతాలు కూడా బాగా తక్కువే. నగర జీవితంలో నిలదొక్కుకునే పోరాటం... ఎదుగుతున్న కుటుంబంతో పాటు ఎదుగుతున్న పిల్లలు.

"ఏమండీ ఇంట్లో ఇద్దరు ఆడపిల్లలు ఎదుగుతున్నారు. డబ్బులన్నీ పుస్తకాలకే తగలేస్తున్నారు. నిన్నగాక మొన్న పుస్తక

ప్రదర్శనకు వెళ్లి పదివేలు ఖర్చు పెట్టారు. గతవారం రోడ్డు పక్కన 'సంచార పుస్తకాలయం' అంటూ మరో మూడు వేలు పెట్టి పుస్తకాలు తెచ్చారు' అని మొత్తుకునేది అమ్మ. జేన్ ఆస్టిన్ రాసిన 'ప్రైడ్ అండ్ ప్రెజ్యుడిస్' నవల్లో నలుగురు పెళ్లీడుకొచ్చిన పడుచుల్ని ఇంట్లో పెట్టుకుని తాపీగా పుస్తకాల గదిలో కూర్చొని చదువుకునే మిస్టర్ బెన్నెట్ నాన్నలాగాను, ఇల్లూ పిల్లల్ని పట్టించుకోనందుకు అతణ్ణి నిత్యం సతాయించే మిసెస్ బెన్నెట్‌లాగా అమ్మ కన్పించి గమ్మత్తుగా అన్పించేది. అయితే నాన్న జడస్వభావి మాత్రం గాదు. చదవటమే సత్యం– శివం– సుందరం అని నమ్మిన ఒక గొప్ప అధ్యాపకుడు.

తరగతి గదిలో ఎవరైన కాస్త చురుకైన విద్యార్థి హఠాత్తుగా లేచి నిలబడి గట్టి ప్రశ్న అడిగితే హడావిడి పడిపోయి, మొబైలు ఫోనో, ల్యాప్‌టాపో తీసుకుని జవాబు కోసం గాలించే కొందరు గూగులు గురువర్యులులా కాకుండా తన సబ్జెక్టుపై పూర్తి సాధికారిత కలిగి, విద్యార్థి మస్తిస్కంలో ప్రశ్నతో పాటు సమాధానాన్ని కూడా వెంటనే స్ఫురింపజేసేలా బోధించగల మహా సృజనశీలి నాన్న! ఆయనను ఆయన సహచర అధ్యాపకులు 'పుంభావ సరస్వతి' అని, శిష్యులు 'మా మాష్టారు వాకింగ్ ఎన్‌సైక్లోపిడియా' అంటూ ఉండేవారు!

అమ్మ బతికున్న రోజుల్లో ఒకనాటి సంగతి. ఆ రోజు చెల్లి పుట్టినరోజు. నాన్న జీతంతో ఇంటి లోను, పర్సనల్ లోను, నా ఎడ్యుకేషన్ లోను ... ఇంకా అదీ ఇదీ అని 'కత్తిరింపు'లన్నీ పోగా మిగిలిన కొద్ది డబ్బులతో నాన్న పోస్టులో రహస్యంగా అమ్మకు తెలియకుండా పుస్తకాలు తెప్పించుకునేవాడు. ఖాతా ఖాళీ! 'పిల్లల మంచీచెడూ, పండగా పబ్బం ఏమీ పట్టించుకోరు. కనీసం వాళ్ల పుట్టిన రోజులన్నా గుర్తుంచుకోండి' అంటూ అమ్మ నాన్న చేతికి ఓ వెయ్యి రూపాయిలిచ్చి – "రేపు చిన్నదాని పుట్టినరోజు. దానికి ఓ మంచి డ్రస్ పట్టుకు రండి. ఏ లైబ్రరీలోకో దూరి పోయి విషయం మర్చిపోకుండా వెంటనే రండి.' అని పురమాయించింది.

తన బజాజ్ చేతక్ స్కూటరు తీసుకుని బయటకు వెళ్లిన నాన్న చీకటి పడే వేళకు వచ్చారు. చేతిలో దుస్తుల సంచీకి బదులుగా చిన్న గోనె బస్తా ఉంది. దాన్నిండా పాత పుస్తకాలు! పాపం ఎవరో ఒక ముసలాయన చౌరస్తా దగ్గర ఫుట్‌పాత్‌పై పాత పుస్తకాలు రాశిగా పోసి కొనటానికి ఎవరూ రాక బిక్కమొగమేసుకుని కూర్చుంటే.... నాన్న కేవలం అతని మీద జాలిపడి మాత్రమే వాటిని కొనలేదంట! ఎవరో గొప్ప ఉపాధ్యాయుడో, విద్యావేత్తనో చనిపోతే 'వాటితో' అస్సలు అవసరం లేదని ఏ కొడుకో, కూతురో వాటిని తూకానికి 'డిస్పోజ్' చేసారట. రక్త సంబంధాలనే 'డిస్పోజ్' చేసుకుంటున్న రోజుల్లో 'తమను చదివించి పెద్ద చేసిన పెద్దలు చదివిన 'పుస్తకాలను డిస్పోజ్ చేయటం పెద్ద తప్పేం గాదుగా! అందుకే మా నాన్న వాటిని కొన్నాడట, ఎవరో గతించిన మేధావి ఆత్మ శాంతించటానికి అన్నట్లు! అమ్మకు విషయం అర్థమై, అమ్మోరైంది! ముక్కుదూలం నుంచి కిందికి జారుతున్న కళ్లజోడును పైకి జరుపుకుంటూ కుర్చీలో కూర్చోబోతున్న నాన్న పైకి ఆ పుస్తకాలు బస్తాను బలంగా విసిరేసింది.

కోపంతో ఊగిపోతూ 'అసలు మూలన ముక్కు మూసుకుని పుస్తకాలు చదివే మీలాంటి వాళ్లు పెళ్ళెందుకు చేసుకోవాలి? పిల్లల్నెందుకు కనాలి?' అంటూ నిందించసాగింది. మేము భయంతో కొయ్యబారిపోయాం. నాన్న కొంచెం కూడా చలించలేదు. ఆ క్షణంలో సోక్రటీస్ జీవితంలోని ఓ సంఘటన గుర్తొచ్చింది నాకు. తత్వవేత్తలకు 'తాత' అనదగిన సోక్రటీస్ నిరంతరం అధ్యయనంలో మునిగి తేలుతుండేవారట. ఒకరోజు ముక్కోపి అయిన ఆయన భార్య 'జాంతిపి' కుండ తీసుకుని రేవుకెళ్ళి నీళ్ళు తెస్తానని, పొయ్యిపైన ఉడుకుతున్న వంటకాన్ని చూస్తుండమని చెప్పి వెళ్లిందట. ఆయన అధ్యయనంలో మునిగిపోయి పొయ్యిపై ఉన్న పదార్థాన్ని మర్చిపోయాడు. భార్య వచ్చేసరికి అది కాస్తా మంటకు ఆహుతియై, పాత్ర పొగ గొట్టంలా 'బొగ్గు పులుసు వాయువులు' కక్కుతుందట! ఆమె కోపంతో పెద్దగా అరుస్తూ ఆ రోజుల్లో పడక గదుల్లో అత్యవసర సందర్భాలకని వాడే 'మూత్రపు ముంత'ను ఎత్తి ఆయన తలపై పోసిందట! అయినా సోక్రటీస్ ఆమెను పల్లెత్తు మాట అనలేదు సరికదా తర్వాత ఆమె పశ్చాత్తాపంతో ఆయన తల కడుగుతూ 'నేను చేసిన పనికి మీకు కోపం రాలేదా!' అని అడిగిందట. అప్పుడు ఆ మహనుభావుడు చిరుదరహాసంతో 'ఘర్జించే మేఘం వర్షించకుండా ఉండదు కదా' అన్నాడంట. నాన్న కూడా ఇలా 'చలించే' మనిషి కాదు. కానీ అమ్మ మాత్రం మా గురించి నిత్యం 'జ్వలించే' మనిషి. ఆ జ్వలనం వల్లనో ఏమో అమ్మకు మరణం కూడా అకాలంగా సంభవించింది.

అమ్మపోయిన చాన్నాళ్ళకు నాకో పెళ్లి సంబంధం వచ్చింది. అన్నీ కుదిరాయి. తాంబూలాలు ఎప్పుడు ఇచ్చుకుందాం అనుకునే సమయానికి నాన్న అబ్బాయిని అతని అలవాట్లు గురించి, అతను ఇప్పటి వరకూ చదివిన పుస్తకాల గురించి వివరాలు అడిగేసరికి అతడు తెల్లముఖమేశాడు. 'పుస్తకాల చదవని అల్లుడు తనకక్కర్లేద'ని కరాఖండిగా తేల్చేసారు నాన్న! వచ్చిన వాళ్లు వెళ్లిపోయారు... వింతగా మా వైపు చూస్తూ! నాకు నాన్నపై కోపం కట్టలు తెచ్చుకుంది. గట్టిగా అరిచాను. ఏడ్చాను. ఇంట్లో ఉన్న వస్తువుల్ని అటూఇటూ విసిరేసాను.

నాకూ, నాన్నకూ మధ్య కొన్ని నెలలు ఇంట్లో నిశ్శబ్ద యుద్ధం కొనసాగింది. అది ముగిసిన కొన్ని రోజుల తర్వాత ఓ రోజు ఆఫీసులో మా మేనేజరు గారు 'చదువు గురించి, పుస్తకాల గురించి కొన్ని మంచి కొటేషన్స్ చూడమ్మా. మన ప్రచురణల ముఖచిత్రాలపై ప్రచురిస్తే చాలా ప్రేరణగా ఉంటుంది' అని అడిగారు. వాటి కోసం నెట్‌లో వెతుకుతూంటే టోని మోరిసన్ అనే మేధావి – 'నీవు చదవాలనుకున్న ఓ గొప్ప పుస్తకం ఇప్పటిదాకా నీకు దొరకలేదా! అయితే దానిని నువ్వే రాయాలి సుమా!' అని అన్న మాట బాగా నచ్చింది. ఆ మాట ద్వారా నాన్నను ఆట పట్టించాలనే చిన్న ఆలోచన కూడా వచ్చింది.

ఆ సాయంత్రం ఇంటికి వెళ్లిన తర్వాత నాన్నతో అదే అన్నాను. "జీవితాంతం అలా పుస్తకాలు చదవడమేనా నాన్నా! మీరూ ఓ పుస్తకం రాయొచ్చుగా!" అని. నాకు తెలియకుండానే ఆయనకు ఓ సవాలు విసిరినట్లుగా అన్నాను. ఆ రోజే నాన్న దానిని స్వీకరించినట్లున్నారు. ఆ సాయంత్రమే బయటకు వెళ్లి రాత పుస్తకాలు, తెల్ల కాగితాలు తెచ్చుకున్నారు. బహుశా ఈ ఆలోచన ఆయనలో కూడా ఓ చిరుదీపంలా ఉన్నట్లుంది. నా మాటలు దానికి ఆజ్యం పోసి అది అఖండ దీపంలా వెలిగేలా చేసినట్లున్నాయి. బడిలో కొత్తగా చేరిన చిన్న పిల్లవాడు టీచరమ్మిచ్చిన ఇంటి పనిని ఎంత ఉత్సాహంగా చేయటం మొదలు పెడతాడో అంత ఉత్సాహంగా తన గదిలోంచి బయటకు రాకుండా రాస్తున్నాడు. అవును... ఇపుడు నాన్న రాస్తూ ఉన్నాడు. వీధిలో, నిషిధీలో ఏం జరుగుతున్నా అసలు పట్టింపులేదు. నాన్న రాస్తూనే ఉన్నారు. శుక్ల బహుళ పక్షముల – శరత్ హేమంత శిశిర ఋతువుల .. రేయింబవళ్ళ గమన నిర్గమనాలతో పట్టింపు లేకుండా కురిసిన ప్రళయ వర్షపు ప్రవహంలా నాన్న కలము యొక్క 'అసిధార' నుంచి జాలువారిన సిరా ఏ మహాగాథలు రచిస్తుందో కదా' అని నేను ఊహించుకుంటున్నా.

ఓ రోజు వేకువ సంధ్య వేళ ఏదో పెద్ద గురకలా వినిపిస్తే ఉలిక్కిపడి నిద్ర లేచి నాన్న గదిలోకి వెళ్ళి చూసాను. కుర్చీలో ముందుకు ఒంగిపోయి మెడను బారుగా తన రాత బల్లపై పెట్టి నిద్ర పోతున్నారు నాన్న. ఆయన తెల్లని పైజామా బాగా చెమటలతో తడిసినట్లుంది. దగ్గరగా వెళ్లి తల కింద మడతబడి ఉన్న చేతిని సరిగా పెడదామని పట్టుకుని పైకి తీయబోయాను. కదల్లేదు. తల పట్టుకుని ముఖం నా రెండు చేతుల్లోకి తీసుకుని చూసాను... నాన్న ఇక లేరు! చెల్లి, నేను కన్నీరుమున్నీరవుతూ ఆయన శరీరాన్ని చిన్నగా పట్టుకుని కుర్చీలో నుంచి మంచంపై పడుకోబెట్టాం. చెల్లి ఏడుస్తూనే అయిన వాళ్లకు, ఒకరిద్దరు నాన్న స్నేహితులకు ఫోన్లు చేస్తుంది. నాన్న కుర్చీ కింద ఒక నోటు పుస్తకం కింద పడి ఉంది. దానిని తీసుకుని ఒక్కో పేజీ తిరగేయడం మొదలుపెట్టాను. ఆకాశంలో చుక్కల్ని తోరణాలుగా, నెమలి పింఛాలను వరుసగా వందల కొద్దీ మాలగా అల్లితే ఎంత శోభాయమానంగా ఉంటుందో అంత చక్కని చేతిరాత. ఎన్నో పేజీలు రాసారు. ఐతే ఆయన రాసిన తొలి మాటలు చదువుతుంటేనే నా అణువుణువూ కంపించినట్లనిపించింది.

"అందరూ చిన్నతనంలో బొమ్మల కోసం, మిఠాయిల కోసం ఏడిపిస్తుంటారు. కానీ నేను పుస్తకాలు కొనివ్వమని గొడవ చేసేవాడినట! కటిక పేదరికంలో పుట్టినా 'అన్నం లేనివాడు జ్ఞానం లేనివాడు మాత్రం కాకూడదనకున్నాను. మానవ నాగరికత సంస్కృతీ వికాసం కేవలం 'చక్రం'తోనే జరగలేదని, చక్రంతో పాటు 'పుస్తకం' కూడా సరి సమానమైన తోడ్పాటునే అందించిందని, పెద్దయ్యాక ఆ విషయాన్ని ఇంకా శోధించి ప్రపంచానికి చాటి చెప్పాలని అనుకునేవాడిని. గోదారి వాగులు పొంగని రోజుల్లో మాత్రమే మాష్టార్లు బడికొస్తే పాఠాలు నడిచే పాఠశాలల్లో చదువుకుంటూ... అట్లాసు కొనుక్కోటానికి ఐదు రూపాయల కోసం దొరగారి చెరువుల్లో గోగునారను తీసే పనికెళ్లేవాడిని. అట్లాసు పుస్తకంలోని నీలి రంగు భూగోళ చిత్రాల మధ్యన నా సన్నని చేతి వేళ్లను తిప్పుతూ ఓ విశ్వ విహంగంలా ఖండాలను, ఆయా దేశాలను నా మధురోహల రెక్కలతో విహరిస్తూ మురిసిపోతుండేవాడిని. తోటి పిల్లలతో జల్సా షికార్లు లేవు. పుస్తకాలే నాకు పంచప్రాణాలు అయ్యాయి. కరెంటు కూడా లేని ఇంటిలో తెలిమంచుల తెల్లవారుజామున అమ్మ వెలిగించిన పొంత పొయ్యి వెలుగే నాకో పాలపుంత. అయితే నాకు పుస్తకాలనే ఈ నేస్తాలతో పాటు ఇంకో గొప్ప నేస్తం కూడా ఉంది. ఆ నేస్తమే వసుధ! ... తనంటే నాకు ఎందుకు బాగా ఇష్టమంటే తను నన్నే కాదు, నా పుస్తకాలనూ ఎంతో ప్రేమించి ఆదరించింది! మా ఊరు రుద్రమకోటలో 'చిన్నబడి'లో చదువై పోయాక గోదారి ఆవల కూనవరంలో ఉన్న 'పెద్దబడి'లో చేరాం. ప్రతి ఏటా పై తరగతిలోకి మేము ప్రవేశించే ముందు వసుధ తన పుస్తకాలకేమో పాత దినపత్రికల అట్టలేసుకుని, నా పుస్తకాలకేమో హంసలు, చిలుకలు, రకరకాల పండ్లు, ముగ్గుల అల్లికల బొమ్మలతో ఉన్న చక్కని గట్టి అట్టలు వేసేది. 'కాబోయే కలెక్టరు' గారి చదువుతో పాటు పుస్తకాలు 'గట్టి'గా ఉండాలట! ప్రతి పుస్తకం లోపలి మొదటి పేజీలపై లిల్లీపూలలాంటి తన నాజూకైన

వేళ్లతో 'ఓంశ్రీ'లు రాసేది పసుపుతో. 'ఇప్పుడు చూడు నీ పుస్తకాలు నీ కళ్లల్లో తెలివితేటల్లా ఎలా మెరుస్తున్నాయో!' అంటూ సంబరపడి పోయేది. మా ఊరి రేవు నుంచి రోజూ నాకూ పడవలో గోదారి దాటి కూనవరం ఒడ్డున దిగేలోగా పడవ నది మధ్యలో ఉన్నప్పుడు ఒక్కోసారి మేఘాలు లేకుండానే టపటపమని అర్థరూపాయి బిళ్లంత చినుకులు పడుతుంటే తన లేత నారింజ రంగు ఓణీ కొంగుని నా పుస్తకాలపై తడవకుండా పరిచేది! నా చదువు, నా భవిష్యత్తు కోసం తాను ఆరాటపడుతున్నట్లు స్పష్టంగా కన్పించేది. కళ్లు నావి, కలలు మాత్రం తనవి!

'తను అంతగా ఇష్టం చూపుతుంటే బిక్కులు సదువుకుంటూ కూసుంటావేట్రా కుర్ర సన్యాసీ' అంటూ మా పై తరగతుల్లో ఉన్న ఆకతాయి అబ్బాయిలు ఆటపట్టించేవారు! నేను మాత్రం వారు అనే మాటలు వినిపించుకోకుండా భయంతో వారి నుంచి దూరంగా పారిపోయేవాడిని. వాళ్లకేం తెలుసు నా మనసు. నాకు పుస్తకమంటే దైవం. వసుధ నా పుస్తకం.. నా ఇష్టదైవం.... ఐతే ఆ దైవం ఓ రోజు ఈ భక్తుని గుండె గుడి ఖాళీ చేసి వెళ్లిపోయింది. శబరీ గోదారీ సంగమించే చోట నా కన్నీరు మూడో యేరుగా వాటిల్లోకి పొంగి పొర్లి ప్రవహించింది. పుస్తకాన్ని నమ్ముకున్న ఈ పిచ్చి పేదోడి ప్రేమ తనకు సరిపడదనుకుందో ఏమో గానీ వసుధ మాత్రం వెళ్లిపోయింది! చెప్పకుండా తన తప్పించుకు వెళ్లిపోతే నా గుండెకు అంత పెద్ద గాయమయ్యేది కాదేమో. మేము అప్పుడే హైస్కూలు చదువులు దాటి కాలేజి చదువులకు ఎదిగాం. ఓ వేసంగి గోధూళి వేళ గోదారి ఒడ్డుకు నన్ను పిలిపించి ఏడిపించి మరీ వెళ్లింది. వెళుతూ వెళుతూ తను నాకిచ్చిన బహుమానం... ఓ చిరు ముద్దు కాదు! ముద్ద మందారం కూడా కాదు. ఒక్క చివరి నులి వెచ్చని బిగి కౌగిలీ కాదు... ఓ చిరు తాజ్‌మహలు బొమ్మ కాదు. తన కాటుక కన్నుల్లోంచి తన్ను కొస్తున్న కన్నీటి చెమ్మ కాదు. ఆమె నాకు యిచ్చిన ప్రేమ పురస్కారం... అది ఓ పుస్తకం! అవును.. పుస్తకమే! వసుధకు తెలుసు పుస్తకమంటే నాకు ప్రాణమని.. కానీ మా ఇద్దరికీ తెలుసు ఆమే నా 'బతుకు పుస్తక'మని! 'పుస్తకమే లోకంగా బతికే నా నేస్తమా నువ్వు ఆ పుస్తకాలతోనే గొప్పగా ఎదగాలి. నేను నిన్ను కోరేది ఇదే' అంటూ ఒక్కసారి నా చేతుల్లోకి తన ముఖాన్ని చేర్చి వెక్కి వెక్కి ఏడ్చి అంతలోనే దూరంగా జరిగి, వెనుతిరిగి వేగంగా వెళ్లిపోయింది. వసుధ ఓ గొప్పవారింటికి ఇల్లాలయింది. నేను మాత్రం తను కలలుగన్నంత గొప్పవాడిని కాలేకపోయాను. పుస్తకాల విజ్ఞానపు నిచ్చెనలు నన్ను పైకి లాగుతున్నా ఎన్నెన్నో వైఫల్యాల విషనాగులు నన్ను మళ్లీ పాతాళంలోకి పడవేసే వింత వైకుంఠపాళీ అయింది నా జీవితం! అయినా విశ్రమించను. ఇంకా చదువుతాను. పుస్తకమిచ్చి దీవించిన ప్రియురాలి కలల్ని ఏనాటికైనా నిజం చేస్తాను. ఇప్పటి వరకూ గొప్ప గొప్ప విజయాలేవీ సాధించలేకపోయాను. గొప్ప పుస్తకాలన్నా రాస్తాను. ముందు నా కథనే మొదలుపెడతాను. ఇంకా ఎన్నెన్నో పుస్తకాలు రాస్తాను. నా బిడ్డ కూడా నాకు ఇపుడో గొప్ప గమ్యాన్ని నిర్దేశించింది. రాస్తాను, కథలూ కావ్యాలూ ఎన్నెన్నో... ఊపిరి నిలిచిపోయిందాకా. నా ఒంట్లో నెత్తురంతా సిరాగా కరిగిపోయిదాకా రాస్తూనే ఉంటాను...."

ఆ కాగితాలపై ఎండిపోయి కనిపిస్తున్న నాన్న కన్నీళ్ల ముద్రలపైనే నా కన్నీటి చుక్కలూ జాలువారుతున్నాయి. అక్షరాలు చిరుజల్లుకు తడిసిన గడ్డి పూవుల్లా కన్పిస్తున్నాయి. మూడు లాంతరు అద్దాలను దగ్గరగా కట్టుకుని చిన్నప్పుడు ఆడుకున్న వర్ణదర్శినిలో అడుగున రంగురంగుల గాజుల ముక్కలు రూపొందించే భ్రాంతిచిత్రాల్లా నాన్న గదిలోని పుస్తకాలన్నీ వింతగా మెరుస్తున్నట్లుగా నా కళ్లకు కన్పిస్తున్నాయి. నాన్న కొద్ది క్షణాల క్రితం వరకూ తలవాల్చి విశ్రమించిన టేబుల్‌పైన ఒక పుస్తకం కన్పించింది. దానిని చేతుల్లోకి తీసుకుని చూసాను. బాగా పాత పుస్తకం. ఐనా చాలా చక్కగా పూల అంచుల బొమ్మల కవరుతో గట్టిగా బైండింగు చేసి ఉంది. ఆ పుస్తకాన్ని వణుకుతున్న వేళ్లతో పేజీలు తిప్పసాగాను. లోపటి మొదటి పేజీపై నెమలి పింఛాలను, సన్నజాజి తీగలను మాలగా అల్లితే ఎలా ఉంటుందో అలాంటి చక్కటి కుదురైన అల్లికలా, బాగా చేయి తిరిగిన లేఖా చిత్రకారుడు రాసినట్లుగా అందమైన కలిపి రాతలో రాసిన ఇంగ్లీష్ అక్షరాలతో 'ప్రజెంటెండ్ బై యువర్ వసుధ... విత్ లవ్!' అని రాసి ఉంది. ఆ పుస్తకం చార్లెస్ డికెన్స్ రాసిన 'డేవిడ్ కాపర్ ఫీల్డ్' నవల! గుండెనిండా కన్నీళు నిండగా చల్లటి నాన్న పాదాలపై పడి బోరున ఏడుస్తూనే ఉన్నాను. తెల్లగా తెలవారింది. ప్రతి ఉదయంలానే పక్కింటి సాదిక్ అంకుల్ వాళ్ల ఇంటి ఎత్తైన గోడ మీదుగా మంద్రంగా వినిపిస్తుంది గులామ్ అలీ గజల్ ...

**'చుప్‌కే చుప్‌కే రాత్ దిన్**
**ఆంసూ బహానా యాద్ హైం!'**

■

## కవిత



# తిండిగింజల కోసం...


- కంచరాన భుజంగరావు

94415 89602


బతుకు గతుకలలో
చితికిన నడకలు మావి
గంజి మెతుకులకై
గాలించే చెమటలు మావి
ఆకలి కేకలతో అంగలార్చే
వెతుకులాటలు మావి
లేమి దాంపత్యమే శరణ్యమైన
తలరాతలు మావి!

అప్పుల వడగాలి తాకి
పొలాలు పొల్లుగింజలుగా మిగిలాక
ఆశలింకిన బతుకులో
తడారిపోయిన నాలుక పైకి
కన్నీరు కార్చుకుంటున్న
ఎడారి దాహపు దేహాలు మావి!

చిరిగిన గుండెల్నీ
ఛిద్రమౌతున్న కండల్నీ
బెజ్జమిరిగిపోయిన
దిటవుగుం(డె)డు సూదితో
రోజూ కుట్టుకుని
రోజూ చివికిపోతున్న
మాసిపోయిన
తలగుడ్డ తాపత్రయాలు మావి!

పాలిపోయిన ముఖాలపై
పచ్చినెత్తురు బొట్లు
మా నుదుట పచ్చబొట్లు!
ఈసురోమంటున్న పాడు ఇళ్లలో
ఈగలమోతే
ఈసెడు సంపద మాకు!

ఒడినిండా ధాన్యరాశులున్నా
మా నిట్టాడి గుడిసెగాదిలో
వంద కుంచాలైనా
కూటిగింజలు రాల్చలేని
పల్లెతల్లి పొత్తిళ్ళలో
పస్తులతో పరుండలేమిక!

తాతలు తండ్రులిచ్చిన
మడిచెక్కలే
మా ముందరికాళ్ళ బంధాలు!
బిడ్డల ఆశలకు తెరువులేని చోట
ఊరి బంధాలన్నీ దూరమైనా
కాళ్ళకు కళ్లను కట్టుకుని
మెతుకుల కోసం వెతుకులాట
సాగించక తప్పదు మరి!

వీడని తేనె చెక్కెర నీడలను
గతం గోడలకు తగిలించి
మా ఓడిన బతుకుల పైకి
మేమే దాడికి సిద్ధమయ్యాము!
మా ఆఖరి వారసుడు కూడా
నాగలి దుక్క
నడ్డివిరిచే పనిలోనే ఉన్నాడు!

ఇక రేపటికి మనమంతా
అంగారకుడి పైనున్నోడినో
చందమామను దున్నే వాడినో
తిండి గింజలు కొన్ని
అప్పు ఇమ్మని అడుగుదాం! ■

విశ్లేషణ


వచన కవితా ప్రచారకుడు కుందుర్తి

# వచన కవిత్వం
# లక్షణాలు - నిర్వచనాలు

- డాక్టర్ బివి స్వరూప్ సిన్హా
98661 37204

వచన కవిత్వం ఉద్యమాలకు నేడు ప్రధాన వాహిక అయ్యింది. అందుకే చాలామంది వచన కవిత్వాన్ని **'ప్రజాస్వామ్య యుగ కవితా వాహిక'** అన్నారు. **'నా ఉద్యమం ఒక మహాయుద్ధానికి నాంది'** అని వచన కవితాచార్య కుందుర్తి ఆంజనేయులు అన్నట్టుగా వచన కవిత్వం ఒక ఉద్యమంలా వ్యాపించింది, వ్యాపిస్తూనే ఉంది. **'పాతకాలం పద్యమైతే - వర్తమానం వచన గేయం'** అన్నాడాయన.

ఆధునిక భావాలకు పద్యం పనికి రాదనీ, ప్రజలకు పద్య కవిత్వం చేరువ కాలేదనీ అభ్యుదయ వాదులు భావించారు. ఈ ఉద్యమాన్ని ప్రారంభించిన వచన గేయకవులు అందరూ పద్య కవిత్వాన్ని బాగా మధించిన వాళ్లే. పద్యరచనలో చెయ్యి తిరిగిన వాళ్లే. కుందుర్తి మొదట విశ్వనాథ సత్యనారాయణ శిష్యుడై పద్య కవిత్వాన్ని అభిమానించినవాడే. కానీ, ఆధునిక కవిత్వంలో వస్తువు మారుతుంది. కాబట్టి కవిత్వ ప్రయోజనం మారాలి. కవిత్వ రూపం కూడా మారాలి. కవిత్వానికి కొత్త అందాన్ని, అవసరాన్ని తీసుకురావాలని ఆధునికులు అనుకున్నారు. ఉద్యమాలకు వచన కవిత – వచన కవితకు ఉద్యమాలు పరస్పరం దోహదకారులయ్యాయి. వచన గేయాన్ని ఫ్రెంచి భాషలో Verse libre అని, ఇంగ్లీష్‌లో Free verse అనీ అంటారు. శ్రీశ్రీ, కుందుర్తి, చేకూరి రామారావు వంటి వారు వచన కవిత్వ లక్షణాలను తెలిపారు.

**'వచనం లాగా భాసించే మాటల్లో కవితా స్వభావమైన భావానుభూతిని కలిగించే ప్రయత్నం వచన కవిత్వం..'**

**'కావ్య భాషలోని కృత్రిమత్వాన్ని, నిరాకరించి, కావ్య గమనాన్ని నిరాఘాటం చేసేందుకు ఆధునిక కవులు చేపట్టిన రచనా పద్ధతే వచనగేయం...'**

**'వచన గేయానికి లయ ముఖ్యం. ఒకానొక వూపులో, విసురులో పదములను గుప్పించుట వలన ఈ లయ యేర్పడును. ఏ నియమము లేకుండ శుద్ధ వచనమును లయాత్మకముగ మార్చినచో అది వచన గేయమగును...'** అంటారు డా॥ సి.నా.రె.

నిరాడంబరత, నిరలంకారత కాదు గానీ అనవసర అలంకారాల భావరాహిత్యం, వర్ణనాధిక్యతకు స్వస్తి... కథా భంజకం కానంతవరకే అలంకారాల వర్ణనల స్వీకరణ, కవితలో సరళత, సూటిగా హృదయానికి తాకే విధంగా శబ్దాల కూర్పు, తెలుగు నుడికారపు సొంపులు, రసపోషనలు తగినంతగా వినియోగించుకోవడం – అన్నిటి కంటే ముఖ్యం తెలుగు ప్రజల సంభాషణ స్థాయికి దగ్గరగా రావడం – వచన కవిత లక్షణం. విశాలమైన పరిధి వచన కవితకుంటుంది.' అంటారు కుందుర్తి. అయితే దువ్వూరి రామిరెడ్డి, నోరి నరసింహశాస్త్రి వంటి వారు వచన కవిత్వాన్ని హేళన చేస్తూ విమర్శించారు. ముద్దు కృష్ణ రచించిన 'తురాయి' తెలుగు పత్రికలో దొరికిన మొదటి వచన కవిత అని ఆరుద్ర ఉదహరించారు.

"మొన్న
యీ దారినే నేనొచ్చినప్పుడు
బైటపడుతున్న సిగ్గును/ బెరడు కప్పి దాచుకోబోయి
తత్తరిల్లినది తలదించి
సిగ్గు సింగారమొలికి/ రెండు వానలు కురిసి
వాగులన్నీ పరుగు బారుతున్నవి
యిప్పుడు

**యెర్రపువ్వుల తలదురిమి**
**ముసుగు చిగురు చాటునుంచి**
**ముసి ముసిగ నవ్వుతున్నది**
**నన్ను చూసి..... '** (తురాయి పువ్వు గురించి)

వచన కవిత్వం ఏ నిర్వచనానికీ కట్టుబడదని, దీని లక్ష ణాలు విస్తృతమైనవని, కారణం – వచన కవితా నిర్మాణంలో గల వైవిధ్యమనీ అంటారు. పైన చెప్పిన లక్షణాలు వివరణలు అన్నీ వచన కవిత్వానికి సరిపోతాయి. తొలితరం వచన కవులలో ముద్దుకృష్ణ, నారాయణ బాబు, శ్రీశ్రీ, పురిపండా, పట్టాభి, పాలగుమ్మి పద్మరాజు ప్రసిద్ధులు. ఆ తరువాత ఝరుక్‌శాస్త్రి, తిలక్, సంపత్, సింగరాచార్య మరింత వెలుగులు విరజిమ్మారు. అభ్యుదయ కవిత్వం ఒక ఉద్యమరూపం దాల్చాక వచన కవితకు శక్తిని ప్రసాదించినవారు "నయాగరా' కవులు, అజంతా, బైరాగి, కాళోజీ, దాశరథి, ఆరుద్ర. కుందుర్తి **'ఫ్రీవర్స్'** ఫ్రంట్ స్థాపించి ఉత్తమ కవితా సంపుటాలకు బహుమతులిచ్చి, యువకవుల సంపుటాలకు పీఠికలు రాసి, కవి సమ్మేళనాలు నిర్వహించి వచన కవిత్వం స్థిరపడటానికి విశేష కృషి చేసారు. ఆకాశవాణి కవులలో వచన కవిత్వం రాసిన కుందుర్తికి మొట్టమొదటి అవకాశం వచ్చింది. అంతవరకూ పద్యకవులకే అవకాశం ఉండేది. దిగంబర కవులు, చేతనావర్త కవులు, విప్లవకవులు, అనుభూతి వాదకవులు, స్త్రీవాద, దళితవాద కవులు వచన కవిత్వానికి జవజీవాలు కల్పించారు. డా॥ సినారె **'విశ్వంభర'** వచన కవిత్వాన్ని జాతీయం చేసింది.

"కావున
లోకపుటన్యాయాలు
కాల్చే ఆకలి, కూల్చే వేదన
దారిద్ర్యాలు, దౌర్జన్యాలు,
పరిష్కరించే, బహిష్కరించే
బాటలు తీస్తూ, పాటలు వ్రాస్తూ...."

నవ్య కవిత్వం రాస్తానని, కవిత్వం కార్మిక లోకపు కళ్యాణం కోసం, శ్రామిక లోకపు సౌభాగ్యం కోసం అని తన కవిత్వానికి గొడ్డలి, రంపం, కొడవలి నాగలి లాంటి వృత్తి చిహ్నాలే ప్రాణమంటారు శ్రీశ్రీ.

"కష్టజీవులకు, కర్మవీరులకు
నిత్యమంగళం నిర్దేశిస్తూ
స్వస్తి వాక్యములు సంధానిస్తూ
స్వర్ణవాద్యములు సంరావిస్తూ
వ్యథార్థ జీవిత యథార్థ దృశ్యం పునాది" అన్నారు శ్రీశ్రీ.

వస్తువులో, అభివ్యక్తిలో, శిల్పంలో వినూత్న పోకడలు పోతూ, మినీకవితలుగా, దీర్ఘకవితలుగా, హైకూలుగా వచన కవిత్వం విశ్వరూపాన్ని ప్రదర్శిస్తోంది. కుందుర్తి వచన కవిత్వాన్ని గురించి చెబుతూ –

**"నియమ బద్ధమై నన్నయాదుల చేత తీర్చిదిద్దబడ్డ పద్యం మాకు తల్లి. దానిని కించపరచాలనే ఉద్దేశం లేదు. కానీ తెనుగు కవిత్వానికి ఈ పద్యమే, ఈ వృత్తమే తుది స్వరూప మని మాత్రం అంగీకరించం. కొత్త ప్రయోగం నిరంతరం జరగవలసిందే'.** కుందుర్తి తమ వ్యాసాలు పీఠికల ద్వారా వచన కవితోద్యమానికి చేసిన ముఖ్యమైన ప్రతిపాదనలు ఇవి.

కవితా శైలి సామాన్య ప్రజల సంభాషణ స్థాయికి రావాలి. బృహత్ కావ్యాలు, కథాకావ్యాలు, కవితా నాటకాలు, నాటికలూ రావాలి. ఆత్మాశ్రయ తత్త్వం వదలుకొని, **'మార్కి స్జం'** చదవాలి. వచన కవిత్వానికి వ్యాకరణం ప్రజలు, నిఘంటువులు ప్రజలు, అలంకారాలు ప్రజలు. సంస్కృత పద బాహుళ్యాన్ని, ఆంగ్ల పదాడంబరాన్ని వదులుకోవాలి. అధివాస్తవికత, అయోమయం, అస్పష్టత పనికిరాదు. కవిత్వాన్ని జాతీయం చేసాం – అది అందరి సొత్తు. నిజాయితీ, చిత్తశుద్ధి అనేవి ప్రజాదృష్టితో రాసే కవికి చాలా ముఖ్యం. పీడితవర్గానికి చెందిన వాడు మాత్రమే, ఆ వర్గం మీద కవిత్వం రాయాలనుకోనక్కరలేదు. సానుభూతి ముఖ్యం. ఆ వర్గ సమస్యల పట్ల సరైన అవగాహన ఉండాలి. అందుకు తగ్గ బలమైన అభివ్యక్తి అవసరం. ఆధునిక కవిత్వం రాయడమంటే కవి తాను సమాజంలో ఒకడుగా భావించు కొని, వర్తమాన సమాజ స్వరూపాన్ని మార్చే కృషికి దోహదంగా కవితలు రాయడం. తాను ఇతరులకంటే అధికుడవనుకొనే అహంకారం ఆధునిక కవికి పనికి రాదు. **'కావ్య వస్తువునూ దానికి సంబంధించిన భావవ్యక్తీకరణను కూడా ప్రజలనుంచి గ్రహించడానికి ఏది సిద్ధంగా ఉందో అది ఆధునిక కవిత్వం'.**

కుందుర్తి సంప్రదాయాన్ని ఎదిరించాడు. భగవంతుని పేరు మీద జరిగే అన్యాయాలను, అవాంఛనీయాలను వ్యంగ్యంగా ఖండిస్తూ **'భగవంతునికి బహిరంగ లేఖ'** రాశాడు.

**'తను తప్పు చేస్తూ శివశివా అని**
**నా కండ్లు మూసే యోగి, నీకు వాడు మహాభక్తుడు,**
**నేను వాణ్ణి సహించను**
**... ప్రతిదానికీ మెచ్చి భక్తులకు వరాలిచ్చి**

నీవు దైవ పదవిని నిరుపయోగపరుస్తావు"

"రా తమ్ముడూ పోదాం, మనకు చోటు లేదిక్కడ అష్టల్లేని అరణ్యంలో హాయిగా కాలం గడుపుదాం, కడుపు కొరకు క్రూర జంతువునని గర్జించి చెప్పే సింహం.... మనిషి కంటే నయం కదూ! అమ్మో భయమేస్తోందిక్కడ, రా తమ్ముడూ పోదాం..."

" నేను గేయాన్ని
ప్రజల గుండెల్లో యింకా మాయని గాయాన్ని
మృతవీరుల ధ్యేయాన్ని
స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు ఉపమేయాన్ని" అన్నాడు.

*సామాజిక ప్రయోజనం*

ఆధునిక వచన కవిత్వం ద్వారా సామాజిక రుగ్మతలను రూపుమాపే అవకాశం ఉంది. మానసిక పరివర్తన, చైతన్యం తీసుకు రావచ్చు. ఈవ్‌టీజింగ్, యాసిడ్ దాడులు వంటి వాటిని నివారించవచ్చును. యువతలో నైతిక విలువలు, మానవీయ విలువలు పెంపొందించవచ్చును. ఆధ్యాత్మికత, తాత్వికత, విజ్ఞత ఏకాగ్రత, సమైక్యత పెంపొందించ వచ్చును. గృహ హింస, వరకట్న, దురాచారాలు వరకట్న మరణాలు నిరోధించవచ్చు. భ్రూణహత్యలు, బాల్య వివాహాలు రూపుమాపవచ్చు. మహిళలను శారీరకంగా మానసికంగా హింసించే మద్యపానాన్ని నివారించవచ్చు. అభద్రతను, అశాంతిని పెంపొదించే ఉగ్రవాదాన్ని రూపుమాపవచ్చు. అవినీతిని నిర్మూలించవచ్చు. సమాచార చట్టం, జాతీయ గ్రామీణ ఉపాధిహామీ, సామాన్య ప్రజలకు చేరువ చేయవచ్చు. పర్యావరణాన్ని పరిరక్షించుకోవచ్చు. అక్షరదీప్తి, ఆరోగ్యప్రాప్తి, వంటి సంక్షేమ పథకాల అమలుకు అనువైన పరిస్థితులను కల్పించవచ్చు. ప్రజలను ప్రజాస్వామిక వాదులుగా పరిపాలనా దక్షులుగా రూపొందించడానికి అభ్యుదయ వచన కవిత్వం మంచి సాధనం. కులాలు, మతాలు, ప్రాంతాలు, భాషలు, జాతుల మధ్య భేదాలను తొలగించవచ్చును. మనుషులు జీవన పరమార్థం తెలుసుకొనేలా చేయవచ్చు. కష్టసుఖాలు, లాభనష్టాలు, గెలుపోటములను సమానంగా చూడగలిగే స్థితప్రజ్ఞత అలవడేలా చేయవచ్చు. సమాజంలో యాంత్రికతను అధిగమించి, మానసిక ఒత్తిడిని రూపుమాపేలా చేయవచ్చు. మనుషుల్లో మమతానుబంధాలను, జీవనమాధుర్యాన్ని పెంచేలా చేయవచ్చు.

■



## గాజు తిన్నె

ఎక్కడా ఎవరితో ఏ సంభాషణా లేదు
అంతటా ఒట్టి నిశ్శబ్దం
దేనికోసమో నీ వెతుకులాట!
నీలోకి నువ్వు
ఎప్పుడైనా తొంగి చూసుకున్నావా!
మరణాన్ని పొదుగుతున్న కళ్ళల్లోకి
ఎందుకలా గుచ్చి గుచ్చి చూస్తావ్!
యుగాలుగా నిన్ను వెంటాడుతున్నా
నీతో లయిస్తున్నా
అదే ముఖం - అదే అచేతనం -
నీతోపాటు నేను నడుస్తునే వున్నాను
నీకు నేను అర్థం కాలేదా!
రుణపడు నీకు నువ్వు!
ఇంకా కాలం తలుపులు మూయనందుకు
ఏ వాగ్దానమూ ఎవ్వరికీ ఇవ్వకు
మమకారపు గాజుతిన్నెను ముట్టుకొంటే
నీ అడుగులు నీకే కనిపించవు
ఇదొక పరుగెత్తుతున్న పాత రైలు
ఎవరు ఎక్కడి కెళ్తారో కొత్త చెప్పులేసుకొని!
ఎటు పారిపోతారో ఏ గూటికి చేరు కుంటారో
ఈ మరణ నివేదనల్లో!

- ఏటూరి నాగేంద్రరావు
7416 65323

కవిత



# ఒకప్పుడు అడవి ఉండేది!

- తండ హరీష్ గౌడ్
8978439551

రోడ్డును
బండిచక్రాలకు తగిలించుకొని
అలా పైరగాలితో
వొళ్ళంతా శుద్ధి చేసుకుందామని
ఊట్ల, మట్వాడా దారుల్లోకి సాగినపుడు
అడివి నా గుండెలనిండుగా
కొలువై ఉండేది

ఇంటిముందు నుంచి
గుట్టలకేసి చూసినప్పుడు
రాయి రాయి రాజుకున్న మంట
ఓ సన్నని దారిలా
కాగడా పట్టుకుని వెలిగినపుడు
అడివి నా లోపల చిగురిస్తూనే ఉండేది

అక్కన్నుంచి ఓ మనిషి
మా గూడూరుకు వచ్చినప్పుడో
ఇక్కన్నుంచి మేము
అడవిలోకి వెళ్ళినప్పుడో
అడివి చెట్ల వాసన
మమ్మల్నంటుకొని వదలకపోయేది

మహబాద్ నుంచి
ఊట్ల, మట్వాడా మీదుగా
బురద మడుగుల్లో తలంటుపోసుకొని
ఊడిపోతూ, అతుకుతూ
ముక్కుతూ, మూలుగుతూ

మా ఇంటిముందుకొచ్చి వాలే
ప్రయివేటు బస్సు
అడివినంతా తీసుకొచ్చి
మా ముందర కుప్పపోసేది

వర్షం కురుస్తున్న వేళ
జింకలా పరుగెత్తుతూనో
పురివిప్పిన నెమలై నృత్యం చేస్తూనో
కనువిందు చేసే
అడివి అందాలను చూడడానికి
రెండు కన్నుల చూపు ఏపాటిది

ఆకుల గలగలలు పిట్టల కువకువలు
ఇప్పపూలు, పుట్టతేనె
మచ్చలేని మనుషులు
ఇదే కదా అడివంటే?

ఇప్పుడు ఆ అడివిని వెతుకుతున్నాను
ఆ మనుషులను వెతుకుతున్నాను

ఇప్పటికైతే
ఇక్కడ ఒకప్పుడు అడివి ఉండేదంటూ
బోర్డును చూశాను

'ఇక్కడ
ఒకప్పుడు మనిషి ఉండేవాడు' అనే మాట
తలుచుకుంటేనే భయమేస్తుంది!

పూర్వం
అడివిలోంచి మనిషి పుట్టాడు
ఇప్పుడు
మనిషిలోంచి అడవి పుట్టాలి! ■

# సమాజ సృష్టే 'ఐదుగురు లోఫర్లు'

జంధ్యాల రఘుబాబు
98497 53298



గోడ మేకుకు తగిలించిన చిన్న చిత్రపటం కథ అయితే, నవల గోడ మీద వేసిన పెద్ద చిత్రమని మహాకవి శ్రీశ్రీ చెబుతారు. అది జీవితమంత విశాలమైన పునాది మీద మొదలై ఆకాశాన్ని తాకుతుందన్నారు. గోడ చిత్రంలోని అంశాలన్నీ మనకు ఎంతో స్పష్టంగా కనిపిస్తూ ఉంటాయి. నేటి భాషలో చెప్పుకోవాలంటే కథ పది మెగా పిక్సెల్ ఫొటో అయితే నవల ఏ రెండొందల మెగా పిక్సెళ్ల భారీ చిత్రమనుకోవాలి. దాన్ని స్క్రీన్‌పై ఎంత పెద్దదిగా చేసినా వన్నె తరగని ఎన్నో విశేషాలు పక్క పక్కనే కనిపిస్తాయి. అలాంటివాటినెన్నింటినో క్రోడీకరించి చెప్పేదే నవల. నవల చదువుతున్నప్పుడు కలిగే భావావేశాన్ని, తాదాత్మ్యతను నవతరం ఆస్వాదించి అనుభవించగలిగితే రచనల్లో వైవిధ్యంతో పాటు వారి వస్తు, విజ్ఞాన పరిధి ఎన్నో రెట్లు పెరుగుతుంది. ఇప్పుడు నవల కొనసాగింపు మందకొడిగా ఉన్నా– మనకున్న నవలా సాహిత్యం ఎనలేనిది. దాన్ని ఎవ్వరూ కాదనలేరు.

ఒకానొక గాడిద ఆత్మకథ, పేకముక్కలు, పది రూపాయల నోటు, అశ్రువాహిని, విద్రోహి, జైత్రయాత్ర, విరిగిన విగ్రహాలు, స్వరాజ్యంలో పెద్ద బాలశిక్ష, కిషంచందర్ కథలు మొదలైన పుస్తకాలు తెలుగు పాఠకులకు అందించిన విశాలాంధ్ర బుక్ హౌస్ వారే 'ఐదుగురు లోఫర్లు' వేశారు. కిషంచందర్ రచనల్లో ఇది ప్రత్యేకమైనది. లోఫర్ అంటే పనికిమాలినవాడు లేదా సోమరి అని అర్థం. ఐతే ఇందులోని ఐదుగురు లోఫర్లు తాము సొంతంగా అలా తయారు కావటం కాదు; ఈ వ్యవస్థ అలా తయారుచేసిందని మనకర్థమైపోతుంది. ఈ నవలలో ఫుట్‌పాత్ జీవితం గురించిన విషయాలు రచయిత ప్యాంట్ మాస్టర్ పాత్ర ద్వారా ప్రథమ పురుషలో చెప్పిస్తారు. ఒక పాత్రలోకి రచయిత పరకాయ ప్రవేశం చేస్తే ఆయనకు, చదువరులకు ఎన్ని ఇబ్బందులు కలుగుతాయో సాహిత్య విమర్శకులు చెప్పారు. ఈ ప్యాంట్ మాస్టర్ పాత్రలో రచయిత దూరిపోయాడనటంలో ఎటువంటి సందేహమూ లేదు. అయితే ప్యాంట్ మాస్టర్ జీవితాన్ని వడపోసిన రచయిత కావటం వల్ల కథనంలో వచ్చే చిక్కులన్నింటినీ ఎదుర్కోగలిగాడు కిషంచందర్. ప్యాంట్ మాస్టర్ పరిస్థితులు సహకరించక ఫుట్‌పాత్ జీవితం గడుపుతుంటాడు. అతను తన జీవితం గురించి, తనతోపాటు ఉన్న మిగతా నలుగురి గురించి, బాంబే నగరం, దేశం, ప్రపంచం, సాహిత్యం, ప్రేమలు, ఉద్యోగాలు, ఉద్వేగాలు, భవనాల్లోని జీవితాలు, మురికివాడలు... ఇలా దేనిగురించైనా ధారాళంగా చెబుతూ పోతాడు. అక్కడ ప్యాంట్ మాస్టరే కాని రచయిత కనిపించడు చాలాచోట్ల. కిషంచందర్ తీసుకున్న ఈ ఎత్తుగడ మనల్ని ఆశ్చర్యపరుస్తుంది. జీవితాల్ని, చుట్టూ ఉన్న పరిస్థితుల్ని మనోమథనం చేసిన ఈయన అంతరంగమనే పెన్ను తీసుకొని కాగితంపై అంతలా పెట్టగలిగే నేర్పు చూసి సంభ్రమాశ్చర్యాలు కలుగుతాయి. నిడమర్తి శ్యామలాదేవి, నిడమర్తి ఉమా మహేశ్వరరావుల అనువాదంలో అవేవీ వడకట్టకుండా మనకందించారు. ఒకవిధంగా ఈ నవల మనోవైజ్ఞానిక కోణంలో కూడా మనకు కనబడుతుంది.

అదే కాకుండా సామాజిక, రాజకీయ కోణాల్లో కూడా జీవితాన్ని చూడొచ్చు. ఒక వేయి పేజీల సారమూ, సారాంశమూ ఉన్న నవలని నూట ఇరవై పేజీల్లోకి అలవోకగా ఎక్కించాడు కిషన్ చందర్. ప్యాంట్ మాస్టర్‌తో పాటు దొంగతనాలు చేసే తాంతియా, కుష్టురోగి జాన్, పడుపు వృత్తి చేసుకుంటూ బతికే జమున, ఇంకో దొంగ బాస్కో. ఈ ఐదుగురి చుట్టూ కథ

తిరుగుతూ ఉంటుంది నవలలో. వీళ్ళ నివాసం బాంబేలోని మహిమ్ చర్చికి ఎదురుగా ఉన్న ఫుట్ పాత్, చర్చి కటకటాలు, పైన ఉన్న గుల్మహర్ చెట్టు. ఒక్క తాంతియాకు మాత్రమే తల్లి ఉంటుంది. ఆమె వేరే చోట అడుక్కుంటూ తన బతుకు తాను బతుకుతుంటుంది. వాళ్ళిద్దరి మధ్య ఆర్థికమైన స్పర్థలే విడివిడిగా బతకటానికి కారణం.

దేశ ప్రప్రథమ ప్రధాని నెహ్రూ కాలానికి సంబంధించిన కథ ఐనా నేటికీ ఆ పరిస్థితులు మారకపోగా ప్రపంచీకరణ ప్రభావంతో వెనక్కుపోయి ఫుట్‌పాత్ మీద ఉన్నవాళ్ళ పరిస్థితులు ఇంకా దిగజారిపోయాయి. నేడు భావ స్వేచ్ఛకు ఎన్ని అడ్డంకులు కల్పిస్తున్నారో అన్న అంశం తీసుకుంటే, ఆనాడే కిషంచందర్ అప్పటి ప్రభుత్వం పైన, నెహ్రూ చనిపోయినప్పుడు తన పాత్రల ద్వారా చెప్పించిన మాటల్ని గమనంలోకి తీసుకుంటే ఈ ప్రజాస్వామ్య దేశంలో కచ్చితంగా వెనక్కుపోతున్నామన్న విషయం తెలిసిపోతుంది.

ఈ నవలలోని కొన్ని డైలాగులు మనల్ని వెంటాడుతూనే ఉంటాయి, ఉదాహరణకు 'ఇంత సరళము, సహజము, శ్రేష్టమైన పనికి పడుపువృత్తి, వ్యభిచారం అని పేరుపెట్టిన వారి తెలివినేమనాలబ్బా!', 'నా మటుకు నాకు ప్రపంచమెంతైనా మారిందిగాని మనిషి స్వభావం మాత్రం అతి స్వల్పంగా మారిందేమోననిపిస్తోంది', 'మృత్యు సందర్శనమైన వారికీ, మరణవేదనను చవిచూసినవారికి మాత్రమే జీవితపు విలువ అంతుపడుతుంది', 'పెద్ద మనిషిగా బతకడమన్నది ఈ ప్రపంచంలో అన్నింట్లోకీ హాస్యాస్పదమైన పనిగా తయారైంది. అందుకనే వాడంటే మాకు లోలోపల ద్వేషం గూడుకట్టుకోసాగింది'.

మనిషి ఆకలి గురించి చెబుతూ ఒకచోట... 'పుట్టినప్పుడు గుడ్డి పేగునే కాదు సొంతం పొట్టనే తీసి వెయ్యాలని అలా చేస్తే పొట్ట ఉండదు కాబట్టి ఆకలి వెయ్యద'ని, దారిద్ర్య నిర్మూలనకు ఇదే సర్వ శ్రేష్ట ఔషధమని రచయిత మాటలు చదువుతున్నప్పుడు మన హృదయం బరువెక్కుతుంది. తిన్నది ఎక్కువై బరువు తగ్గటానికి నానా తంటాలు పడుతున్నవారిని, పెద్ద పేగుకు కుట్లు వేయించుకుంటున్న వారిని నేడు మనం చూస్తున్నాం. 'బీదవాళ్ళ విశ్వాసపాత్రదేముందండీ. అది వాళ్ళ ఆకలితో పాటు తగ్గుతూ, హెచ్చుతూ ఉంటుంది. గొప్పవాళ్ళ దురాశ ఉంది చూశారూ, సరిగా అలాగే... పెద్ద తేడా ఏమీలేదు. కాకపోతే మనమంతా మనుషులమే' అని అన్న రచయిత మాటల్లోని నిజం మనం ప్రత్యక్షంగా చూస్తూనే ఉన్నాము. ఈ భూగోళం చాలక చంద్ర మండలానికి, గురుగ్రహానికి పాకుతున్న మనిషిలో గూడు కట్టుకున్న అత్యాశను మనం చూడొచ్చు. శాస్త్రీయపరంగా ఎంతో ఉన్నతిని సంధిస్తూ అంతరిక్షంలోకి దూసుకు పోతున్న మనిషిని మానవుడే మహనీయుడు అనాలా, డబ్బు సంపాదనలో అథ:పాతాళానికి పోతున్న మనిషిని దానవుడని అనాలో నిర్ణయించుకోవాలి.

పత్రికా విలేఖరి శాంతా కౌల్‌తో పెద్ద హోటలుకెళ్ళిన ప్యాంట్ మాస్టార్‌ను ఈసడించుకొని చూసిన వారి గురించి చెబుతూ తన ప్యాంటును చార్లీ చాప్లిన్ ప్యాంటుతో పోల్చుకుంటాడు. ప్రపంచానికి చార్లీ చాప్లిన్ ప్యాంటు ఆవశ్యకత అప్పటికన్నా ఇప్పుడే ఎక్కువ ఉందేమో అంటాడు. ఈ భూమి మీద చెయ్యవలసింది ఎంతో మిగిలి ఉందన్న విషయాన్ని ఈ ప్యాంటు గుర్తుచేస్తోందంటాడు. ప్యాంటులోని చీలికలను చూస్తారుగాని మనసుల్లోని తూట్లను ఎవ్వరూ పట్టించుకోవటం లేదంటాడు. నవలలో ఒక గొప్ప నటుడు కూడా చివరి రోజుల్లో పరిస్థితులు సరిగా లేక, వైద్యం అందక చివరికి తనవాళ్ళే ఫూట్‌పాత్‌పై పడేసే సన్నివేశాన్ని రచయిత హృద్యంగా చిత్రించారు. తమ పక్కనే నేలపై పడున్న ఒకప్పటి సూపర్ స్టార్‌కు, తనకు తేడా లేదా అని ప్యాంట్ మాస్టర్ అనుకోవడం ఆలోచనలను రేకెత్తిస్తుంది. జమున గర్భం దాల్చి పుట్టబోయే తన బిడ్డకు తండ్రిగా ఎవరైనా ఉంటారా అని అడగడం, రోజుల్లో మాత్రమే బతికే అవకాశమున్న ఒకప్పటి సూపర్ స్టార్ ప్రేమవర్మ ఆ బిడ్డకు తండ్రిగా ఉంటాననడం... మురికితో కూడిన ఫుట్‌పాత్ పైన మానవత్వపు పరిమళాన్ని మనపై చల్లుతుంది.

నవల చివరిలో టైఫాయిడ్ ఎక్కువై మరణించే స్థితిలో తాంతియా తల్లి అతడిని చేరడం, డాక్టరు రాసిచ్చిన మందులు తేలేక పోవడం, మిగతా నలుగురూ తమవద్ద ఎంతవుందో అదంతా తాంతియాకు ఇవ్వడం, ఆమే చనిపోయాక అంత్యక్రియలు జరిపిస్తాననడం, తమ దగ్గరున్న డబ్బు సరిపోక ఎవరి వృత్తి వాళ్ళు చేసుకొచ్చి మరీ డబ్బులివ్వడం, చివరికి పోలీసువాళ్ళకు ఆమె తన తల్లికాదని తప్పుడు సాక్ష్యం చెప్పి మున్సిపాలిటీ వ్యానులో ఆమె శవాన్ని విసిరేసి తీసుకుపోవడం, తల్లి శవం అనాధగా వెళ్ళిపోయాక తాంతియా బిగ్గరగా ఏడవడంతో నవల ముగుస్తుంది. ఆ ఐదుగురు లోఫర్లు అలా బతకడానికి కారకులెవ్వరు? వీరి తరం తరువాత ఇంకో తరం ఇలాగే అదే ఫుట్ పాత్‌పై బతుకుతుందన్న ఓ సత్యం మన మనసులో మెదిలి అలాంటివారికి ఏమీ చేయలేని ఈ వ్యవస్థపై ఏవగింపు గలగడం సహజం. ■



# ఒడియా సాహిత్యానికి పచ్చతోరణం సబూజ

- రత్నాల బాలకృష్ణ
94401 43488

ఒడియా సమాజం సాహిత్యరంగంలో కొంచెం ఆలస్యంగా మేల్కొన్నా ఆధునిక సాహిత్య వాతావరణాన్ని వేగంగానే అందుకొని ఆధునిక మార్పులు, చేర్పులను తమ భాషలోనూ అన్వయింపజేసుకున్నారు ఒడియా రచయితలు. 1920 ప్రాంతం, రవీంద్రనాథ ఠాగూర్ సాహిత్యరశ్మి దేశమంతటా వ్యాపించి అన్ని భాషలలోని కవులు, రచయితల మీద ప్రత్యక్షంగా, పరోక్షంగా ప్రభావం చూపిస్తున్న సమయమది. ఆధునికులు, రొమాంటిక్ కవులు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఆయన ప్రభావానికి లోనయినవారే. బెంగాల్‌లో కల్లోల కవులు, తెలుగులో భావకవులు, హిందీలో ఛాయవాద కవులు, అస్సాంలో రొమాంటిక్ కవులు ఇలా చాలామంది అప్పటికే రవీంద్రుని శిష్యులుగా మారి కవితా కుసుమాలు పూయిస్తున్న వారే. ఇంతగా దేశమంతా రవీంద్రుని ప్రభావానికి లోనవుతున్నప్పుడు పొరుగునే వున్న ఒడియా కవులు ఆయన ప్రభావానికి లోను కాకుండా ఎలా ఉండగలరు?

అలా రవీంద్రుడి మధుర భావనలనూ, లలితమైన పదబంధాలనూ, విశ్వజనీనమైన కల్పనా శిల్పాలనూ అనుసరించి ఒడియా సాహిత్యం సంచలనం, నవచైతన్యం సృష్టించింది. దాని పర్యవసానంగానే ఒడియాలో 'సబూజ సాహిత్య సమితి' ఆవిర్భవించింది. ఈ సమితి పుట్టు పూర్వోత్తరాలను పరిశీలిద్దాం.

బెంగాలీ వాడుక భాషకు జనకుడు ప్రమధ చౌదరి బెంగాల్‌లో 1914లో ఒక సాహిత్య పత్రికను స్థాపించాడు. దానికి 'సబూజ పత్రి' అని పేరు పెట్టాడు రవీంద్రుడు. పాతవి పట్టుకు పాకులాడటం ముసిలితనం, అదే జడత్వం. సాహిత్యం జాతిని ఆత్మహత్య నుంచి కాపాడాలంటే పాతని పక్కకి నెట్టాలి. మనస్సులోంచి ముసలితనం పారదోలాలి, యవ్వనానికి రాజతిలకం పెట్టాలి, నిత్యనూతనమైన సాహిత్యం సృష్టించాలి. దానికి మానసికమైన యవ్వనం కావాలి. మానసిక యౌవనం ప్రతిష్ఠించటమే సబూజ పత్రిక లక్ష్యమని ఆ పత్రిక ప్రకటించుకొంది. ఆ ఉత్సాహమే ఒడిసా యువరక్తంలో కూడా ఉరకలు వేసింది.

1920 ప్రాంతంలో కటక్ రెవెన్సా కాలేజీలోని కొందరు విద్యార్థులు అన్నదా శంకరరాయ్, కాళిందీ చరణ్ పాణిగ్రాహి, బైకుంఠనాథ పట్టనాయక, శరత్ చంద్ర ముఖర్జీ, హరిహర మహాపాత్ర మొదలగు వారు 'నాన్‌సెన్స్ క్లబ్' అని ఒక సాహిత్య సంస్థను పెట్టుకున్నారు. కాళిందీ చరణ్ పాణిగ్రాహి సంపాదకుడుగా ఆ క్లబ్ తరవున 'నాన్‌సెన్స్‌క్లబ్ మాగజీన్' అని ఒక రాత పత్రికను వెలువరించేవారు. ఈ పత్రికనే తరువాత 'శక్తి సాధన' అని పేరు మార్చుకున్నారు. ఈ పత్రికలో ఒడియా, బెంగాలీ, ఇంగ్లీషు ఇలా మూడు భాషలలో రచనలుండేవి. ఇందులో రచనలు తిరిగి 'సహకార', 'ఉత్కళ', 'సాహిత్య' వంటి ప్రసిద్ధ పత్రికలలో వెలువడేవి.

ఈ నాన్సెన్స్ క్లబ్ 1921లో 'సబూజ సాహిత్య సమితి'గా మార్పు చెందింది. 'సబూజ' అంటే ఆకుపచ్చ. రవీంద్రుని నిర్వచనం ప్రకారం బతికిన చెట్టు పచ్చగా ఉంటుంది. పచ్చగా ఉంటే ప్రాణంతో ఉన్నదన్నమాట. తిరుగుబాటు యువశక్తికీ, ప్రాణవంతమైన యవ్వనానికీ, కొత్తదనానికీ ప్రతీక ఆకుపచ్చ లేదా 'సబూజ'. ఇది ఆనాటి యువకవులను ఆకర్షించి, చైతన్యవంతులను చేసింది. ఆ చైతన్యమే ఒడియా సాహిత్యంలో నవయుగ జైత్రపతాకమై, ఆగామీయుగ సాహిత్య జయకేతనమై సబూజ సాహిత్య పతాకమై ఉరకలు వేసింది. ఒడియా సాహిత్యంలో సరికొత్త నవచైతన్య భావుకతకు నాంది పలికింది.

ఆనాటి విద్యార్థులే సబూజ సాహిత్య సమితిలో ప్రధాన కవులయ్యారు. వీరు 1931లో 'సబూజ కవిత' పేరిట

/

కవితా సంకలనం వెలువరించారు. వారి ముందుతరం కవిత్రయం రాధానాథరాయ్, ఫకీర్‌మోహన్ సేనాపతి, మధుసూదనరావుల ఆధునిక భావజాలానికి ఈ శతాబ్దంలో సబూజసమితితో కొత్తచివురులు తొడిగి పూలు పూసింది.

సబూజ కవులు భావుకులు, భావకవులు, మానవతా వాదులు, వైజ్ఞానిక దృష్టికల ఆంగ్ల విద్యాధికులు, సౌందర్యో పాసకులు, ప్రేమా, ప్రేయసీ, పువ్వులూ, కలలూ, కల్పనలూ వీరి కవితా వస్తువులు. స్వేచ్ఛ వీరి జీవనం, యవ్వనం ప్రాణం, కలల్లో తేలిపోతారు, కలల్లో ఆడతారు, ముద్దాడు తారు, మానసిక యవ్వనాన్ని పూజిస్తారు. ఒడియా సాహిత్యానికి అశ్వవేగాన్నిచ్చి జవసత్వాలను పెంచి నూతన పథంవైపు పరుగులు తీయించారు ఈ సబూజ కవులు.

ఇంగ్లీషులో షేక్స్పియర్, ఇటలీలో పెట్రార్కా వాడిన సానెట్ నియమాలను అనుసరిస్తూ 19వ శతాబ్దపు కవి మధుసూదన రావు ఒడియాలో చక్కని సానెట్లు రాసారు. బెంగాలీలోనూ సానెట్లకి మంచి స్థానం ఉండేది. రవీంద్రుడు పాత బెంగాలీ సానెట్‌లను సంస్కరించి సరికొత్తరూపంలో కొత్తసానెట్‌లను తీసుకొచ్చారు. వీటిని "శ్లతబద్ధ సానెట్" అని అన్నారు. సబూజ కవులు ఒడియా కవితకి 'శ్లతబద్ధ సానెట్' రూపంలో కొత్త సొబగులద్దారు. ఈ రూపంలో అన్నదాశంకరరాయ్ రాసిన 'కమల బిలాసీర్ బిదాయ' మొదటి కవితా రూపం.

ఆనాడు బెంగాల్‌లో ఒకే నవలని కొంతమంది కలసి రాసేవారు. అలా రాసిన నవలని 'బారోయారీ' నవల అనేవారు. 1924లో సబూజ రచయితలు తొమ్మండుగురు కలసి ఒడియాలో "బారోయారీ' నవల రాయడానికి పూనుకున్నారు. దానిపేరు "బాసంతి'. విచత్రమేంటంటే తొమ్మండుగురు కలిసి కథ కలపోసుకోవడంగానీ, ఒకళ్ల నొకళ్లు సంప్రదించుకోవడంగానీ లేదు. ఎవరి ఊహ ప్రకారం వారు కథ కల్పించుకొని నవలగా అతకడం. ఇంకా విచిత్రమే మంటే ఈ రచయితలలో కొందరు ఒకరికొకరు పరిచయంగానీ, కనీసం చూసుకోవడంగానీ జరగలేదు. రచయితలు ఎవరికి తోచినట్లు వారు రాసేవారు. ఒకరికొకరితో బేధాభిప్రాయం కూడా ఉంటూ ఉండేవి. అయినా వీరు అద్భుతంగా ఆ నవలను పూర్తి చేసి ఒడియాలో చరిత్ర సృష్టించారు. 'బాసంతి' ఒక కొత్త ప్రయోగం. 1924-26లో వెలువడిన ఈ నవల ఆనాడు మారుతున్న పట్టణ జీవితాన్ని చిత్రించింది.

సబూజ రచయితలలో అన్నదా శంకరరాయ్ అసాధారణ ప్రతిభావంతుడు. మొదటి ఒడియా ఆధునిక కవిగా పేరు సంపాదించి, తరువాత బెంగాలీలో గొప్పరచయితగా, కవిగా, నవలాకారునిగా ప్రసిద్ధుడయాడు. సబూజ కవితలో 'ప్రళయర ప్రేరణా', 'సృజనస్వప్న', 'మానసీ ఓము', 'పరీమహల', 'ప్రణయీ', 'కమళబిలాసిర బిదాయి' మొదలైన ఖండకావ్యాలు రాసారు.

*ధర్మం పేర, నీతిపేర, జాతిపేర, జరుగుతున్న పాపాలూ, అబద్ధాలూ, మోహాలూ, మోసాలూ, కావేషాలూ, బేధభావాలూ, దగాలూ, దాపరికాలూ, దుర్బలుల హాహాకారాలూ, పీడితుల వేదనలూ, దుఃఖం నిండిన అర్ఘ్య పాత్రలూ - అన్నీ కాల్చి మసి చేస్తానూ, నిష్ఠురంగా, నిర్వికారంగా, కాల్చేస్తానూ, ఆ వల్లకాటి మీదే నందనవనం పెంచుతానూ* అంటూ తన కవిత్వంతో సంఘాన్ని పీడిస్తున్న నిష్ఠుర వ్యవస్థపై తిరుగుబాటు బావుటా ఎగరేస్తాడు అన్నదా శంకరరాయ్.

సబూజ సాహిత్య సమితికి అన్నదా శంకరరాయ్‌తో పాటు ప్రధాన సారధ్యం వహించినది కాళిందీ చరణ పాణిగ్రాహి. ఈయనది సాహిత్యంలో చిన్నప్పటి నుంచి అందెవేసిన చేయి. కవిత, కథ, నవల, నాటకం, చరిత్ర, స్వీయచరిత్ర, విమర్శ ... ఇలా అన్నింటా తన ప్రతిభను చాటుకున్నాడు. పత్రికా సంపాదనలోనూ ప్రావీణ్యం సాధించాడు. 'సబూజ కవిత'లో ఈయన ముకుళ కావ్యగుచ్ఛంలో పూరీమందిరం అన్న ఖండిక చూద్దాం.

'మమతలన్నీ మూసుకుని ముక్తి మార్గం వెదకను', 'నాస్తికుణ్ణయితే అయానుగాక', 'స్వర్గంకోసం దేవులాడను', 'ప్రవాసమది', 'ఏముందక్కడ ఆనందం?', 'చిన్నబిడ్డ నవ్వుతో పులకిస్తుందా అది?', 'ప్రియురాలి నూపురాల సంగీతం ఏ వైకుంఠంలో వుంది?', 'ప్రేయసి చందమామ లాంటి అందం కంటే గొప్పదా?', 'అక్కడ గర్విష్టి ఊర్వశి రూపం' అంటూ పరలోక సౌఖ్యం కంటే ఇహలోక స్పృహతో కావ్య సృజన చేసాడు.

'క్షణిక సత్య', 'ఘరిటిఏ లోడా', 'మో కబితా', 'మనేనాహి', 'మహాపాపి' ఈయన కావ్యాలు. 'ద్వాదశీ', 'సాగరికా', 'శేషరశ్మి', 'రాశిఫళ', 'మో కథాయి సరినాహి' మొదలగునవి కథా సంపుటాలు. 'మాంసర బిలాప' కథ సినిమాగా వెలుగు చూసింది. 'మాటిర మణిషి', 'లూహార మణిషి', 'అజర మణిషి', 'ముక్తాగడర క్షుదా', 'అనురచితా' మొదలగునవి నవలలు. "మాటిర మణిషి" గాంధేయ సిద్ధాంతాల ఆదర్శంతో పల్లె జీవితం సజీవంగా చిత్రించిన నవల మట్టిమనుషులు. దీనిలో ప్రధాన పాత్ర రైతు. దీనికి కేంద్ర సాహిత్య అకాదెమీ బహుమతి లభించింది. లుహార మణిషి (ఇనుప మనుషులు) ఇది

కార్మికుని ప్రధాన పాత్రగా చిత్రించిన నవల. అలాగే 'పియదస్సీ', 'పద్మినీ', 'సౌమ్యా' వంటి నాటకాలు రచించి నాటక రచయితగా కూడా కీర్తి సంపాదించాడు. ఈతని కుమార్తె నందినీ శతపథి ఒడిసా ముఖ్యమంత్రిగా పనిచేసారు. బైకుంఠ నాథ పట్టనాయక కవిత్వంలో తాత్విక చింతనా, మార్మిక భావనా, ప్రగతిశీల దృష్టి కనబడతాయి. ఈయన నవీన కవిత్వంతో మొదలుపెట్టినా కొంత పురాతన వైష్ణవ కవుల మధుర భక్తి ఈయన గీతాలలో కన్పిస్తుంది. ఈయనకి 1965లో సాహిత్య అకాడమీ బహుమతికి లభించింది.

సబూజ సాహిత్య సమితిలోని రచయితలందరూ చిన్నకథలో కూడా అత్యంత ప్రతిభ చూపించారు. వీరు 'యుగవీణ' అనే మాసపత్రిక నెలకొల్పారు. ఈ పత్రికలో చాలావరకు చిన్నకథలు ప్రచురించబడ్డాయి. ఈ కాలంలో రొమాంటిక్ కథలు అధికంగా వచ్చాయి. అప్పటి కథకుల్లో కాళిందీ చరణ పాణిగ్రాహి, భగవతీ చరణ పాణిగ్రాహి, గోదాబరీశ మహాపాత్ర, రాజకిశోరరాయ్, అనంత పట్నాయక్, కాన్హూచరణ మహంతి మొదలగువారు ముఖ్యులు. భగవతీచరణ పాణిగ్రాహి ఉత్తమ కథకుడే కాదు, అనేక మంది యువ రచయితల్ని తయారు చేసి ఒడియా సాహిత్య వ్యాప్తికి దోహదపడ్డాడు.

ఆనాటి సబూజ రచయితలను సనాతనులు కొంత విమర్శించారు. కానీ నవీనుడు, సమకాలీనుడు డా॥ మాధవధర మానసింహ కూడా కొంత విమర్శించాడు. ఠాగూరు రచనలను మక్కీకి మక్కీ అనుసరిస్తూ ఆయన కవిత్వ ధోరణిలోనే బెంగాలీ వాతావరణాన్ని అనుకరిస్తూ తమ కవిత్వాన్ని నూతన పంథా అని చెప్పుకున్నారు ఈ ఒడియా యువకవులు. వీరిది దిగుమతి చేసుకున్న కవిత్వం, వీరిలో ఒడియా మూలాలు కానీ, ఆత్మగానీ లేదనీ వీరి రచనలను వీరే స్వంతంగా ముద్రణ చేసుకున్నారనీ సునిశితంగా విమర్శించారు.

కానీ ఆ కాలంలో రవీంద్రుని ప్రభావం లేని సాహిత్య ప్రక్రియ దేశంలో ఏ భాషలోనూ లేదు. అందునా పక్క ప్రాంతమైన రవీంద్రుని ప్రభావం శిల్పంలోనూ, భావంలోనూ, భాషలోనూ పడడం పెద్ద లోపమైతే కాదు. ఎవరెన్ని విమర్శించినా 'సబూజ సాహిత్య సమితి' ఒడియా కొత్త సాహిత్యానికి పచ్చతోరణం కట్టింది ఆనాడు. పదేళ్ళపాటు నవనవలాడింది. ఈ సమితిలో సభ్యులు ఉన్నత పదవులు సాధించడం వల్ల కొంతమంది కలాలు ఆగిపోయాయి. మరికొంతమంది బెంగాలీలో తమ రచనా వ్యాసంగాన్ని కొనసాగిస్తూ ఒడియా సాహిత్యానికి దూరమయ్యారు. ■



## విషయసూచిక

బయట ఎవరో మాట్లాడుతున్నారు
వెచ్చటి గాలి వుండుండి వీస్తోంది
ఎగరలేని పక్షులు కొన్ని
కొమ్మల చాటున
ముఖాన్ని దాచుకుంటున్నాయి

ఆకలేసిన చంటిబిడ్డ
ఎండిపోయిన గుండెల్ని
ఆబగా తడుముతుంది
అతడు గదిలో ఒంటరిగా కూర్చొని
ఎవరో చేసిన గాయానికి
మందు రాసుకుంటున్నాడు

కిటికీ పక్కన పూలమొక్క
నేలరాలిన తన ఆకుల వైపు
జాలిగా చూసుకుంటుంది
కలల ప్రపంచంలో విహరించిన పడుచుపిల్ల
అలసిన కళ్లతో
ఆదమరచి నిద్రిస్తుంది

అటు ఇటూ తిరిగి
సగం అరిగిన చందమామ
చీకటి కొంగు చాటున సేదదీరుతుంది
ప్రేమ విలువ తెలిసిన ఓ ప్రేయసి
చివరి ఉత్తరం రాసేందుకు
ఆగని కన్నీటిని.. సిరాగా వాడుతోంది..!

**- సునీత గంగవరపు**

# మట్టి శ్వాసిస్తుంది!



- అడిగోపుల వెంకటరత్నం
98482 52946

గుహలోంచి వెలువడ్డ సింహం
దారి తప్పిన అడవిదున్నలా
అడుగులు వెయ్యదు
అరణ్య సామ్రాజ్యంలో
జయ జయ స్వాగతమై
మృగరాజు తేజానికి పతాకై
తల ఎగరేసి జూలువిడిచి
పర్వతం ప్రతిధ్వనించేలా గర్జిస్తుంది!

మెరుపు వేగమై పరుగెత్తి వ్యాఘ్రం
వేటాడమే కాదు
మాటువేసి లేళ్ళగుండెలు
అదిరేలా గాండ్రిస్తుంది!

ఎత్తుపల్లాల్ని తాకుతూ

నిలకడగా నిశ్శబ్దంగా
నీటిప్రవాహం సాగదు
గలగలా మంజీర శబ్దారావమై
అస్తిత్వం చాటుతుంది!

ఒంటిమీద పడ్డ నీటిబిందువులా
కాగితంపై కలం
నిశ్శబ్దంగా కదలిపోకూడదు
పుట్టుక సంకేతమై మెరుపులు మెరిసి

ఉరుములు విసిరి
కాగితంపై కవిత
పిడుగై వాలాలి
పాఠకుడు కవితపై
కన్ను మోపినపుడు
చేయి తాకినపుడు
కవిత జన్మవృత్తాంతం
సువర్ణాక్షర చరితై నిలవాలి!

పొంగులెత్తిన చెరువులో వర్షం కురిస్తే
కలుజుకు శ్రమభారమే గాని
ఎండి పగుళ్ళు బారిన తటాకంపై
తొలకరి వానైతే
చిగురించిన చెరువు పెదాలపై
పుట్టిన కవిత
ఒడ్డున కోకిల గానమై
గున్నమామిడి చెట్టుగుబుల్లో
కళ్యాణి మోహన రాగాలై
ప్రతిధ్వనిస్తాయి
చెవుల్లో గూడుకట్టి
కూతవేటు దూరం ప్రయాణిస్తాయి!

■



# వేరు వాసన

- కేశవ్
9831314213

'**తా**తయ్యా! నీ కోసం ఎవరిదో ఉత్తరం' మనవడు చేతిలో ఉత్తరం పెట్టి పరుగులంకించుకున్నాడు ఆడుకోవడానికి.

ఉత్తరం ఉత్తరంలా లేదు. అట్టలా గట్టిగా ఉంది. ఏదో కార్డులా ఉంది. ఇంత పెద్ద హైదరాబాదు మహానగరంలో ఇంత సీనియర్ మోస్ట్ సిటిజన్‌ని గుర్తించి పంపిన ఈ ఉత్తరం ఎవరిదై ఉంటుంది! దాదాపు అయిదు సంవత్సరాల నుంచి ఉత్తరాల వాసనే లేదు. అకస్మాత్తుగా ఎడారిలో వర్షంలా ఉత్తరం ఏమిటి?

ఫోన్లతో నిండిపోయిన ఈ అగాధ భూగ్రహం మీద ఉత్తరాల మమకారాలను పంచుతోన్న ఆ మహానుభావులు ఎవరు?

ఉత్తరం ప్రేమతో స్పర్శించాను. వెనకా ముందు చూశాను. విశ్వనాథం అని స్పష్టంగా ఆంగ్లంలో రాశారు. ఫ్రం దగ్గర ఏదో సంస్థ పేరు అస్పష్టంగా కనిపిస్తోంది. స్టాంపు కొట్టారు. అది చెదిరిపోయినట్టుంది. కళ్ళద్దాల కోసం షోకేసు మీద చూశాను. ఆతృతగా కళ్ళద్దాలు పెట్టుకున్నాను.

'ఇచ్ఛాపూర్ సాహిత్య సాంస్కృతిక సంఘం' అని రాసి ఉంది. దాదాపు ఇరవై ఏళ్ల ముందు విడిచిపెట్టిన వేరు మరలా తగిలినట్టుంది.

'మామయ్య గారూ! భోజనం రెడీ. వచ్చెయ్యండి.' కోడలు సంహిత పిలుస్తోంది.

'భోజనం అవసరం లేదు. ఈ ఉత్తరంతో ఆకలి తీరి పోయింది.' అనాలనుకున్నాను. కానీ, కోడలు ఒప్పుకోదు కదా! తరతరాల నా బెంగాల్ బంధం వీరికి అర్థమైతేనా! భోజనం ముగించి ఉత్తరం చించడంలో పడ్డాను. కత్తితో చివరి అంచులో కన్నం చేసి మెల్లగా చించాను. మీద కవరుని కూడా. అనుబంధాల అక్షరాలను డెస్కులో ఉంచాను.

'ఇచ్ఛాపూర్ సాహిత్య సాంస్కృతిక సంఘం గోల్డెన్ జూబ్లీ' అని రాసి ఉంది. కార్యక్రమానికి తప్పకుండా రావాలని రాశారు. వెళ్ళలేనేమో అన్న విచారం. ఈ వయసులో యింకా ప్రయాణమా నాన్నా' అని అబ్బాయి కోపగించుకుంటాడేమో! ఇంకా నెల ఉంది. విడిచి వచ్చేసిన వేరుని మరలా తాకాలి. ఎన్నెన్నో జ్ఞాపకాలు - ఎన్నెన్నో మధుర స్వప్నాలు ...

◆ ◆ ◆

హైదరాబాదు నుంచి వస్తోన్న పెద్ద అయ్యేఎస్ ఆఫీసర్లకు, రచయితలకు యిలా చిన్న చిన్న గదుల్లో పెట్టేస్తామా? అని ఒకరూ-

అరె! మనది కార్మిక సంఘం., మనకు ఎంత వీలవుతుందో అంతే చేయగలం. ఏసీ రూంలు ఇచ్చే కెపాసిటీ మనకుందా!- ఇంకొకరూ. అలా అయితే వారికి ఆహ్వానం ఎందుకు చెయ్యాలి- మరొకరూ. వచ్చిన అతిథులు అడ్జస్టు చేసుకుంటారని ఒకరూ, అలా ఎందుకు చేసుకుంటారు? మనమే వారికి అసౌకర్యం లేకుండా చూడాలి అని మరొకరూ.

'ఒక ఫ్లాట్ తీసుకుందాం. బాత్రూం సదుపాయాలు సరిగా ఉండాలి! అని మిత్రుడు ఈ బాధ్యతను తన నెత్తిమీదకు వేసుకోవడం, సరేలే అని మిగతావారు డీలా పడడం - మాటలు, కేకలు, గోల, చర్చలు - ఇందులోనే ఒక మానవత, ఒక ఐక్యత, ఒక సామాజిక చైతన్యం.. కొండల్ని మోసేద్దాం పద - అనే దూకుడు స్వభావం ...

ఎంత గొప్ప శక్తి! ఎంత గొప్ప బలం ఆ రోజు తనకు - తన మనుషులకు - తన శ్రామిక జనాలకు!

◆ ◆ ◆

'తాతయ్యా! ఈ కాగితంతో ఆడుకోవచ్చా!' మనవడు ఉత్తరం చూపిస్తూ అడుగుతున్నాడు.

'అమ్మో! ఇది ఆడుకునే కాగితం కాదురా తాతా!' అంటూ మనవడి చేతినుంచి ఉత్తరాన్ని గబాలున తీసుకున్నాను. కొంచెం ఆగితే, అది పడవో, గాలిపడగో అయిపోతుంది!

ఎలాగైతేనేం, అబ్బాయికి నచ్చజెప్పడం, కోడలుకి నచ్చజెప్పడం జరిగిపోయాయి. 'మామయ్యగారికి ఏసీ త్రీటయర్‌లో ఒక టికెట్ తీసేయండి' అని కోడలు అన్నా, నేను ఒప్పుకోలేదు. స్లీపర్‌లో జనాలతో హెూమ్లీగా ఉంటుంది. ప్రజల్లో ప్రజల మధ్య జీవించాను. నాకు ప్రజలే మనసుకు స్పందన అనాలనుకున్నాను. కానీ, వారే అర్థం చేసుకున్నట్టున్నారు నా మనస్తత్వం.

బెంగాల్ భూమి మీద అడుగుపెట్టబోతున్నాను. దాదాపు రెండు దశాబ్దాల తర్వాత .. విడిచిన వేరు, తను విడిచిన మమతానురాగాల కోసం, చిన్న చిన్న గదుల్లో, వీధుల్లో జనపనార మిల్లుల వీధుల జీవితాల్నీ, బతుకు బళ్ళని మరలా చూడడం కోసం తన ప్రయాణం- పతితుల భ్రష్టుల బాధా సర్పద్రష్టుల జీవితాల్లోకి తన ప్రయాణం మరలా!

మిల్లులూ, గేటు మీటింగులూ, ధర్నాలూ, సమ్మెలూ, పోరాటాలూ, ఉద్యమ వాతావరణం వామపక్ష పార్టీ చేతుల్లో పరిపాలన ఒక వైపు-

ఇచ్ఛాపూర్ సాహిత్య సాంస్కృతిక సంఘం, సాంస్కృతిక కార్యక్రమాలు, విద్యా సంస్థల నిర్మాణం, ప్రతి ఇటుక వెనుక తెలుగు శ్రామికుడి కృషి, ఆరాటం, చెమట ఆవేదన, వలస బతుకుల స్వేదం, మధ్య మధ్యలో ఆగిపోయే మిల్లుల వెనుక బతకాలనే ఆరాటం, తెలుగు ప్రజలకు తెలుగులో విద్య కోసం ఆరాటం-

అంతా కలలా గడిచిపోయింది. రిటైర్ కావడం, జీవనాధారం బెంగాల్‌లో కోల్పోవడం, కుమారుడు హైదరాబాద్‌లో ఉద్యోగం, హైదరాబాదుకు శరీరాన్ని మోసుకురావడం- మనసుని బెంగాల్ కమ్యూనిస్టు భూమి మీద ఉంచేస్తూ!

సుదీప్తో ఎలా ఉన్నాడో! ఏమో!

చాలా రోజుల నుంచి ఫోనులు లేవు.

సంఘం తనకు ఒక కన్ను అయితే, సుదీప్తో తనకు రెండో కన్ను. తను కమ్యూనిస్టు పార్టీ కార్యకర్త. తను కూడా సాధారణ సభ్యుడే. ఎన్నో పుస్తకాలు, పత్రికలు, కరపత్రాలు చదవడం - ఆయన బెంగాలీవి కూడా ఎన్నో ఇచ్చేవాడు. తెగ చదివే వాళ్ళం. తెలుగు సంఘంతో పనిని మాత్రమే పంచుకున్నాను. కానీ, సుదీప్తోతో కమ్యూనిస్టు ఆలోచనలను పంచుకున్నాను.

మిల్లులు ఎప్పుడు పడితే అప్పుడు లాకవుట్ చేసెయ్యడం, కొత్త అగ్రిమెంట్లకు కార్మికులను లొంగదీయడం, దాన్ని యూనియన్లు అంగీకరించకపోవడం- ఒకటా, రెండా! ఎన్నోసార్లు సుదీప్తో, రైటర్స్ బిల్డింగుకి యూనియన్ తరపున వెళ్ళేవాడు. మిల్లు యజమానులతో పోరాడడం, కార్మిక వ్యతిరేక అగ్రిమెంట్లకు వ్యతిరేకంగా మాట్లాడడం -

సుదీప్తోని కలవాలి. ఇదే సరైన సందర్భం. వస్తున్నానని ఫోన్ చేస్తే ఎంత సరదాపడతాడో! ఆ మధ్య కాస్త అనారోగ్యంగా ఉన్నాడనీ, ఏదో చిన్న ఆపరేషన్ అయిందనీ తెలిసింది. కానీ, వివరాలు ఏమీ తెలీవు.

పెద్ద పెద్ద అంగలేసుకుంటూ ఫలక్‌నామా ఎక్స్‌ప్రెస్ హౌరాలో కుందేలులా ఆగింది. సాయంకాలం అయిదు దాటింది. విపరీతంగా జనాలు కనిపిస్తున్నారు. రెండు దశాబ్దాల్లో హౌరా రద్దీ తగ్గలేదు. స్టేషన్ కాస్త అందంగా కనిపిస్తున్నట్టుంది.

'సర్! మీరేనా విశ్వనాథం గారు?' అబ్బాయి అడుగుతున్నాడు. హమ్మయ్య అనుకున్నాను. ఈ అబ్బాయి రాకపోతే తను హౌరా దాటి వెళ్ళగలిగే వాడినా ఈ వయసులో.

'పదండి' అన్నాడు లగేజ్ భుజానికి వేసుకుంటూ. అబ్బాయి పేరు మహేశ్ అన్నాడు.

ప్లాట్‌ఫాం మీద నడుస్తున్నాను. ఎన్నో అనుబంధాలను మోసుకొచ్చిన హౌరా స్టేషన్ ఎందరి కోసమో హౌరా స్టేషన్ రావడం, ఎందరినో సాగనంపడం, ట్రైను నడుస్తుంటే, ట్రైనుతో పాటు నడవడం, టాటా చెప్పడం, ఇంకాస్త పరుగెడుతూ టాటాను స్లోమోషన్‌లో చెప్పడం, ఇంకొందరు ఆత్మీయులకు ఏ ఇండియా టుడేయో, ఆంధ్రజ్యోతియో, ఆంధ్రప్రభయో కొనడం, వారికివ్వడం, వీలర్స్ షాప్‌లో ఫ్రంట్‌లైన్ తనకోసం కొనుక్కోవడం, హిందూ కోసం గాలించడం ... అంతా తీయని అనుభూతి. ఆత్మీయతల్ని ట్రైను మెల్లగా తీసుకెళ్ళిపోతుంటే, వారు పర్మనెంటుగా ఎడబాటు అయిపోతున్నట్టు తీయని బాధ. కంట్లో మెల్లగా కదిలే కన్నీరు.. ఆ కన్నీటి చుక్కల్ని అపురూపంగా దాచేసుకోవడం.

'సర్! జాగ్రత్త. మరో ట్రైను అవతలి ప్లాట్‌ఫాంలో వచ్చింది. మీరు నా చేయి పట్టుకోండి. ఈ సమయంలో చాలా రద్దీగా ఉంటుంది. తోసేస్తారు' అని ఆ అబ్బాయి నా ఆలోచనలను కనిపెట్టాడో ఏమో - నన్ను అలర్ట్ చేశాడు.

హౌరా మెయిన్ ప్లాట్‌ఫాం దాటి ఒక లోకల్ ట్రైనులో నన్ను కూర్చోబెట్టాడు. 'బేండెల్ లోకల్' అని అన్నాడు మహేశ్. 'ఇదైతే కొంచెం ఖాళీగా ఉంటుంది. మిగిలిన ట్రైనులు ఆఫీసు టైంలో ఎక్కలేమండీ' అన్నాడు మహేశ్.

అబ్బాయి డిగ్రీ వయసులో ఉన్నట్టున్నాడు. నన్ను బాగానే గౌరవంగా చూస్తున్నాడు. లగేజీని జాగ్రత్తగా పైన ఏర్పాటు చేశాడు. బెంగాలీ బాగానే నేర్చేసినట్టున్నాడు.

ఇంతలో గేటు దగ్గర ఎవరో గట్టిగా అరుస్తున్నారు. గొడవ పడుతున్నట్టున్నారు. అటువైపు చూశాను.

'ఇవన్నీ మామూలే అండీ. ఎవరో ఎవరి కాలో తొక్కేసి నట్టున్నారు. అందుకే గొడవ' అన్నాడు మొబైల్‌కి హెడ్‌ఫోన్ తగిలిస్తూ.

'మీరు తెలుగు భాష, తెలుగు విద్యార్థుల గురించీ, తెలుగు విద్యాలయాల గురించీ చాలా కష్టపడ్డారట. నేను బయల్దేరు తుంటే, మా కమిటీ సభ్యుడు మీ గురించి చెప్పారు'

'ఆ! అప్పుడు పరిస్థితులు అలాంటివి బాబూ!' అన్నాను మనసులో గొప్ప ఆనందంతో.

ఎంత వేదన! ఎంత పేదరికం! ఎంత ఘర్షణ! శ్రీకాకుళం, గంజాం జిల్లాల నుంచి వందల, వేలకొలది తెలుగు ప్రజలు వలసలు రావడం! దెబ్బతీసిన చేనేత పరిశ్రమలు, దున్నేవాడికి పిడికెడు అన్నం పెట్టని భూస్వామ్య దోపిడీ! బెంగాల్‌లో అప్పుడప్పుడే పుంజుకుంటున్న బంగారు నార – జనపనార – ప్రజల ఊపిరి – కాలే కడుపులకు పిడికెడు భోజనం – అస్థిర జీవితాలకు వెలుగు నార – జనపనార. చిన్న చిన్న గదుల్లో మిల్లు దగ్గరే బతుకులు – పెళ్ళిళ్ళు – పిల్లలు – పండుగలు – వందలాది కుటుంబాలు – తెలుగు పిల్లలకు తెలుగులో విద్య కావాలనే ఆరాటం – ఆవేదన – మిల్లుల దగ్గర అటొకరూ – యిటొకరూ టవల్ పట్టుకొని జీతాల రోజు విరాళాలు దండడం – విద్యాలయం కోసం – భక్తులు భగవద్గీత చదవడం – చదివి విరాళాలు దండడం – ఇటుక పక్కన ఇటుక – గోడ పక్కన గోడ – శ్రామికుల చెమట – శ్రమ జీవుల ఆవేదన – హృదయం – ప్రేమ – మన పిల్లలు – మన విద్యాలయం – మన సంఘం – మెరుగైన బతుకుల కోసం తపన.

'సర్! చెవులు మూసుకోండి!' అంటున్నాడు మహేశ్.

'ఏం ? అనేలోగానే అటువైపు నుంచి మరో ట్రైను పెద్ద శబ్దంతో పరుగెత్తింది.

'సర్! గోల్డెన్ జూబ్లీ చాలా పెద్ద హంగామాతో చేస్తున్నాం. కనీవినీ ఎరగని చరిత్ర ఇది. మీరు చాలా ఎంజాయ్ చేస్తారు. నో డౌట్! ఎన్ని పనులో – గొప్ప టెన్షన్ లో ఉన్నాం" ఒక చెవిలో హెడ్‌ఫోన్ బయటికి తీసి మహేశ్ చెబుతున్నాడు – నేను బోర్ అవ్వకుండా ఉండడానికి! ఎందుకో మహేశ్ మాటలు రుచించలేదు. అనీజీగా ఉంది.

'సర్ మరో స్టేషన్ తర్వాత మన చందన్‌నగర్ వస్తుంది. రెడీ అవ్వండి' అని తన హెడ్‌ఫోనుని జేబులో పెట్టేసి బ్యాగుని భుజాన వేసుకున్నాడు.

నా చేయి పట్టుకొని ఎక్టూ సొరూన్ (కొంచెం జరగండి) అంటూ గేటుదగ్గరకు వచ్చాడు మహేశ్.

చందన్నగర్‌లో దిగడం నా ప్రయాణంలో ముఖ్యమైన భాగం – ఫ్రెంచివారు ఏర్పరచుకొన్న కాలనీ .. చందన్ నగర్ బెంగాల్ లో జగధాత్రి పూజకు చాలా పేరు. నాకైతే ఈ పూజలు చిరాకు. కానీ,సుదీప్తో ఆలోచనలు వేరు. ఈ పూజల్ని వ్యతిరేకిస్తే ప్రజలు మనల్ని దూరం చేసుకుంటారు. సాంస్కృతిక సంబంధాలను దూరం చేసుకుంటే మనం పనిచెయ్యడం కష్టం అంటాడు. నేను కాదు అంటాను. ఎప్పుడూ వాదనే. అలాంటి ఆదర్శ మిత్రుడి నివాసం ఇక్కడే.. రెండు దశాబ్దాల తర్వాత కలుసు కోవడం – ఎన్నో రాజకీయ, ఆర్థిక, సామాజిక అంశాలు – కమ్యూనిస్టు వామపక్ష పరిపాలన – ఆటుపోట్లు – సింగూర్ – నందిగ్రాం – పరివర్తన్' పేరుమీద వచ్చిన మమతా బెనర్జీ ప్రభుత్వం – రాజకీయ పరిణామాలు – కమ్యూనిస్టు పార్టీ కార్యకర్తలు ఎదుర్కొనే సమస్యలు – కొత్త స్ట్రాటజీ – ఎన్నో చర్చించాలి.

సుదీప్తో అనర్గళంగా మాట్లాడతాడు. తర్కంతో అవతలి వ్యక్తిని మాట్లాడనివ్వడు. బెంగాలీవాళ్ళు– అందులోనూ కమ్యూనిస్టులు – శ్రావ్యమైన బెంగాలీ భాషలో గంటల తరబడి ఉపన్యాసాలిస్తారు. సుదీప్తో, అలాంటి ప్రొడక్టే. ఈ మధ్య కేన్సర్ పేషెంట్ల కోసం ఒక కార్యక్రమం కూడా చేపట్టినట్టు తెలిసింది.

రోగుల్ని పీజీ హాస్పిటల్‌కి, మెడికల్ కాలేజీకి తీసుకెళ్ళడం, వారి ట్రీట్‌మెంట్ బాధ్యత తీసుకోవడం, అందులో కమ్యూనిస్టు వాసన ఉన్న జూనియర్ వైద్యులతో పరిచయం పెంచుకోవడం, వారిని తన ప్రాంతం తీసుకురావడం, ఫ్రీ మెడికల్ శాంపుల్స్ రోగులకు పంచడం, ఇంట్లో చర్చలు జరపడం, కమ్యూనిస్టు ఐక్యతను పటిష్టంగా ముందుకు తీసుకు వెళ్ళడం – ప్రజల మనిషి సుదీప్తో ...

చందన్ననగర్‌లో దిగి మహేశ్‌ని పంపించాను. సుదీప్తోతో మాట్లాడుతూ రాత్రి రెండు దాటిపోయింది. సుదీప్తో బాగా నీరసించిపోయాడు. అయినా ముఖంలో వెలుగుంది. మంచం చుట్టూ కమ్యూనిస్టు పుస్తకాలూ – పత్రికలే! నాటినుంచి నేటివరకు అదే ఆక్సిజను సుదీప్తోకు!

అలసిన శరీరానికి నిద్ర అవసరం వచ్చింది.

ఉదయం వేగమే లేవాల్సి వచ్చింది. సాయంకాలం నాలుగు గంటలకు గోల్డెన్ జూబ్లీ కార్యక్రమం.

ఉదయాన్నే టిఫిన్ చేసి, సుదీప్తోకు బై చెప్పి పడవ ఎక్కి నది దాటాను. సుదీప్తో కుమారుడు పడవ ఎక్కేవరకూ తోడు వచ్చాడు. ఆటో ఎక్కి ఇచ్చాపూర్ చేరుకొన్నాను. ఓ అబ్బాయి ఆటో దగ్గర నాకోసమే ఎదురు చూస్తున్నట్టున్నాడు.. ఆటో దిగి నేరుగా విద్యాలయానికి తీసుకుపోయాడు. విద్యాలయం తనివి తీరా చూసుకొన్నాను. ఎన్ని సమావేశాలు ఈ గదుల్లో చేశామో! చర్చలు – కేకలు – ప్రణాళికలు – గొడవలు – దెబ్బలాటలు – అన్నిటికీ మించి విద్యాలయాన్ని తెలుగు ప్రజలకు

అందించాలనే ఐకమత్యం – ఎన్ని గదులు పెరిగాయో! నాకు నచ్చిన గ్రంథాలయం గదిలో దూళిని తోసుకుంటూ ప్రవేశిం చాను. పుస్తకాలు చూస్తోంటే ఎన్నో ఏళ్ళ నుంచి పుస్తకాలు ఎవరూ తీయడం లేదా అన్పించింది. పిల్లలకు సాహితీ సువాసన అందడం లేదా అనిపించింది.

సమయం తక్కువ ఉండడంతో బయటికొచ్చాను. దగ్గరలోనే రిక్షా ఎక్కాను ఓ అబ్బాయి సహాయంతో. గురజాడ గ్రంథా లయంలోకి అడుగుపెట్టాను. తెలుగు ప్రజల కోసం తెలుగు సాహిత్యం అందివ్వాలనే తపనతో ఈ గ్రంథాలయం కోసం ఎంతో కృషి చేశాం. గ్రంథాలయం లోపలికి అడుగుపెట్టాను.

మాటల్లో లైబ్రేరియన్ ఓ మాట చెప్పాడు – నా మనసులో మెదుల్తున్న మాటే! గ్రంథాలయంలో పుస్తకాలు ఇప్పుడెవ్వరూ చదవడం లేదని!

ఎంత శ్రమించాం! ఎన్ని వేల పుస్తకాలో! గ్రంథాలయ సిబ్బంది విజయవాడ వెళ్ళడం, పుస్తకాలు మోసుకు రావడం, గొప్ప సాహితీపరంగా మన ప్రాంతాన్ని మలచాలనే ఆశ – అత్యాశ – ఎన్ని పుస్తకాలో – ఎన్ని పత్రికలో –

'సాహితీ విలువల్ని అందుకున్న వారూ, రచనలు చేసే వారూ, పుస్తకాలు చదివే వారూ, రాష్ట్రస్థాయిలో గుర్తింపు పొందిన మన రచయితలు లేకపోలేదు. సామాజిక చైతన్యంతో కూడిన కార్యక్రమాలు చేసే వారు కూడా లేకపోలేదు. మన తెలుగు వారి అభివృద్ధి కోసం ముందుకొచ్చే జనాలు లేకపోలేదు. అయితే, ఇది వేళ్ళమీద లెక్కపెట్టగలిగేటంత తప్ప మరేమీ కాదు. పైగా శాశ్వత ప్రణాళికలతో జరిగే కార్యక్రమాలు తక్కువ. సామాజిక బాధ్యతకు ఆర్భాటాలూ, వింత సొగసులూ చుట్టేశాయి!

లైబ్రేరియన్ చెప్పుకుపోతుంటే చర్చ మధ్యలో టైం చూసు కోలేదు. అలా చర్చిస్తూ, రెండయిపోయింది. భోజనం ఒక మిత్రుడి ఇంట్లో ముగించి 'ఇచ్ఛాపూర్ ఉత్తమ్ మంచ్'లోకి అడుగుపెట్టాను.

తెలుగు ప్రజలు కిటకిటలాడుతున్నారు. లోపలికి వెళ్ళగానే ఓ అబ్బాయి చేయి పట్టుకొని ముందు సీట్లో కూర్చోబెట్టడంతో సరిపోయింది. లేకపోతే, తనకు సీటు దొరకడం అసాధ్యమే!

'మరో అయిదు నిమిషాల్లో హాల్లోకి అడుగుపెడుతున్నారు మన ప్రియతమ నటుడు!' అంటూ వేదిక మీద ఓ అబ్బాయి ఊపిరి తిరక్కుండా మాట్లాడుతున్నాడు. జనమంతా చప్పట్లతో ముంచేశారు.

'ఏ నటుడండీ!' అడిగాను పక్కన ఉన్న వ్యక్తితో.

'మీకు తెలీదా ఇంతవరకూ! భలేవారే!' అని ఆయన అంటుండగానే అందరూ నిల్చుని చూస్తున్నారు.

వేదిక మీద కన్వీనర్ ఏదో దండకం చదివినట్టు ఆ నటుడి కీర్తి ప్రతిష్టలు, నటించిన సినిమాల పేర్లు ఏకధాటిగా, ఆగకుండా చెప్పేస్తున్నాడు. ఈ సినిమా నటుడు ఇక్కడి తెలుగు పేద పిల్లలకు ఏదైనా సహకరిస్తున్నాడేమో' అనుకున్నాను.

'ఆయన్ని మేమే చాలా శ్రమించి తీసుకొచ్చాం సర్! ఎంత ఖర్చయినా, లక్ష రూపాయలయినా సరే భరిస్తామని మన తెలుగు కుర్రాళ్ళు మాటిచ్చారు' అన్నారు పక్కన కూర్చున్నాయన.

రెండు గంటలు నటుడి పర్వం నడిచింది. తర్వాత డాన్సులు ఆరంభమయ్యాయి. నటుల ఆర్భాటాల్లో, డాన్సుల విలాసాల్లో సాహితీ సువాసనలు, విద్యా సుగంధాలు కనుమరుగయ్యాయి – ప్రపంచీకరణ చీకట్లోకి.

యాభై సంవత్సరాల సుదీర్ఘ ప్రయాణం.

యాభై వేల మంది శ్రామికుల గుండె చప్పుడు–

ఆత్మఘోష

యాభై సంవత్సరాల ఆరాటం – ఆవేదన – తపన.

ఆకలి కడుపులతో ఆంధ్రప్రదేశ్ నుంచి వచ్చిన వలస

– మండే కడుపులతో,

– ఆగిపోయే జనపనార మిల్లులతో అస్తవ్యస్తమయ్యే బతుకులు

– రూపాయి పక్కన రూపాయి పెట్టి చెంబుల్లో జమ చేసుకునే కార్మిక సంతతి–

– వేలూ లక్షలు విలాసాలకు విసిరేసే ప్రపంచీకరణ ఫలాలు.

ఎవరో తన పేరు పిలుస్తున్నట్టున్నారు. వేదిక మీదకి రమ్మని! 'అమ్మో! తను మాట్లాడలేదు. తనకు వేదిక మీద మాట్లాడే అలవాటు లేదు.' పక్కన నా గురించి తెలిసిన ఎవరో అంటున్నారు.

'సర్! మిమ్మల్నే! రండి' అంటూ మహేశ్ తన చేయి పట్టుకోబోతున్నాడు వేదిక మీదకు తీసుకెళ్ళడానికి.

వేదిక ఎక్కాను.

వేదికలు అలవాటు లేని నాకు, నేపథ్యంలో మాత్రమే పనులు చేసే అలవాటు ఉన్న తనకు ఏం మాట్లాడాలో అర్థం కావడం లేదు.

మైక్రోఫోను తీసుకున్నాను. చేయి వణుకుతోంది. అందరికీ శుభాకాంక్షలు తెలియజేశాను.

'మీరంతా నా కాలాన్ని యాభై సంవత్సరాల వెనక్కి తీసుకెళ్ళి నాకు సహాయం చెయ్యగలరా?' అని ముగిస్తూ మైక్రోఫోన్ అనౌన్సర్‌కి అందించాను. అంతా తెల్లమొహం వేస్తోంటే, మహేశ్ చేయిపట్టుకొని సీటు దగ్గరకు వచ్చాను. ■

# గోడల్లేని గది

పి.శ్రీనివాస్ గౌడ్
99494 29449

1

క్రమంగా ఈ గది గడ్డకట్టడం చూస్తున్నాను
గది మూగది కావడం చూస్తున్నాను
గదిలో ఆలోచనల ఆత్మహత్యలు చూస్తున్నాను
గదిలో కలలు కనుమూయడం చూస్తున్నాను
గది కనుల జీవం రాలిపోవడం చూస్తున్నాను
గది మొకం క్రమంగా పాలిపోవడం చూస్తున్నాను

ఈ గది గదిలా లేదు!

2

గది ఎలాంటిది?
అది నన్ను కళ్లారా కనింది
స్తన్యమిచ్చింది రక్తమిచ్చింది
నాలుగు గదుల హృయమిచ్చింది
నాకో నదినిచ్చింది
ఊహల పడవనిచ్చింది
పూల చెట్టును చేసి
ఆకాశంలో ఎగరేసింది

గది ఎలాంటిది?
నేను కళ్లు తెరవక ముందే
గది కళ్లు తెరిచి వుంది
కొమ్మల్లో కలలు పొదుగుతూ వుంది
గూడు కట్టుకున్న
సకల చరాచరాన్ని సాకుతూ వుంది
విచ్చుకున్న మేధల్లో
పిడికిలి నాటుతూ వుంది
గది మరొక గోడల్లేని గదిని
లోకంనదిలో వదులుతూ వుంది

3

ఎలాంటి గది
ఎట్టా అవుతోంది..!
ఈ గది మునుపటి గదిలా లేదు
విప్పారిన మదిలా లేదు
పరిమళించే హృదిలా లేదు

గదిలో పొగ చేరుతోంది
పాము పాకుతోంది
మాట్లాడే గది మీద



గద్ద తిరుగుతోంది
కొమ్ము విసిరే గది మీద
నల్లకోటు మొరుగుతోంది
కట్టు తెంచుకుంటున్న గది మీద
మాయమతం చిక్కం బిగుస్తోంది
గదిలో సూర్యచంద్రులను వెళ్లగొట్టి
తలుపులు మూసి గది కళ్లు మూసే
చట్టరచన జరుగుతోంది!

గది గర్భగుడి కావాలనే రాజ్యం
గది గుడ్డి బానిస కావాలనే రాజ్యం
గది బడి కావడం..
గది ప్రశ్నకు పునాది కావడం..
గది ఉరికొయ్యల మీదా
కొరకరాని కొయ్య కావడం..

రాజ్యం
గదిని గదిలా వుంచదు
గదిలో గబ్బు వదులుతుంది
జైలుగదిలో పెడుతుంది
కటకటాల చీకటిలో
పాడుపెడుతుంది
కొంచం కొంచంగా గదిని
దేశద్రోహి కొక్కెనికి తగిలిస్తుంది
అధికారం చర్నాకోలా
గదులన్నింటి రక్తం
రుచిమరుగుతుంది

4

గది గదిలా ఉండలేదు
ఆశలు కూలుతున్న కళ్లు
బరువుగా తెరుస్తా వుంది

అవును
గది గడ్డకట్టడం చూస్తున్నాను
బతికి బట్టకట్టడానికి
గది తన్నుకులాట
చేష్టలుడిగి చూస్తున్నాను
రాజ్యం నా చుట్టూ పెట్టిన పుట్టల్లో
జరజర పాకే భయం పాముపిల్లల
వెన్ను జలదరింపులతో
చూస్తూ చూస్తూ చూస్తూ
చేష్టలుడిగి చూస్తూ చూస్తూ
చూస్తూనే వున్నాను

5

వాళ్లెవరు...?
గదిని చేతులారా
చేతలుడిగి చంపుకుంటున్నావంటున్నారు
వాళ్లెవరు...?
గది కన్నా ముందే
నేనే మరణించానంటున్నారు
నేను మెల్లగా మరణించడం
మొదలయాకే
గది మరణించడం
మొదలయిందంటున్నారు!
ఎందుకయినా మంచిది
చేష్టలుడిగి చూస్తుండే నాలాంటి వాడు
మరణించడమే మంచిదంటున్నారు

వాళ్లెవరు..?
రాజ్యం కంటే
నేనే ప్రమాదమంటున్నారు
వాళ్లెవరు..?
గోడల్లేని గదుల నుండి
పుట్టుకొచ్చామంటున్నారు..
వాళ్లెవరు..?
గదిని సమాధి చేయడం
వాళ్లు బతికుండగా
సాధ్యపడదంటున్నారు..!

6

గది
నాలుగ్గోడల గది కానే కాదు
గోడల్లేని గదుల్ని కనే
పురిటినొప్పుల గది!

■



# సాహిత్య విమర్శను ఉన్నతీకరించిన బాలగోపాల్

- పిల్లా కుమారస్వామి
94901 22229

బాలగోపాల్ సాహిత్యకారుడు కాదు. ఆయనది మార్క్సిస్టు రాజకీయం. ఆయన ఎంచుకున్నది ప్రజల ప్రజాస్వామిక హక్కుల పరిరక్షణ. ఆయన మార్క్సిస్టు కావడం వల్ల, సాహిత్యం, పాండిత్యం కలగలసిన కుటుంబ నేపథ్యం నుంచి వచ్చిన వాడవడం వల్ల సాహిత్యరంగాన్ని స్పృశించ కుండా ఉండలేకపోయాడు. సమాజాన్ని అర్థం చేసుకోవడానికి ఆయనకు మార్క్సిజం ఎంతగా తోడ్పడిందో సాహిత్యాన్ని విశ్లేషించడానికీ అది అంతే తోడ్పడింది. ఆయన రాసినవి కొన్నైనా వాటినన్నింటిని కలిపి 'సాహిత్యంపై బాలగోపాల్' పేరుతో హైదరాబాద్ బుక్‌ట్రస్టు ఒక గ్రంథాన్ని ప్రచురించింది. ఈ గ్రంథంలో 13 సాహిత్య వ్యాసాలున్నాయి. 3 సినిమాలపై సమీక్షలు, 7 గ్రంథాలపైన సమీక్షలు, చెరబండరాజు, చేరా, త్రిపురనేని, కెవిఆర్‌లపై వ్యాసాలూ ఉన్నాయి.

రాయలసీమలో కట్టమంచితో ప్రారంభమైన సాహిత్య విమర్శ పరంపర నేటికీ కొనసాగుతుంది. ఆ పరంపరలో భాగంగానే రాయలసీమకు చెందిన బాలగోపాల్ కూడా మార్క్సిస్టు విమర్శకునిగా మనకు దర్శనమివ్వడం యాదృచ్ఛికమే అయినా అది ఒక విశేషంగానే చెప్పుకోవచ్చు. రారా, త్రిపురనేని, సింగమనేని సాగించిన మార్క్సిస్టు విమర్శా ప్రభావం తెలిసిందే. అలాగే రాయలసీమ ప్రాంతంలో ప్రస్తుతమున్న కేతు విశ్వనాథరెడ్డి, రాచపాళెం చంద్రశేఖర రెడ్డి, తెలకపల్లి రవి మొదలైన మార్క్సిస్టు విమర్శకులు సాహిత్య విమర్శ వ్యాసంగాన్ని నేటికీ కొనసాగిస్తున్నారు. బాలగోపాల్ ప్రత్యేకత ఏమంటే ఆయన ప్రజలతో కలిసి పనిచేయడం. దాని వల్ల ఆయన చేసిన సాహిత్య విమర్శకు విలువ మరింత పెరిగింది.

సమాజంలో వైరుధ్యాలున్నాయని అవి ఉన్నంత కాలం ప్రజాసాహిత్యంతో పాటు ప్రజలకు దూరమైన సాహిత్యం కూడా ఉంటుందంటారు బాలగోపాల్. దీన్ని మార్క్సిస్టులు గుర్తించాలని కోరారు. సాహిత్యాన్ని సాహిత్యంగా విమర్శ చేసేవాళ్ళు సమాజంతో సాహిత్యానికి గల సంబంధాన్ని విస్మరిస్తారన్నారు. మార్క్సిస్టు విమర్శకు ప్రమాణాలు, సాధనాలు నిర్దిష్టంగా లేకపోయినా మార్క్సిస్టు విమర్శకులు సాహిత్యాన్ని రాజకీయ, ఆర్థిక, సామాజిక, చారిత్రక సందర్భాలతో చూస్తారన్నారు. బాలగోపాల్ ఫ్రాయిడ్ చెప్పిన సిద్ధాంతాన్ని మార్క్సిస్టులు పట్టించుకోవాలని చెపుతాడు. ఫ్రాయిడ్ మనస్తత్వ సిద్ధాంతం ప్రకారం మనిషి ప్రవృత్తికి, సమాజానికి మధ్య వున్న ఘర్షణ ఉంటుంది. మార్క్సిస్టు విమర్శకులు దీనిని గుర్తించాలని కోరారు. దీన్నిప్పుడు చాలామంది విమర్శకులు గుర్తిస్తున్నారు. మనిషి వ్యక్తిత్వానికి, వికాసానికీ, వైఫల్యానికీ ఈ ఘర్షణే మూలమని ఫ్రాయిడ్ చెపుతాడు.

సాహిత్య ప్రయోజనం గురించి చాలామంది అడుగుతుంటారు. సాహిత్యం ప్రజల సంస్కార స్థాయిని పెంచుతుందని గురజాడ భావించారు. ప్రజలను ఉద్యమోన్ముఖులను చేయడానికి తోడ్పడుతుందని సామాజిక ఉద్యమాల్లో వున్నవారు భావించారు. ఈ ప్రశ్నకు సమాధానంగా బాలగోపాల్ ప్రజల

## సాహిత్య ప్రస్థానం జూన్ 2021 పురస్కారాలు

| | |
|---|---|
| **డిస్లైడర్** | **మనసులను కుదిపే మూడో కన్నీటి చుక్క** |
| కథకు రూ.500 | వ్యాసానికి రూ.500 |
| రచయిత: రత్నాల బాలకృష్ణ | వ్యాసకర్త: జోశ్యుల దీక్ష |

■■■

*వ్యాసానికి కల్లపాలెం రుక్మిణమ్మ పురస్కారం*

*కథకు డా॥ ఎద్దుల సిద్ధారెడ్డి స్మారక పురస్కారం చెక్కులు ఈ రచయితలకు అందుతాయి*

■■■

*పాఠకులు తాము చదివిన కవితలు, కథలు, వ్యాసాల్లో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. సీనియర్, ప్రసిద్ధ రచయితల రచనలు కాక ఔత్సాహికులను, ఇటీవల రాస్తున్నవారిని ప్రోత్సహించడమే ఈ పురస్కారాల ఉద్దేశంగా గ్రహించగలరు. తగిన రచనలు లేనప్పుడు పురస్కారాలు ప్రకటించబడవు.*

**- ఎడిటర్**

---

చైతన్యస్థాయిని సాహిత్యం పెంపొందిస్తుందని అభిప్రాయ పడ్డారు.

సమాజాన్ని మొత్తంగా చూడకుండా కులాన్నిబట్టి, మతాన్నిబట్టి, లింగాన్నిబట్టి ... ఇలా విడివిడిగా చూడాలన్న వాదనలతో అస్తిత్వ వాదాలు, ఆధునికానంతర వాదం, స్త్రియలిజం వచ్చాయి. అంతేకాకుండా సమాజాన్ని మార్చడం సాధ్యం కాదన్న వాదనా వుంది. ఇవన్నీ మిధ్యావాదం, ఆత్మ శాశ్వతం, ప్రపంచం అశాశ్వతం అనే ఆధ్యాత్మిక తత్వంతో బాగా మిళితమైనాయి. అయితే సమాజాన్ని మార్చుకోవచ్చనీ, మార్చడానికి సాధ్యమవుతుందనే సాహిత్యం రావాలని బాలగోపాల్ ఆకాంక్షించారు. దీనికోసం రచయిత అభ్యుదయ భావాలను అలవర్చుకుంటూ, ఆత్మవిమర్శ చేసుకుంటూ, తనపై తాను యుద్ధం చేయాల్సి వుంటుందంటారు.

సాహిత్యం, జీవితం విడదీయరానివి. జీవితమెంత విశాలమో, సాహిత్యమూ అంత విశాలమైంది. జీవితంలో అర్థం కాని విషయాన్ని సాహిత్యం స్పష్టం చేస్తుంది. అంతేగాక జీవితంలో ఏర్పడే ఖాళీలను, అసంతృప్తిని సాహిత్యం పూరిస్తుందనే విషయాన్ని బాలగోపాల్ స్పష్టం చేశాడీ గ్రంథంలో. అందువల్లనే అస్తిత్వవాదాలుగా వచ్చిన స్త్రీ, దళిత, మైనారిటీ వాదాలు సాహిత్యంలో ఖాళీలు పూరించాయని ఆయన వ్యాఖ్యానించారు.

మార్క్సిజం ప్రతి అంశాన్ని సందర్భ దృష్టితో చూస్తుంది. అలాగే ఆయా సందర్భాల్లో జరిగే మార్పులతో అనుసంధానం చేసుకుని పరిశీలిస్తుంది. అందువల్లనే మార్క్సిస్టులు కానివారు కూడా ఈ సత్యాన్ని విస్మరించలేక పోతున్నారు. ఇదే సమాజాన్ని అర్థం చేసుకోవడానికి ఉపయోగపడుతోంది. మనిషికి, సమాజానికి మధ్య వైరుధ్యం నిరంతరం ఏర్పడుతూనే వుంటుంది. ఈ వైరుధ్యం పరిష్కారం కానంతవరకు అస్తిత్వ సందిగ్ధతలకు సాహిత్యంలో స్థానం ఉంటుందని తేటతెల్లం చేశాడు బాలగోపాల్.

ఆధిపత్య వర్గీయులు సాంస్కృతికంగా తమది గొప్పదని ప్రచారం చేసుకుంటారు. ఇతరుల సంస్కృతి, ఆచారాలు, సంప్రదాయాలు అనాగరికమైనవని, జాతివ్యతిరేకమైనవని ప్రచారం చేస్తారు. వారి భాష భాష కాదని ఒప్పించేందుకు ప్రయత్నిస్తారు. అలా చేస్తే ఇతరులు తమ దోపిడీకి సులభంగా లొంగిపోతారని అలా చేస్తారు. మనదేశంలో శూద్రులు తక్కువ రకమని, వారున్నదే ఆధిపత్య వర్గాలకు సేవ చేయడానికనే సాహిత్యాన్ని సృష్టించారు. అలా చాలాకాలం ఒప్పించారు. అయితే ప్రతి విషయాన్ని నిరోధించే అంశం దాని గర్భంలోనే దాగి ఉంటుందంటాడు బాలగోపాల్.

యండమూరి రాసిన క్షుద్రసాహిత్యంపైన, వైజ్ఞానిక నవలలుగా చలామణి అయిన సాహిత్యంపైన బాలగోపాల్ నిశితంగా విమర్శించారు. ఈ సందర్భంగా ఆయన, మనకు తెలియని వాటిపై ఏర్పడే ప్రశ్నలకు సైంటిస్టులు పరిశోధించే చెప్పే బాధ్యత వుంటే, ఆ సమాధానాలు సమాజంలో ఉండే ప్రభావాన్ని వాస్తవికంగా ఊహించి సాహిత్య రూపమివ్వడం

వైజ్ఞానిక నవలా కారుడి పనినీ గుర్తుచేస్తారు.

ఆర్థర్ క్లార్క్, ఐజాక్ అసిమోవ్‌లు రాబోయే వైజ్ఞానిక పరిణామాల్ని వాస్తవికంగా ఊహించి రాశారు. కానీ యండమూరి వీరేంద్రనాథ్‌కు కనీస వైజ్ఞానిక స్పృహ లేకపోవడం వల్ల లేని న్యూటన్ చలన సూత్రాలను చెప్పడం ఆయన అజ్ఞానాన్ని తెలియచేస్తుందని చెపుతారు బాలగోపాల్. అలాగే యండమూరి చెప్పిన బ్రెయిన్‌వేవ్ అనే పదం సైన్సు పరిభాషలో లేదన్నాడు. మెదడు కండరాలకొచ్చే ఆజ్ఞలు నరాలలో ఒక ప్రవాహంగా వెళతాయి. వాటిని నర్వ్ కరెంట్ అంటారు. ఇవి తప్ప ఎలాంటి వేవ్‌లు గాని, కరెంట్ గాని మెదడు నుండి పుట్టవని బాలగోపాల్ వివరించారు.

క్షుద్ర సాహిత్యంలో కనిపించే మంత్రతంత్రాల గురించి విమర్శిస్తూ మంత్రతంత్రాలు మనిషి అజ్ఞాన స్థాయిలో ఉన్నప్పుడు పుట్టాయని చెప్పారు. వర్షం కురిసేటప్పుడు ఉరుములు వస్తాయి. అందువల్ల శబ్దం చేస్తే వర్షాలు కురుస్తాయని ఆదిమానవుడు భావించాడు. అదే తొలిమంత్రం. ఈ మంత్రం మరికొంత నాగరికత పెరిగిన తరువాత, దేవతల ప్రసన్నం కోసం చేసే ప్రార్థనగా మారిపోయింది. వీటన్నింటిగురించి మలినోస్కి (Malinowaski) వంటి శాస్త్రజ్ఞులు మంత్రాల పుట్టుక గురించి వివరించారన్నారు.

భౌతిక శాస్త్రాన్ని వివరించేటప్పుడు ఎలక్ట్రాన్, ప్రోటాన్ పదాలు వాడకుండా ఎలా వివరించలేమో, దోపిడీ, బూర్జువా అనే పదాలు వాడకుండా ఈ ప్రపంచాన్ని వివరించలేమన్నారు. ఇవిలేకుండా చెప్పలేరా అనే ప్రశ్న న్యాయమైనదనే భ్రమ రచయితలు కలిగించకూడదంటారు బాలగోపాల్.

సమకాలీన సమాజంలో వస్తున్న మార్పులను చారిత్రాత్మక పరిణామాలను, తన తరువాతి తరం వారికి కళ్ళకు కట్టినట్లు చూపించే రచన 'గొప్పరచన' గా భావించారాయన.

సమాజంలో సంస్కరణలే తప్ప సమాజాన్ని పూర్తిగా మార్చలేమనే దృక్పథం మిధ్యావాదంతోనూ, ఆత్మశాశ్వతం, ప్రపంచం అశాశ్వతం అనే ఆధ్యాత్మిక వాదనతో చక్కగా మిళితమైంది. చాలామంది సీరియస్ రచనలలో కూడా ఈ తత్వం బలంగా వుంది. అంతేగాక మనదేశంలో వున్న వర్ణధర్మం, కులవివక్ష, కర్మ, ప్రారబ్ధం, తలరాత, స్త్రీల పట్ల న్యూనతాభావం, రాజభక్తి, జీవితం తుచ్ఛమైనదని, జన్మరాహిత్యమే ఆత్మధ్యేయమనే నమ్మకం మొదలైన విశ్వాసాలు రకరకాల ముసుగులో చాలామంది రచయితల మనసుల్లో ఉన్నాయి. వాటిని వారు ఎంతో చైతన్య పూర్వకంగా తొలగించుకోవలసి ఉంటుంది. దీనికి ఆత్మవిమర్శ ఎంతో అవసరమని బాలగోపాల్ హెచ్చరిస్తాడు. సమాజాన్ని మార్చగలమనే నమ్మకాన్ని కలిగించే సాహిత్యం రావాల్సిన అవసరముంది. దీనికోసం రచయితలు అభ్యుదయకరమైన తాత్విక దృక్పథాన్ని పెంపొందించుకోవల్సి వుంటుంది.

రచయిత పరిష్కారం చెప్పాలన్నదే బాలగోపాల్ స్థిరమైన అభిప్రాయం. రచనలో జీవితాన్ని మాత్రమే చిత్రిస్తాను తప్ప తీర్పుచెప్పను, పరిష్కారాన్ని చెప్పను అనడం అంటే 'ఆ రచయిత బుద్ధి పరాయికరణ చెందిందని అర్థం' అని చెపుతాడు బాలగోపాల్. రచయితగాని, శ్రామికుడు గాని పరాయికరణ చెందితే వాళ్ళ ఆలోచనలు వాళ్ళవికాకుండా పోతాయి. అంతిమంగా అవి పాలకవర్గాల భావాలవుతాయి. దాంతో సాహిత్యం పరాయీకరణ చెంది దోపిడీవర్గాలకు సామాజిక పెత్తనానికి అనుగుణంగా రూపాన్ని స్వభావాన్ని సంతరించుకుంటుంది. దోపిడి సంబంధాలు ఏర్పడే సందర్భంలో సాహిత్య వస్తువులోనూ, శిల్పసంబంధ విషయాలలోనూ మార్పులొస్తాయని ఆయన గుర్తించారు.

సాహిత్యం, భాష పరిణామాన్ని గుర్తించిన బాలగోపాల్ శ్రమకు పాటగా ప్రారంభమైన కవిత్వం భూస్వామిక యుగంలో చందోబద్ధమై ప్రజాస్వామిక యుగంలో వచనంలోకి మారిందన్నారు. అయితే అది తిరిగి ప్రజల పరం కావాలంటే వచనం వదిలి తిరిగి పాటకు వెళ్ళాలని ఆయన సూచించారు.

ఇంగ్లీషు భాష పాలక భాష కావడమంటేనే అది అధికారానికి సంకేతం, జంధ్యం బ్రాహ్మణానికి సంకేతమైనట్లు. భాష అధికారానికి సంకేతమైతే అది భాషగా దాని లక్షణాలను పోగొట్టుకుంటుందంటాడు బాలగోపాల్.

ప్రతి రచయితకు తానెవరి పక్షాన నిలవాలన్న ప్రశ్న ఎప్పుడో ఒకప్పుడు ఎదురవుతూనే వుంటుంది. అప్పుడు ప్రజలకు అనుకూలంగానే నిర్ణయం తీసుకోవాల్సి వుంటుంది. అది ఆ రచయిత బాధ్యత అని బాలగోపాల్ పేర్కొన్నారు. విమర్శారంగంలో రాణించదలుచుకున్న వారు ఈ గ్రంథాన్ని చదివితే సాహిత్య విమర్శ ఎలా చేయాలో అర్థం చేసుకోవడానికి తోడ్పడుతుంది.

■

# పాటల అవ్వ

- సాంబమూర్తి లండ



బడి అనగానే బాల్యం గుర్తొచ్చినట్టు
చెట్టు అనగానే నీడ గుర్తొచ్చినట్టు
పాట అనగానే
ఆ అవ్వే గుర్తొచ్చేది
గొంతు చేతులతో పాటనెత్తుకుని
ఊరేగించే అవ్వ
ఇవాళెందుకో పాటను
జ్ఞాపకాల వాకిట్లోనే దించేసి వెళ్ళిపోయింది

ఇన్నాళ్లూ రెక్కలు శిథిలమైనా
స్వరం నిరసన గళమెత్తినా
పాటను ఎత్తుకుంటూనే వుండేది

అప్పుడెప్పుడో
అవ్వ ముఖానికి గాయమైనపుడు
డాక్టరెవరో
చిట్లిన చర్మంతోపాటు
గుప్పెడు ధైర్యాన్నీ కుట్టేసి ఉంటాడు
కుంటుకుంటూ నడిచే కాలం కూడా
అవ్వను చూసి పరుగులు పెట్టేది

ఎప్పట్లాగే ఈ రోజూ
కాలం ఆమె గడప దగ్గర తచ్చాడే వుంటుంది
ఎంతకీ అవ్వ పలకట్లేదని
ముఖం వేలాడేసుకుని వెళ్లిపోయుంటుంది

ఏ చుక్కల సభలోనో కచేరీ చేయమని
అవ్వకు పిలుపొచ్చిందేమో
కొత్త బాణీలు నేర్చుకోవడానికి
ఉన్నపళంగా బయలుదేరిపోయింది

ఆమెనిక వెళ్ళనివ్వండి
పాటలేమైనా రాలతాయేమోనని
దులిపి దులిపి
ఇంకా ఆమెని విసిగించకండి
ఒకానొక దివ్య గాన ప్రవాహంలో
ఆమెనలా సాధన చేసుకోనివ్వండి

ఇక్కడొక
జీరగొంతుతో పారే పాటల నది ఉండేదని
దాహంతో వచ్చి వాలే
పిట్టలన్నీ నిరీక్షించక తప్పదు

అవ్వ జోరుగా పాటల సేద్యం చేసే రోజుల్లో
రాలిపడ్డ గింజలేమైనా వుంటే
అవి పాటలై మొలకెత్తే వరకూ
కొన్నాళ్ళు ఆగండి. ■

## పరిచయం




# మానవత్వాన్ని విస్మరించే సమాజానికి హెచ్చరిక

- వొర ప్రసాద్

9490099059

కవిని కదిలించిన సంఘటనలు కవితలుగా రూపం పోసుకుంటాయి. కవితగా మారిన ఆ సంఘటన ఆ కవిత చదివిన వారితో సంబంధం ఏర్పరుచుకుంటుంది. ప్రతిభగల కవి, బాగా సాధన చేసిన కవి ప్రభావితం చేయగల స్థాయిలో కవితను నిర్మించగలడు. అటువంటి కవిత పాఠకుడిలో ఆలోచనను రేకెత్తిస్తుంది. ఆ కవిత పాఠకుడిలో సామాజిక చైతన్యాన్ని ప్రేరేపించగలిగితే ఆ కవి విజయం సాధించినట్లే. పాఠకుడిని ప్రభావితం చేసినట్లే. పాఠకుడిలోని మానవ సంస్కారాన్ని ఉన్నతీకరించగలిగితే అంతకుమించి కవికి ఏం కావాలి? ఉత్తమ మానవ సంస్కారాన్ని, సాంఘిక చైతాన్యన్ని వ్యాప్తి చేయడమే ఆధునిక సాహిత్య కర్తవ్యం. అటువంటి కర్తవ్యాన్ని నూటికి నూరుపాళ్ళూ స్వీకరించిన కవిగా 'మనిషి అలికిడి లేక...' కవితా సంపుటిలో కవి చిత్తలూరి సత్యనారాయణ మనకు దర్శనమిస్తాడు.

ఈ పుస్తకంలోని ముందుమాటలో వర్తమాన సామాజిక వ్యవస్థపై చిత్తలూరి అభిప్రాయాలు ఆలోచింపచేస్తాయి. కవిత్వం పట్ల తన నిబద్ధత, సామాజిక వాస్తవికత గురించిన తన అవగాహన, కవి కర్తవ్యం గురించిన చిత్తశుద్ధిని ఈ ముందుమాట వ్యక్తం చేస్తుంది. ఈనాటి కవి కర్తవ్యాన్ని అవసరమైనంత ఆవేశంతో ఈ ముందుమాటలో వ్యక్తీకరిస్తాడు చిత్తలూరి.

'నిత్యం గాయపడుతున్న పూలదుఃఖాన్ని వివక్షల పెను భూకంపం కింద పెళ్లలుగా విరిగిపడుతున్న మానవతా సౌధాలని, ధనంతో, అహంతో ఆధిపత్య భావజాల అభిజాత్యంతో మనుషులు మాయమై కూలిపోతున్న అనియంత్రిత విద్వేషపూరిత మానవ హననాల్ని కళ్లారా వీక్షించి కన్నీళ్లు పెట్టుకుంటున్న గుబులు దిగులు సంతకాలమై మన జీవన చేవ్రాలు కింద అలుక్కుపోతున్న అక్షరాలమవుతున్నవాళ్లం' అంటున్న చిత్తలూరి అవగాహన తన కవితా చరణాలను అల్లుకుని వాటిని చదువుతున్న మన హృదయాల్లోకి అలలు అలలుగా ప్రవహిస్తుంది. ఈ కదిలించే వాక్యాలు కవి హృదయాన్ని మనకు ఆర్ద్రంగా అందిస్తాయి. పుస్తకాలు వేసుకుంటూ సంతోషాన్ని ప్రకటించే ముందుమాటలు చదివే వారికి ఈ పుస్తకం ముందుమాట కాస్త వేరుగానే ఉంటుంది. ఏదో ఆర్భాటంగా ప్రకటించుకుంటున్న మాటలు కావు ఇవి. అక్షరం అక్షరంలో కవి చిత్తశుద్ధి మనకు కనబడుతుంది. 'అనేక జీవన సంక్షోభాలు చెలరేగుతున్న చోట మనిషి మనుగడ కోసం కొత్త దారుల్ని వేసుకుంటూ కవిత్వంగా ప్రయాణిస్తున్న నాలాంటి సృజనకారులకు కవిత్వం వేరు జీవితం వేరు కానే కాదు' అని ప్రకటించిన చిత్తలూరి సత్యనారాయణలో నేటి సమాజానికి అవసరమైన మేటి కవి కనిపిస్తాడు.

'మనిషి అలికిడి లేక' చిత్తలూరి సత్యనారాయణ నాలుగో కవితా సంపుటి. ఇదివరకే 'మా నాయిన' (2006), 'నల్ల చామంతి' (2017), 'వెలుతురు మొలకలు' (2019) సంపుటాలు తీసుకొచ్చారు. మానవతా దృక్పథం కేంద్రంగా తన కవితలకు ఊపిరిపోస్తారు చిత్తలూరి. ఆ దృక్పథం 'మనిషి అలికిడి లేక' కవితా సంపుటిలో ఒక పరాకాష్టకు తీసుకెళతారు. మానవతా దృక్పథం ఎంత అవసరమో కరోనా చాటిచెప్పిందని ఈ పుస్తకం నిండా హెచ్చరిస్తాడు చిత్తలూరి.

కరోనా నేపథ్యంలో వెలువడిన ఈ సంపుటిలో తొంభైశాతం కవితలకు వస్తువు కరోనానే. అయితే వస్తువు కరోనా అయినప్పటికీ ప్రతి కవితా విభిన్నమైన కోణాన్ని ఆవిష్కరించడం విశేషం. కరోనా కాలంలో వలస కార్మికులు ఎదుర్కొన్న దయనీయ పరిస్థితులు, ఉపాధి కోల్పోయిన వాళ్ళు, పాఠశాలలకు వెళ్ళలేని పిల్లలు, పాఠాలు చెప్పలేని ఉపాధ్యాయులు, మున్సిపల్ కార్మికులు, వైద్యులు, ఇళ్ళల్లో చాకిరీ పెరిగిన మహిళలు ... ఇలా విభిన్న కోణాల్లో రాసిన కవితలు మనకి కరోనా సృష్టించిన జీవన సంక్షోభాన్ని, వ్యవస్థ లోపాల్ని లోతుల్లోకి తీసుకెళ్ళి చూపిస్తాయి. ఒకే వస్తువును ఇన్ని కోణాలతో ఇంత వైవిధ్యంతో  రాసి కవితా పాఠకుడ్ని మెప్పించడం అంత సులువైన పనేం కాదు. సామాజిక స్పృహ, అంకితభావం, నిబద్ధత, కవిత్వ నిర్మాణం పట్ల కవికి ఉన్న పట్టు వల్ల అది సాధ్యమైంది.

కరోనా ప్రపంచం నేపథ్యంగా సమాజం గురించి, మనిషి గురించి మౌలికమైన అనేక ప్రశ్నలను కవితారూపంలో సంధించాడు చిత్తలూరి. ప్రపంచీకరణ పేరుతో పెట్టుబడిదారీ వ్యవస్థ ప్రచారం చేస్తున్న వ్యాపార విలువలపై తన కవితాస్త్రాల్ని సూటిగా ఎక్కుపెట్టారు. వర్తమాన ప్రపంచంలో సామ్రాజ్యవాద ప్రపంచీకరణ మానవ విలువల్ని మంట గలిపిన తీరుపై నిప్పులు గక్కిన కవితలు మన చేత చదివిస్తాడు చిత్తలూరి.  అభివృద్ధి పేరుతో ప్రచారం చేయబడుతున్న వాటిపట్ల చిత్తలూరికి ఎటువంటి భ్రమలూ లేవని ఈ కవిత్వం మనకి చెబుతుంది. ఈ కవి దృష్టంతా దారుణంగా విధ్వంసమవుతున్న మానవ సంబంధాల గురించే. మనుషుల్లో మానవ విలువల్ని మంటగలుపుతున్న వాటిపైనే తన ఆగ్రహమంతా. గాయపడుతున్న మనుషుల కోసమే తన వేదనంతా. మనిషిని మనిషిగా నిలబెట్టలేని వ్యవస్థను తీవ్రమైన గొంతుతో ఆక్షేపిస్తాడు చిత్తలూరి.

ప్రపంచాన్ని ఒక్కసారిగా కరోనా స్తంభింపజేసింది. పెట్టుబడులు, లాభాలు, ప్రపంచీకరణ అంటూ మనుషులను వొదిలిపెట్టి పరుగులు పెడుతున్న వ్యాపార సమాజానికి కరోనా ఒక్కసారిగా సడన్‌బ్రేక్ వేసింది. పెట్టుబడిదారీ వ్యవస్థ చెప్పే అభివృద్ధి డొల్లతనాన్ని కరోనా ఉతికి ఆరేసింది. అధునాతన శాస్త్ర విజ్ఞాన, సాంకేతిక ప్రపంచమంతా ఆక్సిజన్ అందించలేక అల్లాడింది. ఆస్పత్రులు బెడ్లు ఏర్పాటు చెయ్యలేక తల్లడిల్లాయి. ప్రైవేటు ఆసుపత్రుల యాజమాన్యాలు నిజంగానే కరోనా శవాలపై లక్షల్లో ఫీజులు వసూలు చేశాయి. శ్మశానాల్లో స్థలం సరిపోక శవాలు బారులు తీరాయి. ప్రపంచమంతా ఈ దృశ్యాలు ప్రసారం అయ్యాయి. చూసిన ప్రజలు విస్తుపోయారు. అయినవాళ్ళని కరోనా ఎత్తుకుపోతుంటే నిస్సహాయులై నిలబడ్డారు. ప్రపంచీకరణ పటాటోపం ప్రపంచమంతా తెలిసిపోయింది. అయితే ఏం ప్రయోజనం? ఇంకా ప్రపంచం వ్యాపారస్థుల చేతుల్లోనే బందీయై ఉంది. తక్షణ ప్రత్యామ్నాయం లేని పరిస్థితి పెట్టుబడిదారీ గుంటనక్కలకు ఇంకా అవకాశంగానే ఉంది. ప్రత్యామ్నాయ వ్యవస్థల పట్ల చైతన్యం పెరగనంత కాలం ఈ పరిస్థితిని అధిగమించలేం. ప్రపంచవ్యాప్తంగా ఈ దిశగా ఒక గట్టి ప్రయత్నం చేసే అవకాశం ఈ కరోనా సృష్టించింది.

మనదేశంలోని కరోనా విపత్తును దీటుగా ఎదుర్కోలేని అసమర్థ నాయకత్వం ఆకస్మిక లాక్‌డౌన్ ప్రకటించింది. ఇది ఊహించని సామాన్య ప్రజలు దయనీయమైన పరిస్థితులను ఎదుర్కొన్నారు. వలస కూలీల అవస్థలను చూసిన దేశప్రజల హృదయాలు కదిలిపోయాయి. ప్రభుత్వం చేతులెత్తేసిన వేళ ప్రజలే స్వచ్ఛందంగా ముందుకు వచ్చి ఆపన్నులకు స్నేహహస్తం అందించారు. వలస ప్రయాణంలో వారికి ఆహారం అందించారు. అండదండలయ్యారు. కవులు కవిత్వం చేసారు. చిత్తలూరి రాసిన పలు కవితలు కరోనా దృశ్యాల్ని మనస్సుకు హత్తుకునేలా చిత్రించాయి.

**"ఏమిటిది/ ముద్ద గొంతులోకి దిగుతున్నా/ ఊపిరాడని తనమేదో కడుపులో కలుక్కుమంటోంది"/ ..అడుగుతీసి అడుగేస్తే/ ఆరడుగుల కలవరం వెంటాడుతోంది/ రెక్కచాచి ఎగురుదామంటే/ గాలినిండా పొంచి వున్న/ వలల గుబులు భయపెడుతోంది" (చీకటి)** కరోనా తొలిదశలో ప్రపంచ వ్యాప్తంగా సంభవించిన మరణాలు ప్రజలను భయ కంపితులను చేశాయి. ఆ స్థితిని ఊపిరాడనితనంగా చెప్తూనే 'ఆరడుగుల కలవరం' అంటూ ఎక్కడకు వెళ్ళాలన్నా 'వైరస్' వలవేసి ఎదురుచూస్తుందంటూ ఆ భయానక స్థితిని దృశ్యీకరించారు కవి. సాధారణ పరిస్థితుల్లో ప్రజలను తప్పుదారి పట్టించే బాబాలు, స్వామీజీలు, జోతిష్యుల వంటివారిని ప్రశ్నిస్తూ కరోనా విపత్తులో ప్రజల్ని వదిలిపెట్టి మీరెక్కడికి పారిపోయారు. మీ మోసాలు బయటపడతాయనా అని ప్రశ్నిస్తారు. ప్రజలను మూఢవిశ్వాసాలతో ముంచే ఇటువంటి వారి మోసాలపై ఆగ్రహాన్ని ప్రకటిస్తుందీ కవిత - **"ప్రజల్ని మభ్యపెట్టి మూఢనమ్మకాలతో/ కోట్లను వెనకేసుకునే వీళ్ల వ్యాపార/ అవినీతి కాషాయ వేషాలు/ కంటికి కనిపించని ఒక చిన్న క్రిమిని/ అంతం చేయలేని నిస్సహాయతలో/ నీలిగి ఏ గోడ మూలో/ ఏసీ గదుల నీడల వాడల్లో/ ఆశ్రమాల ఆధ్యాత్మిక**

**మత్తు పాకల కింద/ కత్తిరించబడుతున్న నీడల్లా/ కుదేలయిన ఎముకల బరిబత్తల పోగుల్లా/ కునారిల్లి పోతున్నారా/ ఏమైపోయారు వీళ్లంతా?"** (ఏమైపోయారు?)

కరోనా తొలిదశ ముగిసిన తర్వాత సాధారణ పరిస్థితులు వచ్చేసాయి అనుకునే లోపులో రెండోదశ మరింత భయపెట్టింది. రెండోదశకు ముందే మూడోదశ గురించి చిత్తలూరి హెచ్చరించడం ఆశ్చర్యపరుస్తుంది. కానీ ఎన్ని దశలొస్తున్నా కనీస ముందుచూపు లేని దుస్థితిలో మన పాలకులు ఉండటాన్ని రెండోదశ కరోనా పరిస్థితులు ఎత్తిచూపాయి. పాలకుల నిర్లక్ష్యం గ్రహింపుకొచ్చి ఈ కవిత చదివిన పాఠకుడికి మరింత ఆగ్రహం కలుగుతుంది. కరోనా తొలి దశలోనే ముందుచూపుతో కూడిన ఈ అవగాహన కవి ప్రదర్శించడం గమనార్హం–

**"ఇంకెన్నాళ్లు?/ ఇంట్లో పుట్టలు మొలుస్తున్నాయి/ బతుకు భయమేదో కరోనా పాములా/ మూడోదశలోకి పాకుతోంది/ బయటికెళ్లే భయం కన్నా/ ఇప్పుడు ఇంట్లోని భయమే పొగలు కక్కుతోంది"**

**"నాయిన జేబుల్ని ఎతికి ఎతికి/ అలిసిపోయిన అమ్మ విసుగ్గా గిన్నెల్ని ఎత్తేసి/ కోపాన్ని నిరసన రూపంలో మోగిస్తోంది"**

**"మూడోదశ మృత్యుదశై కాటేయక ముందే/ అప్రమత్తతలా ఆకలి గింజల్ని చల్లుతా/ గడపదాటితేగానీ కడుపునిండని కూలీబతుకుల్ని/ ఇంట్లో పెట్టినట్టే మన గుండెల్లోనూ పెట్టుకోవాలె/ ఇంకెన్నాళ్లైనా ఇంత బువ్వ పెట్టి/ పురుగు ముట్టని బతుకు యుద్ధం చేయించాలె!"** (పురుగు ముట్టని)

కరోనా విపత్తుతో ప్రపంచం స్తంభించిపోయినా పెరిగిన సాంకేతిక పరిజ్ఞానం ముఖ్యంగా ఇంటర్నెట్ వల్ల ఇంట్లో ఉండి పనిచేసే పరిస్థితులు ఎంతో ఉపశమనంగా ఉండటం చూసాం. చిత్తలూరి చాలా హృద్యంగా రాసిన ఈ కవిత పాఠకుల్ని హాయిగా పలకరిస్తుంది–

**"ఏం కాదులే రోజుకెన్నిసార్లయినా/ వర్చువల్‌గా మనల్ని కలిపే సాంకేతికతేదో/ మన మధ్య పూలవంతెనై పరుచుకునే వుందిగా/ భౌతిక దూరమే మనకిప్పుడు రక్షా కవచం"**

**"వైద్యులూ, పోలీసులూ,/ పారిశుధ్య కార్మికులూ, మీడియా మిత్రులూ/ కుటుంబాలకు దూరంగా బయటే వుండి చేసే/ ఆ మహా త్యాగం ముందు/ మన దూర తీరాల ఈ నిర్బంధ యుద్ధమేపాటి?"** (ఏం ఫర్వాలేదులే నాన్నా!) అంటూ గుబులు గుబులుగా ఉన్న మన మనస్సులను తేలికపరుస్తారు.

కరోనా సృష్టించిన సంక్షోభంలో మనుషులంతా ఇళ్ళకే పరిమితమైపోయారు. మనుషుల అలికిడి లేని బోసిపోయిన ప్రకృతిని పట్టించుకుని కవిత్వం చేసి ఆకట్టుకుంటారు – **"పూలు పూస్తూనే వుంటుంది చెట్టు/ పూసిన పూలతో నేలను కప్పేదుతుంది గాలి/ కోసే చేతులేవీ కనిపించక/ పరిమళాలు తప్పిపోయిన గొర్రెపిల్లలై/ చెట్టు చుట్టే తచ్చాడుతూ ఉంటాయి" (మనిషి అలికిడి లేక)** అంటూ మనిషి లేని ప్రకృతిని మనకు గుర్తుచేస్తారు. ఈ కవితా శీర్షికనే పుస్తకానికి ఎంచుకోవడం అర్థవంతంగా ఉంది.

ప్రపంచానికి కరోనా చేసిన గాయాన్ని దేంతో పోల్చి చెప్పాలి. మానవ చరిత్రలోనే అతిపెద్ద విపత్తును ఎలా చెప్పగలం? ఎంత చెప్పినా ఆ గాయం అర్థమవుతుందా? కవిగా చిత్తలూరి దాన్ని చెప్పడానికి చేసిన ప్రయత్నం అభినందనీయం. ఆకాశం నుంచి పడే వర్షాన్ని కరోనా వల్ల కలిగిన మానవ దుఃఖపు కన్నీళ్లుగా ఊహిస్తాడు కవి. నేలంతా పచ్చిపుండులా అయ్యి మొలకెత్తేవి విత్తనాలు కాదు గాయాలని చెప్పి గొప్ప కల్పనా చాతుర్యంతో విస్మయపరుస్తాడు.

**"ఆకాశం/ తన బుగ్గల మీంచి జారుతున్న చినుకుల్ని/ తుడుచుకుంటూ/ కన్నీళ్లేమోనని ఉలిక్కిపడుతుంది"**

**"నేల పచ్చిపుండులా వుండి/ మొలకెత్తేవి గాయాలా విత్తనాలా అని/ సందేహ నివృత్తిలో పడింది" (రెక్క తెగిన గాయం)**

ఈ కవితా సంపుటికి చివరి కవితను 'ముగింపు' శీర్షికతో అర్థవంతంగా రాసి మెప్పిస్తారు.

**"ఒక అర్థవంతమైన ముగింపుతో పాటు/ ఒక ఆకురాలే సంక్షోభం/ ఒక పురుగు ముట్టిన సందర్భం/ ముగింపుకు చేరాక/ చిగురించే వసంతంలాంటి/ ఒక సరికొత్త ప్రారంభమూ/ తప్పక వుంటుంది! (ముగింపు)** అంటూ కరోనా పరిస్థితుల్ని ఎదుర్కొని మానవుడి తిరిగి కొత్తగా చిగురిస్తాడనే ఆశావహ దృక్పథంతో వీడ్కోలు పలుకుతాడు చిత్తలూరి.

ఈ సంపుటిలో కరోనా కవితలే ఎక్కువ భాగం ఉన్నప్పటికీ సమకాలీన సమాజం ఎదుర్కొంటున్న ఇతర సమస్యలని కూడా కవిత్వం చేశాడు కవి. ఇటీవల మహిళలపై జరుగుతున్న అమానుష సంఘటనల్ని, దేశంలోని మైనారిటీ ప్రజలను భయభ్రాంతులను చేస్తూ పౌరసత్వ సవరణ చట్టం తీసుకురావటాన్ని వ్యతిరేకిస్తూ, జమ్మూకాశ్మీర్ ప్రజల హక్కులపై దాడిచేయడాన్ని, ఆ రాష్ట్రాన్ని విభజించడాన్ని ఖండిస్తూ శక్తిమంతమైన కవితలు రాశారు. భావ ప్రకటనా స్వేచ్ఛపై, వృద్ధుల మీద, యుద్ధాలను వ్యతిరేకిస్తూ, రైతు పోరాటానికి మద్దతుగా, అలాగే మాతృభాష ప్రాధాన్యతను తెలిపే కవితలూ ఈ సంపుటిలో కవిత్వ పాఠకుడిని అలరిస్తాయి.

చిత్తలూరి కవితా నిర్మాణం సూటిగా, సరళంగా సాగుతుంది. తనదైన ప్రత్యేక శైలితో పాఠకుడిని అవలీలగా తన కవితలోకి లాక్కెళ్ళిపోతాడు. అస్పష్టతకు ఆమడ దూరం చిత్తలూరి కవిత్వం. ఇంగ్లీషు అధ్యాపకుడిగా ఉద్యోగ బాధ్యతల్లో ఉన్న చిత్తలూరికి ఇంగ్లీషు సాహిత్యంతో కూడా మంచి పరిచయమే ఉంది. ఈ పుస్తకంలో చివరిలో కమలాదాస్, ఎమిలి డికిన్సన్ కవితలను అనువాదం చేసి అనుబంధంగా ఇచ్చారు. సోషల్ మీడియాలో చిత్తలూరి చాలా యాక్టివ్‌గా ఉంటారు. ప్రతిరోజూ తన వాల్ మీద కవితలను పోస్టు చేస్తూనే ఉంటారు. ఇంత విస్తృతంగా రాశిలోనూ, వాసిలోనూ విలువైన కవిత్వం రాస్తున్న చిత్తలూరి ఈ కాలానికి అవసరమైన కవి.

రకరకాల సంకుచిత ధోరణులు తెలుగు సాహిత్యాన్ని గందరగోళానికి గురిచేస్తున్న సందర్భంలో కష్టజీవులందరినీ సమైక్యపరిచే విశాల అవగాహనను చిత్తలూరి కవిత్వం అందిస్తుంది. మనదేశంలో ఒకవైపు హిందూ మతోన్మాదం, మరోవైపు సామ్రాజ్యవాద ప్రపంచీకరణ మానవ విలువల్ని మూర్తిగా మంటగలుపుతున్నాయి. వీటి దాడిని ఎదుర్కోవడానికి మతాలకు, కులాలకు, ప్రాంతాలకు అతీతంగా మానవతా దృక్పథంతో కలిసివచ్చే శ్రేణులన్నీ జట్టుకట్టాల్సిన సందర్భం ఇప్పుడు మనముందుకు వచ్చింది. దగాపడ్డ శ్రేణులు, ప్రగతిశీల ప్రవాహాలూ చేయీ చేయీ కలిపి నడవాల్సిన సమయం ఇది. అటువంటి సమిష్టి భావజాలమే మనుషులను విడదీసే ఛాందస సంకుచిత భావాలపై జరిగే భావజాల యుద్ధంలో పైచేయి సాధించగలదు. వర్తమాన తెలుగు సాహిత్యం ఇటువంటి విశాల అవగాహనతో ప్రయాణించాల్సిన అవసరం ఈ రోజు ఏర్పడింది. ఈ అవగాహనను సామాజిక మార్పును కోరుకునే రచయితలందరూ అందిపుచ్చుకుని ముందుకు సాగాలి. ఈ సంపుటిలో అటువంటి ఆలోచనలను మనకు చిత్తలూరి అందించాడు. వర్తమాన సామాజిక పరిస్థితుల తీవ్రతను అర్థం చేయించే కవితలు ఈ పుస్తకంలో మనకు ఎదురవుతాయి. మొత్తంగా వర్తమాన సామాజిక ధోరణిని వాస్తవిక దృష్టితో ఒడిసిపట్టిన తీరు చిత్తలూరి కవితల నిండా ప్రత్యక్షమై కవితా పాఠకుడిలో ఉత్తేజాన్ని నింపుతుంది. కవిత్వ పాఠకులు తప్పక చదవాల్సిన కవితా సంపుటి ఇది.

■

## జాతికి కొత్తఊపిరి



నేనల్లుతున్నది
పద్యం కానే కాదు
మూర్ఖ రాజా కోసం
నేస్తున్న దివ్యవస్త్రం

పెదవి దాటని నిజాలను
లోపలి మనిషి ఆనవాళ్ళను
కండ పుష్టితో కనిపెట్టలేం
కొంచెం మూడోకన్ను తెరచి ఉంచాలి!

నేలపై ఇక భౌతిక యుద్ధాలుండవు
యోధుడు నేల రాలిన చోటును
కన్నీటి మడుగులే ఆనవాళ్ళను పట్టిస్తాయి
అగ్ని అప్పుడు చాప కింది నీరవుతుంది!

ఎప్పుడూ ఎద విరుచుకుని
మన ఎదుట నుంచునే రాజు
ఎప్పుడు అవనత పతాకమవుతాడో
చాటి చెప్పడానికి సమయముండదు!

విడిపోయిన మేఘాల నుంచి
వర్షాన్ని విశ్వసించలేము
ఉరుములు మెరుపులు లేని ఆకాశం
వానలతో ముంచెత్తినప్పుడు ఆశ్చర్యం!

ఒంటరి పోరు ఫలితాలివ్వనప్పుడు
జత కట్టడం వ్యూహాత్మకమే
తెర వెనుక జెండాలు ఏకమవుతున్న దృశ్యం
జాతికి కొత్త ఊపిర్లు పోస్తున్నది!

- కోట్ల వెంకటేశ్వర రెడ్డి

94402 33261



# చప్పట్లు

**రావాడ శ్యామల**

**91821 39528**

తెల్లారి ఏడవుతుంది. నెమ్మది నెమ్మదిగా గ్రామంలో సందడి మొదలైంది. ఊర్లోని కొందరివి పశువుల పాకలు శుభ్రం చేసి, పశువులకు దాణా వేసి, కుడితి కలిపి పెట్టి ఇంటికి వచ్చాడు అప్పన్న. ఇంటి ముందు ఏ సందడి లేదు. ఒకింత ఆశ్చర్యపోయాడు. తెల్లారి తనతో పాటే లేచిన పెళ్ళాం మాణిక్యం కంచుకంఠం వినిపించడం లేదు. ఈ పాటికే తన పని ముగించుకొని వచ్చి, ఇంటి ముందు కళ్ళాపి చల్లి ముగ్గులు పెడుతూ, రుసరుసలాడుతూ ఉండే పెళ్ళాం కనిపించలేదు. ఈ రోజు ఏమైంది? కసవులు అలానే ఉన్నాయి. తుడవనే లేదు. అటూ ఇటూ చూశాడు.

మాణిక్యం ఊళ్ళో చంటిపిల్లలకి తెల్లవారుజామునే స్నానం చేయిస్తుంది. సన్నగా రివటలా ఉండే మాణిక్యం వచ్చేసరికి ఆ ఇంటి వాళ్ళు చంటి పిల్లల స్నానం కోసం నీళ్ళు వేడి చేసి రెడీగా వేచి ఉంటారు. నిద్రలో ఉన్న పిల్లల్ని లేపి, ఏడుస్తున్నా సరే వాళ్ళకి నూనె రాసి, మాలిష్ చేసి, స్నానం చేయించి, సాంబ్రాణి ధూపం వేసి మరీ వస్తుంది. అలా ఎప్పుడూ నాలుగైదు ఇళ్ళలో పని ఉంటూనే ఉంది. ఒకొక్క ఇంటిలో అరగంట... అంతకు మించి ఉండదు. ఏ కొద్దిగా ఆలస్యమైనా చిరచిరలాడుతుంది. ఆమె నోరుకి జడిసినా... ఆమె చేయి చల్లనిదని .... ఆమె వచ్చేసరికి నీళ్ళు కాచి, బగ్గులు రాజేసి, నూనె, సబ్బు అన్నీ రెడీ చేసి ఉంచుతారు. ఈ రోజు అలానే పని చేసుకొని వచ్చింది.

"మానిక్కం ఎక్కడున్నావే..." అంటూ పాకలోకి వెళ్ళాడు అప్పన్న.

మంచం మేదున్న పెళ్ళాన్ని చూసి "ఏమే అలా మెలితిరిగి పోతున్నావూ..." ఆదుర్దాగా అడిగాడు.

"ఏవో మావా... రాతిరి కానుంచి కడుపులో నొప్పిగా ఉంది."

"నాకు సెప్పనేదే..."

"వోము తిన్నాను. తగ్గిపోతాదనుకున్నాను. తగ్గనేదు. ఎక్కువైపోతుంది." నీరసంగా అంది.

"డాట్రు కాడికి ఎలదామే.."

"ఎందుకులే మావా.. పక్కింటి ముసిల్ది వోమరుకు ఇచ్చింది. తాగాను. తగ్గిపోతాదిలే..

"అది కాదే ... నీకెప్పుడూ ఇలాగా రాలేదే"

"బాగుంది.. నొప్పులు మనుషులకి కాక మానులు కొస్తాయా..." అంత నీరసంలోనూ కోపంగా అంది. "అయినా ఇంట్లో పైసా లేదు.. డాట్రు కాడికి ఎలా ఎలతామూ.." అది తగ్గే నొప్పి కాదని తెలుస్తుందామెకు. అందుకే అసలు విషయం చెప్పింది.

"గవర్నమెంట్ ఆసపత్రికి ఎలదామే.."

"అక్కడకెళ్ళినా... మందులు మనవే బయిట కొనుక్కోవాలా... దానికి డబ్బులు కావాలా" తెలుసా అన్నట్లు అప్పన్న వైపు చూసింది.

"పాపారావు కాడికి కెళ్ళి రెండొందలు అడుగుతాను. ముందు నీకు టీ తెస్తాను. నీ కడుపులో ఏటీ నేదు. ఉండు." అని దగ్గర్లోని టీ కొట్టు నుంచి టీ తెచ్చి ఆమె చేత తాగించి, తరువాత పాపారావు ఇంటికి వెళ్ళాడు. పాపారావు ఉర్లో వాళ్ళకు వడ్డీకి డబ్బులిస్తుంటాడు. అతని దగ్గర ఏ వస్తువైనా తాకట్టు పెట్టందే ఇవ్వడు. అప్పన్నకి అలాగే అలాగే ముందంతా ఇచ్చాడు. అతని విలువైన సామానంతా పాపారావు దగ్గరే ఉంది. కాని, ఇప్పుడు తాకట్టు పెట్టదానికి ఏమీ లేదు.. అదే విషయం చెప్పాడు.

"ఇప్పటికి ఇప్పుడు డబ్బులంటే లేవు మావా... ఒక పని చెయ్యి. మన వీధిలోని అందరూ ఎంఎల్ఎ గోరి సభకి ఎలుతున్నారు. మనిషికి రెండొందలు, బిరియాని పేకెట్ ఇస్తారు. పది గంటలకి మీటింగు. అరగంట ఉంటాది. డబ్బులు తీసుకొని పదకొండు కల్లా ఇంటికి వచ్చేస్తావు.. అని ఆగి ..ఏటంతావూ.." అని అప్పన్న వైపు చూస్తూ అన్నాడు.

"అదికాదురా... ఉప్పుడే డాట్రుకాడికి ఎల్లాలి. పోనీ వంద ఉన్నా ఇయ్యరా. కూలీ నాలీ సేసైనా ఇచ్చేత్తాను."

"కూలి సేసి నువ్వు ఎప్పుడుకి తీరుస్తావు... అయినా మునిలోడా.. అక్కడ వూరికే కూకొని సప్పట్లు కొడితే రెండొందలిచ్చి, బిరియాని పేకెట్టు ఇస్తారు. ఏం సలుపా... కూకొని సప్పట్లు కొట్టడానికి.." బీడి ఊదుతూ నిర్లక్ష్యంగా అన్నాడు.

అప్పటికే వీధిలోని చాలామంది ఆడ, మగ లారీలు ఎక్కి సభకు వెళ్ళడానికి తయారుగున్నారు. తెలిసిన వాళ్ళని ఇద్దరు, ముగ్గురిని అడిగాడు. ఎవరూ ఇవ్వలేదు. అప్పన్న అడిగిన వంద రూపాయలు అందరి దగ్గర ఉన్నా... ప్రతిఫలాక్ష ఆశించే నేటి మనిషికి... అప్పన్న అవస్థ అగుపించలేదు.

అప్పన్న సభకు వెళ్ళాలా వద్దా... అని ఆలోచించి.. వెళ్ళాలనే నిశ్చయించుకున్నాడు. ఇంటికెళ్ళి చెప్పే సమయం లేదు. లారీలు బయిలుదేరడానికి సిద్ధంగా ఉన్నాయి. అటూ ఇటూ చూసాడు. అటువైపుగా తెలకల రవణమ్మ వెలుతుంటే పిలిచాడు.

"అప్పా... మా ఇంటికాడికి ఎలతావు కదే... మానిక్కంకి సెప్పు. నాను మీటింగుకి ఎల్లి డబ్బులు అట్టుకొస్తాను. అందాక ఉడుకు గంజి తాగి తొంగోమను. కడుపు నొప్పి తగ్గుతాది. నానొచ్చాక డాట్రుకాడికి.. ఎలదామని సెప్పు... మర్సిపోకు." అన్నాడు బతిమిలాడుతూ.

"అలాగేరా ... సెప్తాను." అంది.

అప్పన్న గబగబా లారి ఎక్కి నిలుచున్నాడు. సభాస్థలికి గంట ముందుగా చేరుకున్నారు. ఎం.ఎల్.ఎ గారి విజయోత్సవ సభది. పదయిపోయింది. మైకులో ఇంకో పావు గంట... అమ్మలారా... అయ్యలారా.. గోల చెయ్యొద్దు. మన కష్టాలు తీర్చే మహారాజు... మనం గెలిపించుకున్న రారాజు... ఆడపడుచులకి అన్నలాగా అండగా నిలబడే మన దొరబాబు వచ్చేస్తున్నారు. ఇంకో పావు గంట.. గోల చెయ్యకుండా కూర్చొండి." అని ఊదర గొడుతున్నారు.

అప్పన్న మనసంతా పాకలోని పెళ్ళాం చుట్టూ తిరుగుతుంది. ఎలా ఉందో .. ఏటో.. చెప్పకుండా వచ్చీసాను. రమణమ్మ చెప్పిందో, లేదో ... అయినా డబ్బులు, బిరియాని తీసుకెళ్తే సంతోషపడతాది." అని సమాధాన పరచుకున్నాడు.

పదకొండు అయింది. ఎండ ఎక్కువవుతుంది. బహిరంగ సభ కనుక కూర్చున్న వీళ్ళ మీద ఎండ పడుతుంది. ఉదయం నుంచి ఏమీ తినకపోవడంతో కడుపు నకనకలాడుతుంది. బిరియాని పేకెట్టు ఇస్తే ఇంటికి తీసుకెళ్ళి ఇద్దరం తినొచ్చు" మనసులో అనుకున్నాడు. బిరియానిని తలచుకోగానే నోట్లో నీళ్ళురాయి. కూలి, నాలి చేసుకుని బతికే అతని జీవితంలోకి మాణిక్యం వచ్చి పాతిక సంవత్సరాలైంది. తర్వాత కూతురు పుట్టింది. అంతా బాగుంది అనుకునే టైంలో మాణిక్యంకి వేవిళు ్ళ మొదలయ్యాయి. రెండోసారి మాణిక్యం నీలోసుకుందను కున్నాడు. కాని, అది కడుపులో గడ్డ అని ఆపరేషన్ చేసి గర్భసంచి తీసేశారు.

అప్పుడు చేసిన అప్పు తీరింది అనుకునేలోపే ... కూతురికి పెళ్ళి వయసు వచ్చేసింది. కిందటి ఏడాదే పక్కవూరిలోని ఆటో డ్రయివర్ వాసుకిచ్చి కూతురు పెళ్ళి బాగానే జరిపించాడు. అప్పుడు మళ్ళా అప్పు. అలా అలా తీరుస్తున్నా తరగడం లేదు. వీళ్ళిద్దరూ కష్టపడి సంపాదించుకుంటూ బతుకువెళ్ళదీస్తున్నారు.

పన్నెండు అయింది. అప్పుడు వచ్చారు ఎమ్మెల్యే గారు. అంతవరకు భానుడి ప్రతాపానికి తల్లడిల్లిపోతున్న జనమంతా చల్లగాలి వీచినంతగా సంబరపడిపోయారు. సభలో కోలాహలం. ముందు ఇద్దరు పెద్దలు మాట్లాడిన తరువాత ఎమ్మెల్యే మాట్లాడారు. అతను చెప్పేది వినపడక పోయినా ప్రతి అయిదు నిముషాలకి ఒకసారి చప్పట్లు కొట్టడం... ప్రతి పావు గంటకి పార్టీ నినాదాలు చేయడం... అదే పని అక్కడున్న జనాలకు.

ఒంటిగంట అయింది. ఎమ్మెల్యే గారు ఉక్కపోత వల్ల తల్లడిల్లి పోతున్నారు. గబగబా అందరికి ధన్యవాదాలు చెప్పి, ఎన్నికల్లో చేసిన వాగ్దానాలు నిలబెట్టుకుంటానని, మరో నాలుగైదు పనికిరాని వాగ్దానాలు చేసి, హడావిడిగా వెళ్ళి తన ఏసి కార్లో కూర్చుని ... అందరికీ చేతులూపి వెళ్ళిపోయాడు.

అంతే, వెంటనే బిరియాని పేకట్టులకి కుమ్ములాట మొదలైంది. అవి తీసుకుని, డబ్బులు తీసుకుని, లారీలో మళ్ళా వూర్లోకి వచ్చేసరికి నాలుగయింది. అప్పన్న గబగబా ఇంటి వైపు నడుస్తున్నాడు.

"ఒరే బావా.. దారి తప్పినావేట్రా.." పైడయ్య అరిచాడు.

"నీ సెల్లికి... వొంట్లో బాలేదు బావా... నానింటికి ఎలతాను"

"ఛస్.. ఎల్దువు లేరా... ఇంతసేపూ ఎండలో కూకోని వచ్చామా... కసింత కడుపులో సల్లగా పోసుకొని ఎల్దాం రా..." చేయి పట్టుకొని లాక్కుపోయాడు.

## కవిత

# బతుకు చిత్రం

- ఎంఎస్ రాజు
95020 32666

నాన్నేదని అడుగుతున్న ప్రశ్నలకి
బదులీయలేక పెదాలకు
పదాలు కరువవుతుంటే
దట్టంగా కమ్ముకుని
వర్షించలేని మేఘంలా
నయనాలు నానావస్థలతో
సుడిగుండాల్లా తిరుగుతుంటే
రోజులు భారంగా గడుస్తున్నాయని
భారం మోసేవాళ్ళ బతుకులు
తెల్లారి పోయాయని
తెల్లారడం ఆగిపోతుందా?
ధైర్యాన్ని కూడకట్టుకుని
కళ్ళు కళ్ళాపి చల్లడం
ఆపేసినంత మాత్రాన
కాలం ఆగిపోతుందా?

ఆగిపోవడానికి ఇదేమి
లంగరేసిన నావ కాదు కదా
జీవిత నౌకను  తెలియని గమ్యానికి చేర్చే ప్రవాహం
బతుకు చిత్రాన్ని
విచిత్రంగా మార్చేసిన
మాయదారి మహమ్మారి కాలం! ■



---

"అది కాదురా... నీ సెల్లికి కడుపునొప్పి...."

"ఆడోళ్ళకి అయన్నీ మామూళ్ళే... బావా.. తగ్గిపోతాది"

"దాక్టరు కాడికి ఎల్లాలి.." నసుగుతూ అన్నాడు.

"ఈ ఏలప్పుడు ఏ దాక్టరు సూస్తాడు. పొద్దు పోయాక ఎల్లువు గానీ.."

అంతే ఇంకేమీ మాట్లాడకుండా .. బెల్ట్ షాప్‌లోకి దూరాడు.

ఆ చుట్టుపక్కల ప్రతి వూరి చివర్లో గెలిచిన ఎమ్మెల్యే గారి తమ్ముడివే బెల్ట్ షాపులున్నాయి. ఆ జిల్లాలో మద్యం వ్యాపారంలో అతనిదే అగ్రస్థానం. వాళ్ళు వెదజల్లిన సొమ్ముని, మళ్ళా రాబట్టడంలో ఇదీ ఒక టెక్నిక్. మనుషుల బలహీనతలతో ఆటలాడుకునే పొలిటీషియన్స్ ... వాళ్ళు ఖర్చు చేసే సొమ్ము ఎక్కడికీ పోదు... చుట్టూ తిరిగి మళ్ళా రెడింతలు, మూడింతలై వాళ్ళ వాళ్ళకే చేరుతుంది. ఇదో సైక్లింగ్ ప్రాసెస్.

ఆరు గంటలకు తుగుతూ, తూలుతూ బయిటకు వచ్చాడు.

ఇంటి కొస్తూనే "మానిక్కం... సూడే ... ఏటి తెచ్చానో సూడే... నీ కోసం బిరియాని తెచ్చానే.. సూడు.. సప్పట్లు కొడితే ఇచ్చారే.." గొణుకుతూ వస్తున్నాడు.

"రారా... వచ్చావురా.. తాగుబోతు సచ్చినోడా... నువ్వొస్తావని.. దాక్టరు కాడికి ఎలతానని ఇంతవరకు ఆశగా సూసి, సూసి మా తల్లి సచ్చిపోనాది. ఇంక నీకు రోజూ అడ్డు సెప్పేవారెవరూ లేరు. వీకవెుయ్యి తాగి, తందనాలాడుకోరా. ముదనష్టపోడా... ఛీ..ఛీ.. నీ బతుకు చెడ.." చీదరించుకుని వెళ్ళిపోయింది తెలకల రవణమ్మ. చుట్టుపక్కల వాళ్ళు ఇంటి ముందు గుమిగూడుతున్నారు.

లోపలికి వచ్చి చూశాడు. మంచం మీద మాణిక్యం నిర్జీవ దేహం వెక్కిరిస్తూ కనబడింది. అప్పన్న అయోమయంగా చూస్తున్నాడు. వాడి చెవుల్లో చప్పట్ల హోరు ఇంకా వినిపిస్తుంది. ■

# పోరుబాట

- నాగభూషణ్ పాఢీ



అమ్మ ఒడే నేటి బడి
'ఆన్‌లైన్' బోధన
ఏకలవ్య సాధన!
దరిచేరని ధన్వంతరి
చేతుల్లో కానరాకున్నది
'మానవతా' మాధురి!

అన్నం పెట్టే 'అన్నదాత'కే
'అన్నం' దొరకని దుస్థితి!
జీవన్మృతుని ఎదలో
రగిలే నిరంతర చితి!
ముగింపు లేని సమస్యలకు
తెగింపునివ్వక
కాలహరణం చేయడమేనా,
అభివృద్ధికి సంకేతం?
దిన దిన గండం
నూరేళ్ళ ఆయువుతో
కొనసాగడమేనా, జీవిత పర్యంతం!

కన్నీటి మున్నీటి చీకట్లను చీల్చి
తెల్లవారేలోగా-
తెల్ల వారాల్సిందేనా?
జీవన వసంతం!

విద్య వైద్యం వ్యవసాయం
అగమ్యగోచరమై ...
అందలమెక్కి ఊరిస్తుంటే....
సామాన్యుని ఉసురు సోకి
అందని ద్రాక్షయై 'పుల్లన'వుతూంటే...
బెరుకు లేని మరో లోకాన

'ఆశా'భూషణమై బతుకు స్వప్నం
పల్లవించాలని...
నిజం మరచి నిదుర పోతూ
నిజం కాని కలలనే
నిదుర మాటున కలవరిద్దామా?
నిజం తెలిపి- మేలుకొలిపి...
రేపటి తరం 'మేలు' కోరి
'పోరుబాటై' పలుకరిస్తూ.....
ప్రగతి దారుల స్వాగతిద్దామా?

---

# కరచాలనం



నిన్ను నువ్వు
కాపాడుకోవాలని చూడకు
వర్షపు జల్లులో తడిస్తే
ఆనందమే కదా
చందమామను
ఎవరూ తెచ్చి ఇవ్వలేరు
నీ అందమైన ముఖంతోనే
ప్రకాశించాలి

కన్నీళ్లు చాలా విలువైనవి
ముత్యాలు, రత్నాల కంటే విలువెక్కువ
కళ్ల నుంచి ప్రవహించనివ్వకు
అందమైన పెదవులపై
చిరునవ్వు మెరవనివ్వు
మాటల మధ్యలో చిరునవ్వు
ముచ్చటగా ఉంటుంది సుమా

ఉదయాన్నే సూర్యుని వెచ్చని కిరణాల స్పర్శ
వృథాగా పోనీకు
అప్పుడప్పుడు మేడ మీదకి
ఏదోఒక వంకతో వస్తూ ఉండు

ఎవరన్నారు మనసును కలపమని
కనీసం కరచాలనం చెయ్యవచ్చు కదా!

- అరుణ డేనియల్
90006 06889





# రాయలసీమ కథల్లో ప్రపంచీకరణ

- జి.వెంకటకృష్ణ
89650 34894

ప్రపంచీకరణను అర్థం చేసుకోవడానికి, 'ప్రపంచం ఒక కుగ్రామం అయిపోయింది' అనేది సులభమైన పాత వాక్యం. నిజానికదొక సామాజిక ఆర్థిక పరివర్తన. ఆర్థికంగా, సాంకేతికంగా, సామాజిక సాంస్కృతిక అంశాలన్నీ ప్రపంచవ్యాప్తంగా ఒక్కటై పోవడం. దేశాల్ని నేరుగా ఆక్రమించుకుని వలసలుగా మార్చడమనే పాత పద్ధతి స్థానంలో, పెట్టుబడిని మాత్రమే తరలిస్తూ దేశాల సార్వభౌమత్వాలను తోలుబొమ్మల్ని చేసి ఆడించడమనే ఆర్థిక సామ్రాజ్యవాదం.

మన జీవితాలతో ముడిపడిన ప్రతి అంశమూ ప్రపంచీకరణ ప్రభావానికి గురయ్యింది. మన సంస్కృతి, విలువలూ సాంతం ప్రభావితమయ్యాయి. ప్రపంచీకరణ అనే యాంత్రిక వాదం, మనుషులకు అక్కరకొచ్చే వస్తువుల్ని తయారు చేయడమే కాకుండా, వస్తువులకు అక్కరకొచ్చే మనుషులనూ తయారుచేసింది. కన్జ్యూమరిజం తారా స్థాయికి చేరి, మనుషులను వస్తువులుగా మార్చింది. అక్షరం ముక్కరాని వారికి కూడా కన్జ్యూమర్ విలువలు ఇంకేలా చేసింది. తాగడానికి పెప్సీలూ కోకాలతో పాటు పాల్డాల్ లాంటి పురుగు మందులనూ రైతుల చేతుల్లో పెట్టింది. పిజ్జాలూ బర్గర్లూ, వాటర్ బాటిల్స్ అందరి చేతుల్లో పెట్టింది. కంప్యూటర్లలో దేశ భవిష్యత్తూ, సెల్ ఫోన్లలో దేశ సంస్కృతీ పెట్టింది. యువకుల్ని డిజిటల్ కూలీలను చేసింది.

జీవితం కథగా ప్రతిఫలిస్తుంది. కథ జీవితాన్ని ప్రతిబింబిస్తుంది. సామాజిక చలనాలన్నీ సాహిత్యాన్ని ప్రభావితం చేస్తాయి. తెలుగు నేలమీద రచయితలు ప్రపంచీకరణ సామాజిక ప్రతిఫలనాలను ప్రతికూలంగా వున్న వాటినే కథలుగా చిత్రించారు. కుదేలైపోతున్న రైతులూ, వ్యవసాయరంగం, అవలక్షణాలతో కునారిల్లుతున్న విద్యారంగం, చితికిపోయిన కులవృత్తులు, పెరిగిపోయిన వినియోగదారీ ప్రవృత్తి, పెచ్చరిల్లిన పాశ్చాత్య సంస్కృతీ అనుకరణా, అన్నింటినీ మించి రైతుల, కులవృత్తి శ్రామికుల, విద్యార్థుల ఆత్మహత్యలు... ఇట్లాంటివీ రచయితలకు కథావస్తువులయ్యాయి. ప్రపంచీకరణకు ప్రతిపక్షంగా రచయితలు వ్యవహరించారు. రాయలసీమ రచయితలకైనా అదే వర్తిస్తుంది.

90ల తర్వాత వచ్చిన చాలా రాయలసీమ కథల్లో వస్తువుతో నిమిత్తం లేకుండా ప్రపంచీకరణ ప్రతిఫలనాలు కన్పిస్తాయి. ప్రత్యక్షంగా, పరోక్షంగా ప్రపంచీకరణ సమాజంలో చూపిన నెగెటివ్ అంశాలు కథల్లోకి రచయితల దృష్టికోణం నుంచి తీసుకురాబడినాయి. అయితే అదంతా ప్రపంచీకరణను పనిగట్టుకొని చేసింది కాదు, చేస్తున్నదీ కాదు. ఆయా ప్రభావాలు సమాజంలోకి యింకిపోయి వున్నాయి కాబట్టి అంత సాధారణంగా వచ్చాయి. రాయలసీమలో జరిగే వలసల మీద అనేక కథలొచ్చాయి. ఈ వలస అనేది రాయలసీమ గ్రామాల మీద ప్రపంచీకరణ దుష్ప్రభావమే అయినా రచయిత ఆ యెరుక లేకుండానే కథను మలచి వుంటాడు. అలాగే అన్నంగుడ్డ (దేవేంద్రాచారి) లాంటి కథల్లో కులవృత్తి కూడుబెట్టనితనం కథగా మారినప్పుడు రచయిత నేరుగా ప్రపంచీకరణ గురించి యేమీ చెప్పనవసరం లేదు. అయితే కొందరు రాయలసీమ రచయితలు ప్రపంచీకరణను ఆర్థిక రాజకీయ విషయంగా అర్థం చేసుకొని తమ పరిశీలనలను సామాజిక సాంస్కృతిక ఇతివృత్తాలుగా మార్చుకొని కథలుగా చెప్పారు. అలాంటి స్పృహతో రాసిన కథలు కొన్నింటిని వివరించే ప్రయత్నం ఇది.

ప్రకృతి మీద ఆధారపడి సంప్రదాయంగా జరిగే వుత్పత్తికి భారతీయ వ్యవసాయం ఉదాహరణగా నిలుస్తుంది. హరిత విప్లవాల వల్ల వ్యవసాయ వుత్పత్తి ఇబ్బడిముమ్మడిగా పెరిగింది నిజమే గానీ, అది వ్యవసాయ పెట్టుబడిని విపరీతంగా పెంచింది. మరోవైపు ప్రపంచబ్యాంకు ఆదేశాలతో ప్రభుత్వాలు వ్యవసాయంపై ఇచ్చే అంతో ఇంతో రాయితీలు ఆగిపోయాయి. రైతులు పంటలపై పెట్టుబడులు పెట్టలేక, చేతికి వచ్చిన పంటకు సరైన గిట్టుబాటు ధర నిచ్చే మార్కెట్లు లేక, అప్పులు పెరిగి దిక్కుతోచక ఆత్మహత్యల పాలయ్యారు. భారతదేశంలో జరిగిన రైతు ఆత్మహత్యలన్నీ ప్రపంచీకరణ నేపథ్యంలో జరిగినవే. ఈ విషయాలను ప్రతిఫలిస్తూ తెలుగులో అనేక కథలొచ్చాయి. అన్నింటిలో రాయలసీమ రచయితలు రాసిన తెల్లదయ్యం (స్వామి), నిశ్శబ్ద విప్లవం (జి.ఉమామహేశ్వర్) కథలు ఎంతో చర్చను రేకెత్తించాయి. విశిష్ట కథలుగానూ నిలిచాయి.

తెల్లదయ్యం కథ శిల్పపరంగా వైవిధ్యం వున్న కథ. మాజిక్ రియలిజం శిల్పంతో ఈ కథ ప్రపంచీకరణ ప్రభావం వ్యవసాయంపై, మరీ ముఖ్యంగా పల్లెలను యెట్లా పట్టి పీడిస్తోందో వివరిస్తుంది. రచయితకు ప్రపంచీకరణ పట్ల యెరుక వున్నందువల్ల, ఆ కథ పేరులోనే పాశ్చాత్య తత్వాన్ని సంకేతించాడు. ప్రపంచీకరణ పాశ్చాత్య భావజాలపు ఫలం కాబట్టి దాన్ని తెల్లదయ్యం అన్నాడు. తెల్లవాళ్ళ ఆత్మ అయిన ఆ దుష్ట శక్తి మన గ్రామాలపైబడి కొందరిని లొంగదీసుకొని తన దళారులుగా మలచుకొని చేస్తున్న విధ్వంసాన్ని కథగా మలిచాడు. అలాగే నిశ్శబ్ద విప్లవం కథలో, ప్రపంచీకరణ వల్ల అనేక గ్లోబల్ కంపెనీలు దేశంలోకి వచ్చి కొందరు విద్యావంతులను అధిక జీతాలతో సంపన్నులను చేస్తుంటే, రైతులకు మాత్రం జీవిక లేకుండా చేస్తున్న విషయాన్ని గమనించిన ఒక యువ రైతు ఆక్రోశంతో కంప్యూటర్లను పగలగొడతాడు. కొత్తగా వచ్చిన ఒక ఆర్థిక భావజాలం, సాంకేతికంగా కొందరికి మెరుగైన జీవితాన్ని ఎరగా వేసి, మెజారిటీ ప్రజలున్న గ్రామాల్ని నాశనం చేస్తోందనీ దాన్ని అడ్డుకునేందుకు నిశ్శబ్ద విప్లవం రావాలనీ కథకుడు వ్యక్తపరిచారు. కంప్యూటర్ను బద్దలుకొట్టడం ఒక నెగెటివ్ ధోరణిగా కన్పించినా, జీవితాలను దారుణంగా ప్రభావితం చేసిన యాంత్రీకరణ మీద కడుపు మండినవాళ్ళ నిరసన ఇలాగే చూపడం ప్రారంభ కథల్లో జరిగింది.

ప్రపంచీకరణ సుఖాలు మన సమాజంలో వ్యక్తమైన తీరును కన్స్యూమరిజంగా పేర్కొంటారు. సాహిత్యంలో కన్స్యూమరిజం ఒక నెగెటివ్ ధోరణిగా చిత్రించబడింది. మూడవ ప్రపంచదేశాల్లో విస్తృతమైన మార్కెట్లను పెట్టుబడితోనూ వస్తువులతోనూ నింపేయడానికి, అదికూడా స్వేచ్ఛగా యే నియంత్రణలు లేకుండా నింపెయ్యడానికి ప్రపంచీకరణ వల్ల పాశ్చాత్య దేశాలకు గొప్ప అవకాశం దొరికింది. వస్తువుల్ని కొనే సంస్కృతి పెంచిపోషింపబడటానికి వ్యక్తివాదపు ధోరణులను ప్రభుత్వాల సాయంతో ప్రచారాల ద్వారా చేయడం జరిగింది. ప్రచార మాధ్యమాల ద్వారా ప్రసారమవుతున్న అడ్వర్టైజ్‌మెంట్లు వస్తువులను కొనే మనుషుల్ని తయారు చేయడం చూస్తూనే ఉన్నాం. పెరిగిపోయిన వస్తు వినిమయత్వం మీద తెలుగులో ఎన్నో కథలొచ్చాయి.

ప్రపంచీకరణ వల్ల నీరు లాంటి నిత్యావసరాలు, మార్కెట్ వస్తువులయితాయనీ, వాటి చుట్టూ ఘర్షణలు జరుగుతాయనీ ఊహించి, భవిష్యత్తు కథగా, వాటర్ అనే కథను రాయలసీమ రచయిత జి.ఉమామహేశ్వర్ రాసాడు. మనం ఈ రోజు చూస్తున్న వాటర్ బాటిల్ కల్చర్‌ను చాలా ముందే వూహించి రాసిన కథ ఇది. అలాగే వస్తు వినిమయత యువతలో బలంగా పొడచూపి కొత్త కొత్త వస్తువులు వైపూ, నిరంతరం అనుభవించడమనే తనం వైపూ, సులభ సుఖాలు వైపూ తోసి, కుటుంబాల్లో నలుగుడుకు కారణమవుతుందని చెప్పిన కథ అమూల్య (కె.సుభాషిణి). ప్రపంచీకరణ వస్తుతత్వాన్ని కుటుంబ నేపథ్యంలో చెప్పిన కథ.

భారతీయ సమాజంలో, మరీ ముఖ్యంగా తెలుగు సమాజంలో గత ఇరవ్వయ్యేళ్ళుగా మధ్య తరగతి ని నడిపిస్తున్న ఏకైక విషయం, తమ పిల్లలను అమెరికాకు పంపడమనే కల. ఆ కల ఇక్కడి ప్రభుత్వాల ఓటు ప్రాధాన్యతగా మారి, విద్యను ప్రైవేటీకరించాలనే వాళ్ళ ప్రాధాన్యతలో తమ లబ్ధి కనిపించీ, యిక్కడి విద్యా విధానాన్నే మార్చివేసింది. ఎంసెట్ అనే ప్రక్రియ ద్వారా అనేక కార్పొరేట్ కాలేజీలు, ఇంజనీరింగ్ కాలేజీలూ పుట్ట గొడుగుల్లా మొలిచి ఇంజనీర్లను తయారు చేయడమే దేశాభివృద్ధిగా పెట్టుకున్నాయి. డాక్టర్లూ, ఇంజనీర్లూ కావడమే జీవిత లక్ష్యంగా తలిదండ్రులు భావిస్తుంటే, ఆ వొత్తిడి తట్టుకోలేక అనేకమంది విద్యార్థులు ఆత్మహత్యల పాలవుతున్నారు. రాయలసీమ రచయిత్రి కె.సుభాషిణి రాసిన చిదిమే చదువులు, ఏనుగు అడవిలోకే పారిపోతుంది లాంటివి తల్లి దండ్రుల వేదననూ. పిల్లల స్వేచ్ఛాప్రియత్వాన్నీ చిత్రించాయి. రాయలసీమ నుంచి ప్రతిభా సంపన్నమైన కథలు రాస్తున్న హరికిషన్ ఒక చల్లని మేఘం కథలో కార్పొరేట్ కాలేజీల్లోని హింసనూ, ఆత్మహత్యల వైపు పురిగొల్పుతున్న పరిస్థితులనూ ఆర్ద్రంగా చిత్రించాడు. ఇటీవలి కాలంలో కథలు రాస్తున్న రాయలసీమ రచయిత్రి కళ్యాణదుర్గం స్వర్ణలత బోగన్ విలియా అనే కథలో కార్పొరేట్ కాలేజీల్లోని వొత్తిడి గురించి

వివరించారు.

ప్రపంచీకరణ వల్ల భారత్ లాంటి దేశాల్లో చౌక కూలీలు, అందులోనూ సాంకేతిక పరిజ్ఞానం గల కూలీలు దొరకడం వల్ల పాశ్చాత్యుల దైనందిన అవసరాలు ఆన్‌లైన్లో తీర్చడానికి, కాల్ సెంటర్లనేవి పుట్టుకొచ్చాయి. వాటిలో రాత్రీపగలూ తేడా లేకుండా పనిగంటలు, వాటిల్లో పనిచేసే అమ్మాయిలు ఎదుర్కొనే ఇబ్బందుల గురించి తెలుగులో చాలా కథలొచ్చాయి. ఈ విషయం మీద కె.సుభాషిణి దీపం పురుగులు కథ రాసింది. ఈ కార్పొరేట్ సంస్థల్లో 8 గంటల పని అనే కార్మికులు హక్కు రద్దైన స్థితిని కూడా సుభాషిణి తన కథలో (ఒకటి ఇంటూ రెండు ఈజ్ ఈక్వల్ టు నాలుగు) తెలియజేస్తుంది. ప్రపంచీకరణ వల్ల విదేశీ పెట్టుబడులు, దేశీయ వనరులను దోచుకోవడానికి యధేచ్ఛగా ఏ మూలకైనా వెళ్ళడానికి మౌలిక సౌకర్యాలు అవసరమవుతాయి. వాటిని కల్పించడానికి నిరు పేదలనూ, బలహీనులనూ నిరాశ్రయుల్ని చేస్తారు. ఇదంతా ప్రభుత్వాల ఆధ్వర్యంలో నే జరుగుతుంది. ఈ విషయం మీద జి.వెంకటకృష్ణ దారి కాచిన దృశ్యం అనే కథ రాసాడు. పాణి రాసిన కార్పొరేటమ్మ- రాజకుమారుడు అనే కథ వనరుల విధ్వంసంలో అనేక కోణాలను వెల్లడించిన కథ.

ప్రపంచీకరణపు రాజకీయ తాత్వికత యెక్కడుంటుందంటే, అది తన చర్యలను దేశాల సరిహద్దులను చెరిపి నిర్వహించుకోవడంలో వుంటుంది. దేశాల సార్వభౌమాధికారం అనేది ప్రపంచీకరణతో ప్రశ్నార్థకంగా మారుతుంది. పౌరుల్లోని దేశభక్తి పలుచనై కార్పొరేట్ భక్తిగా మారుతుంది. ఇలాంటి అరుదైన, సున్నితమైన, తీక్షణమైన అంశాన్ని గూడా తెలుగు కథకులు, మరీ ముఖ్యంగా రాయలసీమ కథకులు పట్టుకున్నారు. జి.ఉమామహేశ్వర్ రాసిన 'నేను నా దేశమును.....' అనే కథ ఆ కోవకు చెందినదే. ప్రపంచీకరణ వల్ల వెల్లువలా పుట్టిన కార్పొరేట్ సంస్థలు సమాజాన్ని ఎన్నో రూపాల్లో విధ్వంసం చేస్తూ, పాప పరిహారంగా ఆయా సమాజాలపట్ల దాతృత్వంతో వ్యవహరించడం, సేవాకార్యక్రమాలు చేయడం మనం చూస్తూంటాం. దాన్ని, కార్పొరేట్ సోషల్ రెస్పాన్స్‌బులిటీగా కీర్తిస్తుంటారు. ఈ విషయం మీద కూడా జి.ఉమామహేశ్వర్ వృక్షోపాఖ్యానం అనే కథ రాసాడు. ప్రపంచీకరణ భారతీయ సమాజంలో ప్రత్యక్షంగా, పరోక్షం గానూ సానుకూలంగా, విధ్వంసంగానూ పనిచేస్తోంది. రాయలసీమలో కూడా దాని ప్రతిఫలనాలు కన్పించేంతగా ప్రపంచీకరణ పనిచేస్తోంది. అందుకు ఉదాహరణగా పైన పేర్కొన్న కథలు నిలుస్తున్నాయి. పాఠకుల హృదయాల్లో సమాజ అవసరాల మేరకు చర్యలకు అవి ప్రేరేపిస్తాయి. ■



## విధ్వంసపు అలుకు

కొన్ని కాలువల్ని కలిపితే
నది అవుతుందని నమ్మబలుకుతారు
కొన్నాళ్లకు నదులూ కుచించుకుపోతాయి
అప్పుడు నదులన్నీ
సముద్రంలో కలిసిపోవాలంటారు
సముద్రం సముద్రమే
అది ప్రభుత్వానిదో ప్రైవేటుదో
కాలానికే ఎరుక!

కొత్తగా కుంచె పట్టుకున్న చేతులకు
ఏ చిత్రానికి ఏ రంగు అద్దాలో తెలిసుండాలి
ఏ రంగు ఎంత ఆరాక
మరో రంగును దిద్దాలో గమనింపుండాలి
రంగులన్నీ ఒకేసారి వెల్లువెత్తితే
దృశ్యం అసలు కొట్టుకుపోకుండా
నిలబడుతుందా అన్న తెలివుండాలి
ఇప్పుడదేం లేదు
అంతటా ఒక ఉధృతి
ఒక రంగు రంగుల విధ్వంసపు అలుకు!

రేపటి పొద్దును రాయాలంటే
సుదీర్ఘ రాత్రిలోని ప్రతి వాక్యాన్నీ శ్రద్ధగా చదవాలి
కాలువల్నీ నదుల్నీ అంటుగట్టాలంటే
ప్రతి నీటిబొట్టునీ నేర్పుగా అతికించాలి
ఓ దృశ్యం
తనంతతానే పసిపాపలా పాక్కుంటూ వచ్చి
నువ్వు కలగనే వర్ణాన్ని హత్తుకునేవరకూ
ఓపిగ్గా ఎదురుచూడాలి!

(NEP -2020 మేరకు రాష్ట్రం తీసుకుంటున్న ఆదరాబాదరా నిర్ణయాలు,
ఒక మాధ్యమం మీదున్న అతి మోజు గురించి)

- భరత్



# రాజీ పడని కలం యోధుడు గరిమెళ్ల

- డాక్టర్ మండి అన్వర్ హుస్సేన్
94406 55230

ప్రజాపాటల తాతయ్యగా ప్రసిద్ధులైన కవి, రచయిత, స్వాతంత్ర్య సమరయోధుడు గరిమెళ్ళ సత్యనారాయణ శ్రీకాకుళం జిల్లా నరసన్నపేట తాలూకా గోనెపాడు గ్రామ శివారులోని ప్రియాగ్రహారంలో 1893 జులై 14వ తేదీన వెంకట నరసింహం, సూరమ్మ దంపతులకు జన్మించారు. స్వగ్రామంలోనే ప్రాథమిక విద్యను అభ్యసించారు. తరువాత విజయనగరం, మచిలీపట్నం, రాజమండ్రిలలో ఉన్నతవిద్య అభ్యసించారు. బిఏ డిగ్రీ పూర్తిచేసిన తర్వాత గంజాం కలెక్టర్ కార్యాలయంలో గుమాస్తాగా కొద్దికాలం పనిచేశారు. విజయనగరంలో ఉన్నత పాఠశాలలో ఉపాధ్యాయులుగా కూడా కొద్దికాలం పనిచేశారు. వీరి ముక్కుసూటితనం కారణంగా ఏ ఉద్యోగంలోనూ ఎక్కువకాలం ఉండేవారు కాదు. ప్రియాగ్రహారం గ్రంథాలయంలో ఫ్రీలాన్స్ జర్నలిస్టుగా కొద్దికాలం పనిచేశారు. 'అనంతవాహిని' పత్రికకు సంపాదకులుగాను, 'ఆచార్యరంగా', 'వాహిని' పత్రికలకు సహాయ సంపాదకులుగా పనిచేశారు. వీరిది బాల్యవివాహం. మేనమామ కూతుర్ని వివాహం చేసుకున్నారు. వారికి ఒక కుమార్తె. మొదటి భార్య మరణించడంతో రెండవ వివాహం కూడా చేసుకున్నారు.

తెలుగుభాష పై మంచిపట్టున్న గరిమెళ్ళ సత్యనారాయణ 1915లో 'వాదుకభాష' పేరిట మొదటి రచన చేశారు. అది గురజాడ స్మృతిగీతం. నాటి దేశ రాజకీయ పరిస్థితులు గరిమెళ్ళ జీవితంలో అనేక మార్పులు తీసుకొని వచ్చాయి. 1920 సెప్టెంబరు 4 నుంచి 9 వరకు జరిగిన కలకత్తా ప్రత్యేక కాంగ్రెస్ సభలో గాంధీజీ తీసుకున్న సహాయ నిరాకరణ ఉద్యమ తీర్మాన కారణంగా అనేకమంది స్వాతంత్ర సమరయోధులు ప్రభుత్వ ఉద్యోగాలను, బ్రిటీష్ ప్రభుత్వం ఇచ్చిన బిరుదులను విడిచి స్వాతంత్ర్య ఉద్యమంలో పాల్గొన్నారు. గాంధీ పిలుపు మేరకు స్వాతంత్ర పోరాటమే తన జీవిత లక్ష్యంగా నిర్ణయించుకుని గరిమెళ్ళ ఆ విషయాన్ని తన తండ్రి వెంకట నరసింహం గారికి తెలియజేశారు. అప్పటినుండి స్వాతంత్ర్యకాంక్షతో ఒక కార్యకర్తగా, రచయితగా ఎన్నో త్యాగాలు చేసి, రచనలు చేసి బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాటం చేశారు గరిమెళ్ళ.

1921లో 'స్వరాజ్యగీతములు' మొదటి భాగం, 1922లో 'స్వరాజ్యగీతములు' రెండవ భాగం, 1926లో 'నూతన జాతీయగీతములు', 1933లో 'హరిజన పాటలు' వంటి జాతీయ భావాలను వ్యక్తపరిచే గేయ రచన చేశారు. స్వరాజ్య గీతములు మొదటి భాగంలోనే వీరి చారిత్రాత్మకమైన 'మాకొద్దీ తెల్లదొరతనము' అనే పాట ఉంది. స్వాతంత్ర్య ఉద్యమంలో భాగంగా సహాయ నిరాకరణ, విదేశీ వస్తు బహిష్కరణ వంటి అంశాలను తన గేయాలలో బలంగా తెలియజేశారు.

గరిమెళ్ళ స్వయంగా "మాకొద్దీ తెల్లదొరతనము.... దేవా మా కొద్దీ తెల్ల దొరతనము" అంటూ గళమెత్తి పాడుతూ ప్రజలను చైతన్యపరిచేవారు. బ్రిటీషువారు వ్యాపారం కోసం వచ్చి, భారతదేశాన్ని తమహస్తగతం చేసుకొని జాతీయ సంపదనంతా కొల్లగొడుతున్నారని, పాడిపంటలకు నిలయమైన దేశంలో భారతీయులు పస్తులుండే పరిస్థితి తెచ్చారని చెప్పారు. ఉప్పు సత్యాగ్రహానికి పదేళ్ళమునుపే 'ఉప్పు

ముట్టుకుంటే దోషమండి' అని ముందే ఊహించారు. ఈ గేయాన్ని గరిమెళ్ళ స్వయంగా పాడగా విన్న బ్రిటిష్ కలెక్టర్ బ్రేకన్ 'భాష తెలియని నాకే ఇంత గగుర్పాటు కలిగితే ఇంక జనసామాన్యం ఈ పాటతో ఎంతమహోద్రిక్తులై ఆవేశ పడు తున్నారో' అని అక్కడికక్కడే గరిమెళ్ళకు ఒక సంవత్సరం జైలుశిక్ష విధించారు. జైలునుంచి విడుదలైన తర్వాత బ్రిటీషు వారికి వ్యతిరేకంగా తను రాసిన గేయాలను రెట్టింపు స్వరంతో పాడుకుంటూ వెళ్ళేవారు గరిమెళ్ళ. అనేకమంది అధికారులు ఫిర్యాదు చేయడంతో, కాకినాడ మెజిస్ట్రేట్ జాతీయ ప్రబోధ రచనలు చేసినందుకు మరో రెండేళ్లు కారాగార శిక్షను విధించారు. మాకొద్దీ తెల్లదొరతనము పాటను పుస్తకంగా ప్రచురించిన స్థానిక స్వాతంత్ర సమరయోధులు ఆచంట సత్యనారాయణ గారికి ప్రభుత్వం ఒక ఏడాది కఠిన కారాగార శిక్ష విధించింది. గాంధీ గారు గరిమెళ్ళ సత్యనారాయణ గారిని సబర్మతీ ఆశ్రమానికి పిలిపించి వారి ముఖతా మా కొద్దీ తెల్లదొరతనం గేయాన్ని విని ముగ్ధులయ్యారు. ఈ గేయాన్ని ఇతర భాషల్లోకి తర్జుమా అయ్యేలా ఏర్పాటు చేశారు. ఈవిధంగా ఈ గేయం ఆంగ్లభాషలోకి అనువాదమై ప్రకాశం గారి 'స్వరాజ్య' పత్రికలో వెలువడింది. బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా నిరసన తెలపడానికి శక్తివంతంగా ఈ పాట ఉపయోగపడింది. ఆంధ్రరాష్ట్రంలో ఉద్యమకారులు ఖద్దరు దుస్తులు, గాంధీ టోపీ ధరించి, 'మాకొద్దీ తెల్లదొరతనము' అని పాడుకుంటూ బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా నిరసనలు తెలిపేవారు.

గరిమెళ్ళ శ్రీ శారదా గ్రంథమాలను ప్రారంభించి అనేక గ్రంథాలను అచ్చువేశారు. 1926లో 'ఖండ కావ్యాలు', 'భక్తి గీతాలు', 'బాలగీతాలు' అచ్చువేశారు. గరిమెళ్ళకు తమిళ, కన్నడ, ఆంగ్ల భాషలలో కూడా మంచి పాండిత్యం ఉండేది. తిరువళ్ళువర్ రచించిన పద్యాలను తెలుగులోకి అనువాదం చేసి 'అర్థత్రయ సర్వస్వం' అనే పేరుతో అచ్చువేశారు. తమిళంలోని 'తిరుక్కురల్', కన్నడ లోని 'తల్లి కోట నాటకం', భోగరాజుపట్టాభిసీతారామయ్య ఆంగ్లంలో రచించిన, (The Economic Conquest of India) గ్రంథాన్ని తెలుగులోకి అనువదించారు. 'గృహలక్ష్మి', 'కృష్ణాపత్రిక', 'భారతి', 'ఢంకా', 'త్రిల్లింగ్', 'ఆంధ్రపత్రిక'లో అనేక వ్యాసాలు రాశారు. వీరు స్వయంగా ఆంగ్లంలో 'హార్ట్ ఆఫ్ ది నేషన్', 'మదర్ ఇండియా' అనే పద్య కావ్యాలు రచిం చారు.

గురజాడ అప్పారావు గారి ముత్యాల సరాలు, కన్యాశు



ల్కం నాటకం గరిమెళ్ళ వారిని ఎంతో ఉత్తేజపరిచాయి. జానపద బాణీలో 'వాడుక భాష' అనే గేయాన్ని రాసి, అప్పారావు గారి ముత్యాలసరాలకు జేజేలు పలికారు. గురజాడ వారి రచనలు తనకు మార్గనిర్దేశం చేశాయని చెప్పుకున్నారు. ఈ గేయం 1915 డిసెంబరు 4న 'కృష్ణాపత్రిక'లో వెలువరించింది.

గరిమెళ్ళ రచనల్లో మకుటాయమానం 'మాకొద్దీ తెల్లదొరతనము' గేయం. 142 చరణాలు కలిగిన ఈ పాట ఒక్కొక్క మాట ఒక ఫిరంగి గుండు, శక్తివంతమైన ఆయుధంలా బ్రిటిష్ ప్రభుత్వ గుండెలకు తగిలింది. తెల్ల దొరలను నిర్భయంగా ఈసడిస్తూ భారతీయులను వారు ఎలా పీడిస్తున్నారో, జాతీయ సంపదను ఎలా కొల్ల గొడుతున్నారు తేల్చి చెప్పారు. ఇంకా 'దండాలండోయ్. మేముండ లేమండోయి బాబు' గేయాన్ని 'సైతాను ప్రభుత' శీర్షికతో రాశారు. 1922లో స్వరాజ్య గీతములు రెండవభాగం వెలువడింది. అందులో 11 శీర్షికలతో బ్రిటిష్ ప్రభుత్వాన్ని ఎండగట్టే విషయాలను ప్రస్తావించారు. విదేశీ వస్తు బహిష్కరణ, సహాయ నిరాకరణ, స్వరాజ్య పరిపాలన వంటి విషయాలను బాగా ప్రచారం చేశారు. స్వరాజ్య గీతములు రెండవ భాగాన్ని బ్రిటిష్ ప్రభుత్వం నిషేధించి ఐదువేల ప్రతులను ధ్వంసం చేసి గరిమెళ్ళకు రెండేళ్ళు జైలుశిక్ష విధించింది. 1926లో 'నూతన జాతీయ గీతములు' అనే గేయ కావ్యాన్ని ప్రచురించారు. ఇందులో 13 శీర్షికలతో జాతీయ నాయకుల గొప్పదనాన్ని, వందేమాతరం నివాదపు ప్రయోజనాన్ని వివరించారు. ఇక కృష్ణాపత్రికలో గరిమెళ్ళ సత్యనారాయణ గారి 'ఆంధ్రా యూనివర్సిటీ', 'కాంగ్రెసులో గలాభా', 'రాజ భక్తి గీతము', 'లాలాజీకి!', 'ఆది స్వతంత్రము', 'నెమలి పాట', 'స్వరాజ్యమునకొకబాట', 'మోహనరంగడి పదములు' మొదలైనవి చెప్పుకోదగినవి. 'సీతాకోకచిలుక' అనేది పిల్లల గేయం. ఇక గరిమెళ్ళ రాసిన గేయం 'దేశీయ గీతము' బల్గేరియా గీతానికి అనువాదం. 1933లో 'హరిజనుల పాటలు' గేయ సంపుటిలో 14 శీర్షికలతో అంటరానితనాన్ని నిరసిస్తూ, భారతదేశంలో రావలసిన కుల రహిత సమాజాన్ని విశ్లేషించారు. 1936 జనవరి ఆంధ్రభూమి పత్రికలో

'సంక్రాంతి మహిమ' అనే కవితలో సంక్రాంతి పండుగకు కొత్త భాష్యాన్ని చెప్పారు. 1947 నవంబర్ 'భారతి' దీపావళి సంచికలో అమృతాంజనం ప్రకటన కొరకు రాసిన 'అమృతాంజనము' అనే గేయం రాశారు.

1933లో నలభై ఏళ్ల వయసులో మద్రాసు చేరారు గరిమెళ్ళ. అక్కడ కె.ఎన్.కేసరి నడిపే 'గృహలక్ష్మి' మాసపత్రికలో కొద్దికాలం పనిచేశారు. తరువాత ఆంధ్రప్రభ దినపత్రికలో కొద్దికాలం, తర్వాత 'ఆనందవాణి'లో కొద్దికాలం పనిచేశారు. వావిళ్ళ రామస్వామి శాస్త్రి నడిపే 'త్రిల్లింగ్' అనే పత్రికలో గరిమెళ్ళ వారి అనేక వ్యాసాలు వచ్చేవి. వీరు 'దుందుభి', 'వికారి' అనే కలం పేర్లతో కూడా వ్యాసాలు రాసేవారు. గరిమెళ్ళ వారికి రాజీపడటం అంటే ఏమిటో తెలియదు. తన చెల్లెలిని ఇంగ్లీషు చదివిన వాడికిచ్చి పెళ్లి చేయడానికి కూడా వారు ఇష్టపడలేదు. 1923లో వారి తండ్రి మరణించినప్పుడు జైల్లో ఉన్నారు. క్షమాపణ చెబితే విడుదల చేస్తామన్నారు జైలు అధికారి. క్షమాపణ చెప్పడానికి నిరాకరించి తండ్రి అంత్యక్రియలలో కూడా పాల్గొనలేకపోయారు. వారి జీవిత చరమాంకంలో ఆర్థికంగా అనేక ఇబ్బందులను ఎదుర్కొన్నారు. దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు అప్పుడప్పుడు ఆర్థికంగా ఆదుకున్నారు, వావిళ్ళ వెంకటేశ్వరరావు గారు నెలకు పదిరూపాయలు భృతిగా ఇచ్చేవారు. కంటికి చేయించుకున్న ఆపరేషన్ విఫలమై ఒక కన్ను పోగొట్టుకున్నారు. బ్రిటీషు ప్రభుత్వానికి సింహస్వప్నంగా నిలిచిన నిస్వార్థ, స్వాతంత్ర సమరయోధుడైన గరిమెళ్ళ సత్యనారాయణ, మద్రాసు మహానగరంలో ఎవరికీ తెలియని వ్యక్తిగా 1952 డిసెంబర్ 18వ తేదీన చివరిశ్వాస వదిలారు. ఇరుగుపొరుగువారే గరిమెళ్ళ అంత్యక్రియలు నిర్వహించారు.

**(ఈ వ్యాసకర్త అసోసియేట్ ప్రొఫెసర్ ఆఫ్ తెలుగు, ఉస్మానియా కళాశాల, కర్నూలు – 518001)**

> **"సముద్రం ఒకడి కళ్ళముందు కూర్చుని మొరగదు**
> **తుపాను గొంతుకి 'చిత్తం' అనడం తెలియదు**
> **నేనింతా ఓ పిడికెడు మట్టే కావచ్చు, కానీ**
> **కలమెత్తితే నాకు ఓ దేశపు జెండాకున్నంత పొగరుంది'**
>
> **– గుంటూరు శేషేంద్ర శర్మ**



## Prega News

పదుర్లు ఎక్కిన అర చేతుల్లో
ముత్యంలాంటి మాట వికసిస్తుందని
ఆకాశం రెండుగా చీలి
కొత్త దారిని నిర్మిస్తుందని
అడుగులో అడుగేసుకుంటూ
నిండు కుండ లాంటి వార్తను
మోసుకొచ్చిన ఆమె ముఖంలో
అమ్మతనాన్ని చూశాను

నా చేయిని తీసుకొని
తన గర్భంపై తిప్పినప్పుడు
కొత్త స్పర్శను అనుభవించాను
ఒక్క క్షణం పాటు మైమరిచిపోయాను
గుండెను హత్తుకొని
ఆనందభాష్పాలను జారవిడిచినప్పుడు
శుభ్రమైన నా భుజాలు
కొత్త బరువును మోయడానికి
సిద్ధమైనట్టే అనిపించింది

అవును
Prega Newsలో ఉన్నది
రెండు పింక్ గీతలే కానీ
రెండుగా ఉన్న మమ్మల్ని
మూడుగా చేయడానికి
కుటుంబంగా ఎదగడానికి
సాక్ష్యాలుగా నిలిచినప్పుడు
వర్ణించలేని అనుభూతిని పొందాను
'నేను తండ్రిని కాబోతున్నాను'
ఇంతకంటే గొప్ప కవితా వాక్యం ఏముంటుంది?

**– జాని తక్కెడశిల**

## తరగతులు

గతులు తప్పిన తరగతులు
మళ్లీ గాడిన పడాలి
ప్రాణాల్ని మింగే భూతం
చదువుల బడిని మూగబోయెట్టు చేసింది
ఊహకందని మహమ్మారి విచిత్రాలకు
భావితరమంతా మూల్యం చెల్లించుకుంది
కాలమెప్పుడూ అమూల్యమే కదా..
తిరిగిరాని రోజుల్ని ఏ త్రాసులోనూ తూచలేము
వేగంగా పూడ్చటానికి
మెదళ్లు ఖాళీ సంచులుకావు కదా..
జీవం లేని యంత్రాలు
ప్రశ్నల పరంపరకు బదులెప్పుడూ ఇవ్వవు
సాంకేతికత ఎంత పెరిగినా
బోధకుడికి
ఏ ఆధునిక రోబో కూడా ప్రత్యామ్నాయం కాదు

విలువల వలువలూడి పోకుండా
కాపాడుతున్నోళ్లను
కాలమే కాపాడుకోవాలి
భావికి పునాదిరాళ్లను వేసేటోళ్లను
భద్రంగా పదిలపరుచుకోవాలి

సమగ్ర అనుభవాల వ్యూహంతో
ఒజ్జలంతా అడుగులెయ్యాలి
నల్లబల్లపై మల్లెపూల వర్ణమాలల్ని అల్లుతూ
విద్యాపరిమళాల్ని
ఎదల్లో హృది గదుల్లో వెదజల్లాలి

కుదించబడ్డ కాలంలోనే
కాలనిర్ణయ పట్టికల్ని గీసుకొని
భద్రతను భరోసాను
పాఠాల్ని గుణపాఠాల్ని
ఆకళింపు చేసుకోని
ఉషస్సులా తపస్సులా సాగిపోవాలి
బతుకు తెరువుల తరగతులు!

- డా.కటుకోర్వ్భుల రమేష్
99490 83327

## వినిపించని గుండె ఘోష!

అక్షర విత్తనాల్ని భావోద్వేగపు రంగులో ముంచి
కాగితంపై వెదజల్లుతాడు
భిన్న నేపథ్యాలని తనలో ఇముడ్చుకొని
ఇంకు చుక్కలై మెరుస్తాయి !
వాక్యాలు నడుమ
భావాన్ని చేరవేసే పరికరాలు
ఎన్నని లెక్కపెట్టగలం?
ఎత్తుగడ నుంచి ముగింపు దాకా
రన్నింగ్ హర్డిల్స్ పరిగెత్తిస్తుంటాయి
పేజీకొక దృశ్యం
వాస్తవం నుంచి ఒక్కో సంఘటన
కళ్ళ ముందు ఆవిష్కరిస్తే
వొలికిన కన్నీరే సాక్ష్యం
ఓ చల్లని సాహితి సాయంత్రంలో
తనలోని భావ సంద్రాన్ని
లోకంపై కురిపించాడు
కాగితాల సమూహపు పుస్తకాన్ని
అందమైన పెళ్లి కూతురులా ముస్తాబు చేసి
నలుగురికి పరిచయం చేసాడు
కవిత్వం చదవడమే మృగ్యమైన చోట
పేపర్ పాంప్లెట్‌లా పంపిణి చేసి
జీవితం, జేబు
రెండు ఖాళీ చేసుకున్నాడు
చేతిలో తన ప్రియ పుస్తకాన్ని ప్రతి సభలో,
అపురూపం గా అతను అందిస్తుంటే
విలువ తెలియనివారు
బజారులో వేలం వేస్తున్నారు..
నెల తిరగకుండానే ఓ ఆదివారం రోజు
ఏ అబిడ్స్ రోడ్ పైననో, చార్మినార్ కమాను దగ్గరో
ప్రేమతో రాసిన సంతకం పేజీ వెక్కిరిస్తుంది...
అది చూసినప్పుడు
కవి గుండె బద్దలైపోతుంది .. నిశ్శబ్దంగా !

- పుష్యమీ సాగర్
9010350317

# బూడిదై పోవొద్దు!



- ఆర్‌సి కృష్ణస్వామి రాజు
93936 62821

చిత్తూరు జిల్లా తమిళనాడు సరిహద్దుల్లో ఉన్న చిన్న గ్రామం అది.

"జుంబారే .. జుజుంబరే

జుంబరాయ్ జుంబరాయ్ జుంబారే...." అని పాడుకుంటూ అర నిక్కరేసిన ధర్ముడు పంచాయతీ ఆఫీసు వెనుకగా వెళు తున్నాడు. అక్కడే చింతచెట్టు కింద పొట్టి రెక్కల చొక్కా వేసి నిలబడి ఉన్నాడు నలభై ఏళ్ల వేలాయుధం.

జేబులోని అగ్గిపెట్టెను తీసి అగ్గిపుల్లలు లెక్కిస్తూ 'ఒరేయ్ ధర్మా, దబ్బిస్తా, అంగడికి వెళ్లి రెండు సిగరెట్లు తీసుకు రారా' అని అడిగినాడు.

'అదేందన్నా అంగడి మీదే కదా, రాజు లెక్కన వెళ్లి తెచ్చుకోవచ్చు కదా' అని బదులిచ్చినాడు.

'అంగడి మాది కాబట్టే బాధరా ధర్మా. నా పెళ్ళానికి నేను సిగెరెట్టు తాగేది ఇష్టముండదు. సిగెరెట్టు లేకపోతే నా ప్రాణం ఉండదు. నా దగ్గర సిగెరెట్టు వాసన వస్తే ఆ రోజు ఇంటిలో రచ్చంటే రచ్చ అనుకో. రోజూ ఏదో ఒక రకంగా మేనేజ్ చేస్తా ఉండా. నీకు పుణ్యముంటాది రెండు సిగెరెట్లు తెచ్చివ్వు ధర్మా' అని ఒకటికి రెండు సార్లు అడిగినాడు.

అలాగేనని చెప్పిన ధర్ముడు అంగడికాడికి పోయి నిలబడినాడు. అంగడి ఓనరమ్మ అయిన సహదేవమ్మ అడిగినవారికి సరుకులిస్తూ ఉంది. జనాలు దండిగా ఉన్నారు. ధర్ముడు అంగడికాడ నిలబడాలంటే మాములుగా అయితే గొణిగే వాడే కానీ, ఆ రోజు వాడు గొణగలేదు. ఎందుకంటే అంగడిలో మూల పెట్టి ఉన్న జామకాయల బుట్ట నుంచి జ్యామ్ జ్యామ్ అని మత్తెక్కించే వాసనలు వస్తున్నాయి. అందుకని అక్కడే నిలబడి అమ్మలక్కల మాటలు వినసాగాడు.

పని మనిషి ఇళవరసి ఊగతా ఊగతా వచ్చి నిల బడింది.

"ఏమి ఇళవరసీ, అంగడికి సరిగా రావడం లేదు. మీ ఇంటి ఓనరు అయిన ఆర్ఎంపీ డాక్టరు సిగెరెట్టు తాగినప్పుడెల్లా వక్కపొడి వేసేవాడు కదా.. భార్య దగ్గర కంపు కొడుతుందని ఆయన కోసం వక్కపొడి కొనుక్కుపోయే దానివి కదా" అని పలకరింపుగా అడిగింది సహదేవమ్మ.

"అయ్యో లేదు సహదేవమ్మా.. అక్కడ పనికి ఎప్పుడో నిలిచి పూడిస్తిని. కూలి పనులకు పోతా ఉండా" అని బదులిచ్చింది.

ఇళవరసి పనికి నిలిచిపోవడంలో ఏదో మతలబు ఉందని 'ఏల నిలిచి పూడిస్తివి' అని కూపీ లాగింది.

"సారు మంచోడే.. మేడమ్ ఒక మాదిరి మనిషి. ఆమె కన్నా మంచి చీరలు కడతానని ఆమెకు కుళ్ళు. మొగుడితో సహా పేషంట్లు అందరూ నన్నే చూస్తావుండారని నన్ను పనికి రావద్దని చెప్పింది. ఓనర్లకి ఒకే ఇల్లు, పని మనుషులకు పది ఇండ్లు కదా" అని పకపకా నవ్వుతూ చెప్పింది.

అక్కడున్న వాళ్లంతా పడీపడీ నవ్వినారు.

"అయ్యో రామా.. అదా విషయం" అంటూ ఆమె అడిగిన శాంపిల్ సోప్ ఇచ్చి పంపింది.

సర్రున సైకిల్ పైన పోతున్న టింకరు మూడో కొడుకు అంగడి ముందర సైకిల్ ఆపినాడు. ప్యాంటు పైకి లాక్కొని నేల మీద కూర్చొని టైరులో గాలి ఉందో లేదోనని అదిమి అదిమి చూడసాగాడు. 'సైకిల్ టైర్లలో గాలి బాగుందే, వీడేందుకు సైకిల్ నిలబెట్టినాడు?' అని ధర్మడు ఒకటికి రెండు సార్లు తొంగి చూసినాడు. 'ఏమోలే మనకెందుకు' అనుకుని గమ్మున ఉండిపోయినాడు. ఎందుకో అనుమానం వచ్చి మళ్ళీ చూస్తే, వాడు వీధిలో తాగి పడేసిన బీడీ తుంటలను ఏరుకుని జేబులో వేసుకోవడం గమనించాడు. 'ఇందుకోసమా మనోడి గాలి చెకింగ్' అని ముసిముసి నవ్వులు నవ్వినాడు. అది ఓర కన్నుతో చూసిన టింకరు మూడో కొడుకు సిగ్గుమొగ్గలై సర్రున సైకిల్ తీసుకుని తుర్రుమన్నాడు.

పడమటి వీధి మొగోళ్ళు ముగ్గురు కిందామీదా పడతా ఊగుతూ పోతున్నారు. వారు బీడీలు కాలుస్తూ వెళుతున్నారు. బిడ్డని చంకన పెట్టుకొచ్చిన ఒక చిన్నబిడ్డ తల్లి చీర కొంగుతో బిడ్డకు పొగ తగలకుండా విసురుతూ నిలబడింది. అంగడికి కొత్తిమీర కోసం వచ్చిన చిత్తూరులో డిగ్రీ చదివే పిల్ల వారిని చూసి "అంత గబ్బు కొడతా వుందే, తాగేవాళ్ళకి ఉండదా అక్కా" అని అడిగింది.

"వాళ్ళ వాళ్ళ పిచ్చి వాళ్ళకి ఆనందం... వద్దని చెబితే వింటారా ఏంది?" అని వేదాంత ధోరణిలో బదులిచ్చింది సహదేవమ్మ.

అందరూ వెళ్లినాక ధర్మడు రెండు సిగెరెట్లు ఇవ్వమని డబ్బు ఇచ్చాడు. 'ధూమపానం ఆరోగ్యానికి హానికరం' అన్న అక్షరాలు మిలమిలా మెరుస్తున్న పెట్టెలో నుంచి రెండు తీసి ఇచ్చింది.

కొనుక్కుని చేతులు తిప్పుతూ కారులో పోయినట్లు 'పుయ్ పుయ్' అని నోటితో అరుస్తూ వెళ్లి వేలాయుధం చేతిలో పెట్టినాడు. "నా బంగారు కొండే... నువ్వు నూరేండ్లు బతకాలి" అని ఆశీర్వదించి సర్రున అక్కడినుంచి కయ్యిలలోకి పోయినాడు.



పది ఫెయిలైనాడు ధర్మడు. ఊర్లో ఉంటే ఎటూ కాకుండా పోతాడని వాడి మేనమావ వాడిని తీసుకుని బొంబాయి వెళ్ళినాడు. అపార్టుమెంట్ కట్టేచోట కూలీగా చేర్చినాడు. కొన్నాళ్లకు ధర్మడు మేస్త్రీ అయినాడు. చిన్నచిన్నగా బిల్డింగ్ కాంట్రాక్టులు ప్రారంభించాడు. అక్కడే రాజస్థాన్ అమ్మాయిని పెండ్లి చేసుకున్నాడు. తన కూతురిని చేసుకోలేదని మేనమావ రచ్చ చేసినాడు. అమ్మ నాన్నలు లేనివాడివని చేరదీస్తే తిన్నింటి వాసాలు లెక్క పెడతావా అని నిష్ఠూరమాడినాడు. రాకపోకలు తగ్గించిన మేనమావ, ధర్మడికి దూరంగా జరిగిపోయాడు. రానురాను ధర్మడు ఊరికి, ఊరి జనానికి పూర్తిగా దూరమయ్యాడు.

పది సంవత్సరాలు గడిచిపోయాయి. ఎందుకో ఒక రోజు పుట్టి పెరిగిన ఊరు చూడాలనిపించింది. ఊర్లో జాతరని తెలిసి ఊరికి వెళ్ళివద్దామని ధర్మడు రైలెక్కాడు.

ఊర్లో జాతర జరగతా ఉంది. ఎండ మండిపోతోంది. నిప్పుల వర్షం కురుస్తున్నట్లుగా ఉంది. ఆడవాళ్లు పొంగళ్ళు పెడుతున్నారు. తినడానికి ఏదైనా దొరుకుతుందేమోనని వీధికుక్కలు అక్కడే చుట్టుకులాడుతున్నాయి. పొంగళ్ళు పెట్టే చోట పని మనిషి ఇళవరసి కూడా ఉంది. ఇప్పటి ఇళవరసి అప్పటిలా లేదు. ఈ మధ్యనే కువైట్ వెళ్లి వచ్చింది. పట్టు చీర కట్టి తలలో మూర మల్లెలు పెట్టి ఒళ్ళంతా బంగారంతో సింగారించుకుని ఉంది. ఆమె వేషమే కాదు, భాష కూడా మారి ఉంది. పొంగళ్ళు పెట్టే ఆమెకు మొగుడు పక్కనే ఉండి అవీఇవీ అందిస్తున్నాడు.

ధర్మడిని చూసి ఇళవరసి మొగుడితో పాటు గబగబా వచ్చి "ధర్మా, జాతరకి పొట్టేలు కొట్టినాము. సంగటి, తలకాయ కూర చేసినాను. తప్పకుండా తిని వెళ్ళు" అని అంది.

"ఊరు వదిలి పదేళ్లయినా నన్ను ఇంకా గుర్తు పెట్టుకుని సంగటి తిందాం రమ్మని పిలుస్తున్నావు, సంతోషం. ఎవ్వరినైనా పిలిచి పూట అన్నం పెట్టడం పల్లెల్లోని ప్రతి ఆడబిడ్డకూ అలవాటైన విషయాలే కదా, కడుపు నిండిపోయింది ఇళవరసీ"

"అదేంది ధర్మా, అట్లా అంటావు వేరే ఊరు వెళ్లినా, విదేశమెళ్లినా మన ఊరు మాదిరి ఏ ఊరూ ఉండదు ధర్మా. ఊర్లో ఉన్నప్పుడు ఊరు విలువ తెలియదు కానీ ఊరు వదిలితే తెలుస్తుంది. నువ్వు మర్చిపోకుండా భోజనానికి రా" అని చెప్పి వెళ్ళిపోయింది.

ఊర్లో పిల్లకాయలు గుంపుగా చేరి పాపులర్ తమిళ సినిమా పాట పాడుతున్నారు.

"సురాంగనీ, సురాంగనీ
సురాంగని కామాల్ కన్నా మాల్
మాల్ మాల్ మాల్, సురాంగనికామాల్

సురాంగని కామాల్ కన్నా మాల్"

ఊరిలో ఎవరో బంబాయి నుంచి మేస్త్రీ ధర్ముడు వచ్చినాడని చెప్పినారు. అంతే 'పొలో'మని ఊరి పిలకాయలు పదిమంది 'బంబాయ్ బాబాయ్ వచ్చినాడోచ్' అని అరుస్తూ ధర్మడి చుట్టూ చేరినారు. అంతమంది పిల్లలు తన చుట్టూ చేరేసరికి ధర్ముడు ఖుషీ అయినాడు. తనతోపాటు తెచ్చిన తీపి మిఠాయి అందరికీ తినిపించాడు.

గంగమ్మ గుడికాడ పాత రాముడు – భీముడు సినిమాలోని రేలంగి పాట – "సరదా సరదా సిగిరెట్టు

ఇది దొరల్ తాగు భలే సిగరెట్టు..." మైకులో జోరుగా వినిపిస్తోంది.

పలకలు బలంగా మోగుతున్నాయి. అందరితో పాటు ధర్ముడు ఎగిరెగిరి పులి అడుగులు వేసినాడు. ఒళ్ళు అలిసింది. చెమట తుడుచుకుంటూ చిన్నగా సహదేవమ్మ అంగడికి పోయినాడు. 'బాగుండావా ధర్మా, ఇప్పుడు ఎక్కడ ఉండావు? ఊరినుంచి ఎప్పుడు వచ్చినావు?' అని అడిగింది. అన్నిటికీ నవ్వుతూ సమాధానాలిచ్చినాడు.

ఒక గోలీ సోడా కొట్టి ముఖం మీద చల్లుకున్నాడు. రెండో సోడా కొట్టి గుటగుట తాగినాడు. 'సిజర్స్ సిగరెట్టు ఒకటి ఇవ్వు అక్కా' అని డబ్బులిచ్చినాడు. వెంటనే సహదేవమ్మ చీర కొంగుతో ముక్కు మూసి పెట్టుకుని సిగరెట్టు, మిగిలిన చిల్లరతో పాటు అరటిపండు ఒకటి ఇచ్చింది. ఇస్తూ ఇస్తూ–

"పొగ తాగి పాడై పోకు

పండు తిని పండులా ఉండు" అని చెప్పింది.

అమె వైపు ఆశ్చర్యంగా చూసి 'దాని అర్థమేమి అక్కా' అని అడిగినాడు.

"నోట్లోకి నాలుగేళ్లు పోయేదానికి అంగడి పెట్టుకుని ఉండా. అయితే సిగరెట్టు తాగెటోళ్లంటే నాకు నచ్చదు. డబ్బిచ్చి రోగాల్ని కొనుక్కుంటారని నా నమ్మకం. మాది చిన్న అంగడి అయినా మన ఊర్లో వాళ్ళకి కావాల్సిన వస్తువులన్నీ దొరుకుతాయి. బీడీ సిగరెట్టు అమ్మకూడదని అనుకుంటాను కానీ అన్ని వస్తువులూ దొరికి అవి అమ్మకపోతే మగవాళ్లు ఇబ్బంది పడతారని అమ్ముతున్నాను. అంతే కాదు, లోపల్లోపల సిగరెట్లు అమ్మకపోతే అంగడి జరగక మూసుకోవాల్సి వస్తుందేమోనని కూడా నాలో భయముంది. వ్యాపారం లేకపోతే ఇద్దరు బిడ్డల్ని ఎట్ల చాకగలను? అందుకే అవి కొనే వారందరికీ తాగవద్దని చెప్పి చూశాను. లాభం లేకుండా పోయింది. ఒక చెవితో విని ఇంకొక చెవితో వదిలేసేవాళ్ళు. కొన్నాళ్ళు ఎవరు బీడీ సిగరెట్టులకొచ్చినా, పొగ తాగుతూ కనిపించినా చేతులెత్తి దణ్ణం పెట్టేదాన్ని. నన్ను తిక్కలదాన్ని చూసినట్లు చూసి వెళ్లిపోయేవాళ్లు. నేను నీతి సూత్రాలు చెబుతున్నానని నా అంగడికి రాకుండా వేరే చోట కొనుక్కునే వాళ్ళు. వ్యాపారం దెబ్బ తినింది. ఇది అయ్యేపని కాదని, వచ్చినవాళ్ళకి అడిగిన సిగరెట్టు ఇస్తున్నాను. అయితే సిగరెట్టుతో పాటు ఒక పండో, ఒక బిస్కెట్టో, ఒక చాక్లెట్టో చేతిలో పెడుతున్నాను. కనీసం నేను ఇచ్చిన పండు, బిస్కెట్, చాక్లెట్ చేతిలో ఉన్నంత సేపైనా వారికి నా మాటలు గుర్తు ఉంటాయని అలా చేస్తున్నా. తాగేవాళ్ళకి మానేయమని చెప్పడం చూసి ఇక్కడికి వచ్చిన అమ్మలక్కలు నవ్వుకుంటారు. ఏమో, నాకు చెప్పాలనిపిస్తుంది, చెబుతున్నా. నూటికో కోటికో ఒక్కరిలోనైనా మార్పు రాకుండా పోతుందా" అని బాధగా చెప్పింది.

"అవునక్కా, ఊర్లో అందరూ కనబడతా వుండారు.. మన వేలాయుధమన్న ఎక్కడా కనబడలేదే" అని అడిగినాడు.

'ఓ' అని ఏడుస్తూ సహదేవమ్మ దబీమని కింద కూర్చుంది.

"ఏమని చెప్పేది ధర్మా.. సిగరెట్టు కాలిస్తే తిడతానని నాకు తెలియకుండా కయ్యి కాడికి పోయి కాల్చేవాడు. నాకు తెలియకుండా పిలకాయల దగ్గర డబ్బులిచ్చి అంగడికి పంపించి సిగరెట్టు తీసుకుపోయే వాడంట. మల్ల తెలిసింది" అని చెబుతూ దగ్గు వచ్చి కొంచెం సేపు ఆపింది.

ఆమె మాటలు విన్న ధర్మడి చేతులు చిన్నగా వణికాయి. గొంతు పొరపోయింది. తమాయించుకుని నిలబడి కనుగుడ్లు పెద్దవి చేసి ఆమె చెప్పేది వినసాగాడు.

"అట్లా రోజుకు ఒకటి, రెండు కాల్చేవాడు. ప్యాకెట్లకు ప్యాకెట్లు కాల్చడం మొదలుబెట్టినాడు. ఎవరు చెప్పినా వినలేదు. సిగరెట్టు కాల్చడం ఎందుకు, మనల్ని మనం కాల్చుకోవడం ఎందుకు అని కాళ్ళా వేళ్ళా పడ్డా పట్టించుకోలేదు. ఇంటిల్లిపాదీ ఏడ్చి మొత్తుకున్నా మనిషి మారలేదు. మీరు లేకపోయినా ఫర్లేదు, సిగరెట్టు లేకుండా బతకలేను అన్నట్టుగా తయారయినాడు. రోజురోజుకీ మనిషి సన్నమైనాడు. రాత్రుల్లో జ్వరం వచ్చేది, దగ్గంటే దగ్గు కాదు. ఖళ్ ఖళ్‌మని దగ్గేవాడు. మా ఇంట్లో దగ్గితే ఊరి రచ్చబండ కాడికి వినబడేది.

ఎందుకైనా మంచిదని పెద్ద డాక్టరు దగ్గరికి పోయినాము. రక్త పరీక్షలు చేసి క్షయ జబ్బు వచ్చిందని చెప్పినారు. వేలకు



## నా పల్లె...!

- డాక్టర్ ఎం నాగేంద్ర
94901 88263

ఇప్పుడు నా పల్లె
పట్నం వలె నాజూకుగా తయారైంది
మాటలన్నీ పొడిపొడిగా రాలుస్తూ
నవ్వులన్నీ కఆత్రిమంగా కురిపిస్తూ
బంధాలన్నింటినీ తెగదెంపులు చేసుకుని
కాలు తెగిన ఒంటెలా ఉంది నా పల్లె

ఆత్మీయతలను తుడిపేసుకుని
వాడిపోయిన వసంతంలా
అమావాస్య చంద్రునిలా ఉంది నా పల్లె

బతుకు చిత్రాన్ని
ప్రపంచీకరణకు తాకట్టు పెట్టి
పుస్తెలు అమ్ముకొని
వలవలా ఏడుస్తున్న
చిట్లిపోయిన
మా అనంత రైతు మొహంలా ఉంది నా పల్లె!

పంటలన్నీ హాలిడే తీసుకొని
చేతి వృత్తులన్నీ
ఒళ్ళు హూనం చేసుకుని ఏడుస్తుంటే
గత స్మృతులను ఒంటికి పూసుకుని
ఆర్తనాదం చేస్తున్న
రైతు ఆక్రందనలా ఉంది నా పల్లె

ప్రపంచీకరణ గద్ద
కార్పొరేట్ విధులు నిర్వర్తిస్తూ
పల్లెను తన కబంధ హస్తాలతో బంధిస్తే
అస్తిత్వాన్ని కోల్పోయిన పల్లె
దిక్కు లేని పక్షి గా
ఎండిన కొమ్మ పై
దిగులుగా... దీనంగా ఎదురుచూస్తోంది..!

---

వేలు పోసి మందుమాత్రలు ఇచ్చినాము. చివరికి మదనపల్లె ఆరోగ్యవరం టీబీ హాస్పిటల్ పోతే బాగవుతుందని మూడునెలలు అంగడి మూసేసి వెళ్ళినాము. చివర్లో రక్త వాంతులు చేసినాడు. బతికించాలని ప్రయత్నాలు చేసిన డాక్టర్లు చేతులెత్తేసినారు. చివరికి బూడిదై పోయినాడు. నా మొగుడు లాగా సిగరెట్లు తాగి తాగి ఎవ్వరూ బూడిదై పోకూడదని నా కోరిక ధర్మా! ఇంట్లో పెళ్లాం మాట వినకుండా తాగితాగి మొగుడు చస్తే ఆ ఆడదానికి పల్లెల్లో ఏమి విలువ ఉంటుంది. ఏదో బతకాలి కాబట్టి బతకతా ఉండాము. గుండెలు బండ చేసుకుని బతకతా ఉండాము" అని తల కొట్టుకుంటూ ఏడ్చింది.

ధర్మడు చేతిలోకి తీసుకున్న సిగరెట్టును అలాగే నేలమీద వేసి చెప్పుకాలుతో గట్టిగా కసకసా తొక్కుతూ తల ఎత్తి పైకిచూశాడు. అంగడిగోడపైన పూలమాల వేసి ఉన్న వేలాయుధం ఫొటో కనిపించింది. 'నీకు పుణ్యముంటాది, సిగరెట్టు తాగొద్దు ధర్మా' అని వేడుకున్నట్లుగా ఉంది వేలాయుధం ముఖం. అతడికి తెలియకుండానే కన్నీళ్లు జలజలా రాలాయి. ఫొటో ముందర పెట్టిన దీపం పొగ రింగురింగులుగా తిరుగుతోంది.

# మరణ మృదంగం

- ఝాన్సీ కె వి కుమారి

90108 23014

మరణ మృదంగాన్ని
మోగిస్తూ వచ్చింది కరోనా
అవురావురుమంటూ
అవనిని ముంచెత్తింది
మనిషంటే మనిషే ఝడిసి చచ్చేంత
భయాన్ని లోకం మీదికి వదిలింది
బంధాలన్నీ భయభ్రాంతులయ్యాయి
దగ్గో.. తుమ్మో.. చెవులను సోకిందా
మృత్యువు ఇనుప పాదాలు
గుండెల పైనే నర్తించిన దడ
ఇక ప్రాణాలు గాల్లోకే పయనం!

నువ్వొచ్చేంతవరకూ
నాకు చచ్చేంత వణుకెందుకు?
నేనే పరుగులంఘించి
నీ మెడలో నా ప్రాణదండ వేసేస్తా
మనిషి క్రూరత్వం ముందు
కరోనా చిన్నబోయింది
మానవ అవయవాల దొంగ వ్యాపారానికి
మ్రాన్పడిపోయింది
మనిషిని మించిన మహమ్మారి తెగులు
లోకంలో లేనే లేదని ఢంకా భజాయించింది

'ప్రాణాలను తీయడం నా పనే అయినా ..
మానవ జాతికి హెచ్చరికవే' అన్న
ప్రకృతి ఆజ్ఞకు శిరస్సు వంచానుగానీ
మృత్యుఘోష నినదించే కాలంలో సైతం
ముక్కు పచ్చలారని అబలల, బాలికల
మాన ప్రాణాలను అమానుషంగా చిదిమేసే
మానవాధములను శిక్షించని సమాజం
కాదు క్షంతవ్యం
పాతాళ అగ్నిగుండాన్ని లక్ష రెట్లు పెంచి
ఆరని అగ్నిలో నిరంతరం మండే
ఆత్మల హాహాకారాలు ముల్లోకాల్లోని నీచులకు
కావాలి కనువిప్పు
భూదిగంతాల్లో ప్రతిధ్వనిస్తున్నది
కరోనా తీర్పు ...!



తమ ప్రాణాలు ధారపోసి మరీ
తమ పిల్లల్ని కాపాడుకునే అమ్మానాన్నలు తెలుసు
పెళ్ళీడొచ్చిన ఆడపిల్లల్ని
గొప్పగా చదివిన బంగారు తల్లుల్ని తాకేందుకు
నేనే ఝడిసి చస్తానే
మతాంధులు .. కన్నవాళ్ళైతేనేం
విద్యావేత్తలనబడితేనేం
కడుపున పుట్టిన వాళ్ళనేం
శవాల్ని చేసినవాళ్ళు
ఎందరు అక్షరార్థులను
మతమూర్ఖాధములుగా
దేశంలోకి ఎగదోశారో
మతోన్మాద మహమ్మారి ముందు
నేనే వెలవెలబోయానే అని
చిన్న బోయింది కరోనా ..

# అనిశ్చిత పర్వంలో రాజకీయాలు



- తెలకపల్లి రవి

ఒకవైపున మలి విడత కరోనా మరణాల తాకిడి తగ్గిందని వార్తలు... మరోవైపు మూడో విడతపై భయసందేహాల మధ్య కేంద్రం, వివిధ రాష్ట్ర ప్రభుత్వాలు విమర్శలు ఎదుర్కొంటున్నాయి. ఆర్థిక పరిస్థితులు, ప్రజల జీవనగతులు తలకిందులయ్యాయి. ధరల పెరుగుదలకు తోడు ప్రభుత్వాల ఉపేక్ష ప్రజల పాలిట పెనుశాపంగా మారింది. మరోవైపున ఈ దెబ్బతో రాజకీయ వ్యవస్థ కూడా కల్లోలితమవుతున్నది. నిరంతర ప్రవచనాలతో ప్రచారాలతో ప్రజలను ఆకట్టుకోవడానికి ప్రయత్నించే ప్రధాని నరేంద్ర మోడీ ప్రజాదరణ తగ్గినట్టు ఎప్పటికప్పుడు సర్వేలు, ఎన్నికలు కూడా విదితం చేస్తున్నాయి. నష్ట నివారణ చర్యలతో ప్రతిష్టను కాపాడుకోవడానికి ఆయనతో పాటు ఆడించే ఆర్ఎస్ఎస్ కూడా నానా పాట్లు పడుతున్నది. అదే సమయంలో దాదాపు అన్ని రాష్ట్రాల్లోనూ ప్రభుత్వాలు, పాలక పార్టీలు ప్రజల విశ్వాసం నిలబెట్టుకోవడానికి... ఎన్నికలు వచ్చే చోట్ల మళ్లీ బతికి బట్టకట్టడానికి తలకిందులవుతున్నాయి. విజయాలు సాధించిన వారికీ ప్రతిబంధకాలు తప్పడం లేదు. ఢిల్లీ నుంచి గల్లీ దాకా ప్రతి చోటా దర్శనమిస్తున్న సత్యమిది. తమకు ఎదురు లేదని విర్రవీగిన నేతలు, పార్టీలు, అవకాశవాద విన్యాసాలతో అడుగుజారిన నేతలు రకరకాల రాజకీయ వైరుధ్యాలలో ఉక్కిరిబిక్కిరి అవుతున్నారు.

### కేంద్రం, బిజెపి రాష్ట్ర ప్రభుత్వాలు

మూలవిరాట్టు తోనే మొదలుపెడితే బ్రాండ్ మోడీ 'బ్యాడ్ మోడీ'గా మారినట్టు చాలాసార్లు రుజువైంది. ఆయన ఆమోద యోగ్యత గతంలో ఎన్నడూ లేనంత దిగువకు పడిపోయినట్టు కూడా సర్వే సంస్థలు వెల్లడించాయి. దాన్ని ఏమీ చేయలేక అటు నుంచి నరుక్కు వచ్చే ఎత్తుగడ చేపట్టారు. తగ్గిపోయిన తన ఆదరణతో పోల్చి చెప్పే బదులు ఇప్పుడు ఇతర దేశాల నాయకులతో పోల్చి ఆయనకే ఎక్కువ రేటింగ్ అని ఊదరగొట్టడం మొదలెట్టారు. ఈ కారణంగానే మోడీ రెండేళ్లుగా వాయిదా వేస్తున్న కేంద్ర మంత్రివర్గ విస్తరణ చేసి కొత్త మొహాలను చేర్చుకోవడంతోనైనా ఇమేజి కాపాడుకోవాలని నిర్ణయించుకున్నారు. అది కూడా ఎవరిని తీసుకోవాలో ఎవరిని వదిలించుకుంటే ఏమవుతుందో తేల్చుకోలేక ఎడతెగని మంతనాలు జరుపుతున్నారు. గతంలో గొప్పగా చెప్పిన చాలా పేర్లు ఇప్పుడు అసలు వినిపించడం లేదు. అకాలీదళ్ నిష్క్రమణతో పంజాబ్‌లో ఒంటరిపాటు మిగిలింది. చిరాగ్ పాశ్వాన్ లోక్‌జనశక్తి పార్టీలోనూ తిరుగుబాటు పేరుతో చీలిక తీసుకొచ్చారు. బీహార్ ఎన్నికల్లో ఒంటరిగా పోటీ చేసినా తమకు నితీశ్ కుమార్‌పై తప్ప మోడీపై వ్యతిరేకత లేదని, తాను ఆయనకు హనుమాన్ వంటి వాడినని చిరాగ్ ఎన్నిసార్లు చెప్పినా ఫలితం లేకపోయింది. జెడియు హస్తం ప్రధానమైనా బిజెపి ఆశీస్సులు కూడా ఈ పరిణామం వెనక ఉన్నాయని స్పష్టమైంది. మిత్రపార్టీలుగా వున్న వాటిని చీల్చడంతో బిజెపిపై వాటి విశ్వాసం మరింత సన్నగిల్లే పరిస్థితి.

బిజెపి పాలించే అతి పెద్ద రాష్ట్రమైన యు.పి 2022లో ఎన్నికలకు వెళ్లవలసి వుండగా... యోగి ప్రభుత్వం పరిస్థితి చుక్కెదురుగా వుంది. కరోనా వైఫల్యం, మతతత్వ వివాదాలు, దళితులపై దాడులు, స్థానిక ఎన్నికల్లో ఓటమి వంటివి వెంటాడుతున్నాయి. అయోధ్య రామమందిరం కోసం స్థలం కొనుగోలులోనూ రూ.18 కోట్ల అవినీతి కుంభకోణం పరువు తీసింది. బిజెపి అంతర్గత కలహాలు ఇందుకు తోడై పాలన స్తంభించిపోయింది. మోడీ శిష్యుడైన అరవింద్ కుమార్ శర్మను మొదట ఎంఎల్‌సిగా పంపించి ఇప్పుడు మంత్రివర్గంలోకి తీసుకోమని ఒత్తిడి పెడితే అది తనపై నిఘాగా భావించిన

యోగి వ్యతిరేకించారు. ఆర్ఎస్ఎస్, బిజెపి కేంద్ర నాయకులను పరిశీలకులుగా పంపించి ఆయనను దారికి తెచ్చారు. ఢిల్లీలో మోడీ, షాలతో చర్చలు జరిపిన యోగి ఇప్పుడు మంత్రివర్గ విస్తరణకు ఒప్పుకున్నట్టు చెబుతున్నారు. దక్షిణాదిలో బిజెపికి వున్న ఒకే రాష్ట్రం కర్ణాటకలో యెడ్యూరప్ప పరిస్థితీ అంతే అయింది. కరోనా ఒకవైపు, మత వివాదాలు మరోవైపు సాగుతుండగా యెడ్యూరప్పపై బిజెపిలోనే తిరుగుబాటు బయలుదేరింది. ఆయనను మారుస్తారనీ, మార్చరని భిన్న కథనాలు చెలరేగాయి. మార్చే ధైర్యం చేయలేని బిజెపి అధిష్టానం చివరకు రాష్ట్ర బాధ్యుడైన అరుణ్‌సింగ్ ద్వారా ఆయనే కొనసాగుతారని చెప్పించింది. అయితే బాహాటంగా అసమ్మతి కొనసాగుతున్నందున అక్కడ ప్రశాంతత నెలకొనే అవకాశమే లేదు. పశ్చిమ బెంగాల్‌లో ఎన్నికల ముందు ఉధృతంగా తృణమూల్ కాంగ్రెస్ వారిని చేర్చుకుని టికెట్టు ఇవ్వగా ఇప్పుడు రివర్స్ ఫిరాయింపులతో వారు వెనక్కు వెళ్లడం తలవంపుల పరిస్థితిని సృష్టించింది. రాజస్థాన్‌లో మాజీ ముఖ్యమంత్రి వసుంధరా రాజే వర్గం మళ్లీ కుంపటి రాజేస్తున్నది. ఎంతో చిన్నదైన లక్షద్వీప్‌లో కూడా బిజెపి విధానం ప్రతిఘటన పాలైంది. ఎ.పిలో ఆలయాల వివాదం పనిచేయక ఇప్పుడు టిప్పు సుల్తాన్‌ను పట్టుకున్నారు. తెలంగాణలో ఈటెల రాజేందర్‌ను చేర్చుకోవడానికి చూపిన హడావుడి బిజెపి పరిస్థితికి ఒక ప్రతిబింబంగా తయారైంది. కేరళలో కేంద్ర ఏజన్సీలతో ఎల్‌డిఎఫ్ ప్రభుత్వాన్ని ఏదో చేయాలనుకుంటే ఇప్పుడు బిజెపి రాష్ట్ర అధ్యక్షుడు సుదీంద్రన్ అవినీతి ఆరోపణల్లో చిక్కారు.

మోడీ రెండోసారి రాగానే కుట్రపూరితంగా జమ్మూ కాశ్మీర్‌ని విభజించారు. రాష్ట్ర ప్రతిపత్తి తగ్గించి హక్కులు హరించేశారు. ప్రతిపక్ష నేతలందరినీ నిర్బంధంలో వుంచారు. మీడియా స్వేచ్ఛకు సంకెళ్లు వేశారు. ఇంతచేసినా అక్కడ పరిస్థితి అదుపులోకి రాకపోగా ప్రధాన రాజకీయ శక్తులు 'గుప్కార్ అలయన్స్'గా ఏర్పడి కేంద్రాన్ని నిలదీశాయి. రెండేళ్లలో అనుకున్నట్టు అదుపు సాధించలేకపోయిన కేంద్రం కాశ్మీర్‌పై అఖిలపక్షం జరపాల్సి వచ్చింది. రాష్ట్రహోదా పునరుద్ధరణ, ప్రజాస్వామ్యం గురించి అక్కడి ప్రతిపక్షాలు కోరుతుంటే కేంద్రంలోని బిజెపి నాయకత్వం మాత్రం నియోజకవర్గాల పునర్విభజన చేసి ఎన్నికలు జరిపించేయాలనే హడావుడిలో వుంది. ఇప్పుడు కాశ్మీర్‌లో 46, జమ్మూలో 37 స్థానాలు వున్నాయి. పునర్విభజనతో జమ్మూలో మరో ఏడు పెరిగితే తమకు ప్రయోజనమని బిజెపి ఉద్దేశంగా ఉంది. సిఎఎను అయిదు రాష్ట్రాల్లో అమలు చేయడానికి కేంద్రం పరోక్ష పద్ధతిలో ఆదేశాలిస్తే సుప్రీం కోర్టులో ఆక్షేపణ ఎదురైంది. దాంతో ఈ ఉత్తర్వులకు దానికి సంబంధం లేదని సాకులు చెప్పాల్సి వచ్చింది. సిఎఎ వ్యతిరేక ఆందోళనలో అరెస్టయిన విద్యార్థి నాయకులను కూడా ఢిల్లీ హైకోర్టు విడుదల చేస్తే అందుకు వ్యతిరేకంగా కేంద్రం సుప్రీం కోర్టుకు వెళ్లింది.

భావ ప్రకటనా స్వేచ్ఛ పైన, మత స్వేచ్ఛపైన మోడీ ప్రభుత్వం దాడి చేస్తున్నదనే విమర్శ అంతర్జాతీయంగా కూడా కొనసాగుతూనే వుంది. ఇటీవలనే జి7 దేశాల సమావేశం సందర్భంగా మాట్లాడిన మోడీ సోషల్ మీడియా సంస్థల అదుపు అవసరాన్ని చెప్పడం యాదృచ్ఛికం కాదు. బడా మీడియాను ఎంతగా అదుపు చేసినా సోషల్ మీడియాలో కేంద్రం పోకడలపై విమర్శలు పెరగడం మింగుడుపడటం లేదు. రాబోయే రోజుల్లో ఈ దాడి పెరిగినా ఆశ్చర్యపోనవసరం లేదు.

**కోలుకోలేని కాంగ్రెస్**

బిజెపి సంగతి ఇలా వుంటే కాంగ్రెస్ కూడా ఎంతకూ కోలుకోలేకపోతున్నది. ఆ పార్టీ ముఖ్య నాయకులైన జితిన్ ప్రసాద్ వంటి వారు బిజెపిలో చేరడం, రాజస్థాన్‌లో సచిన్ పైలెట్ కేంద్రంగా అసమ్మతి పునరావృతం కావడం, పంజాబ్ ముఖ్యమంత్రి అమరీందర్‌పై నవజోత్ సిద్ధు తదితరుల తిరుగుబాటు వంటివి ఎడతెగని సమస్యలుగా మారాయి. జితిన్ ప్రసాద్ నిష్క్రమణ తర్వాత జి23 లేఖ రాసిన వారు మరోసారి గొంతు విప్పారు. పార్టీ పునరుజ్జీవంపై సోనియా, రాహుల్ నాయకత్వం తగు వ్యూహం తీసుకోలేక పోతున్నదనే విమర్శలు విజృంభించాయి. తెలంగాణ పిసిసి అధ్యక్షుడిగా రేవంత్ రెడ్డిని నియమించటం ఒక పరిణామం కాగా, వెంకటరెడ్డి వంటివారు ఆ వెంటనే నిరసన స్వరం వినిపించటం కొత్త సమస్య. మొన్ననే ఓడిపోయిన కేరళలోనూ పిసిసి అధ్యక్షుడు శాసనసభా నాయకుడి నిర్ణయం వివాదమైంది. మహారాష్ట్ర ఎంవిఎ కూటమిలో శివసేన, ఎన్‌సిపిలు కలసి వ్యవహరిస్తుంటే కాంగ్రెస్ ఒంటరి పాటుకు గురైంది. ఒక జాతీయ రాజకీయ శక్తిగా తన స్థానాన్ని వేగంగా బలహీన పర్చుకుంటున్నదనే అంచనాలు పెరుగుతున్నాయి.

**ప్రాంతీయ పార్టీలు తీరు**

అధికారంలో వున్న, లేని ఇతర ప్రాంతీయ పార్టీలు ఏమంత మెరుగ్గా లేవు. యుపిలో బిజెపి అంత ఇబ్బందిలో వుండగా ఎస్‌పి, బిఎస్‌పి కీచులాటలే కొనసాగుతున్నాయి. బిఎస్‌పి 19 మంది ఎంఎల్‌ఎలలో ఏడుగురు మాత్రమే దానితో మిగిలారు. కొందరు ఎస్‌పితో చేరారు. బిజెపిని ఎదుర్కోవడంలో ఈ రెండు పార్టీలూ ఎలా వ్యవహరిస్తాయనేది ఇంకా అస్పష్టం. ఎస్‌పి నేత అఖిలేష్‌పై దాడి కేంద్రీకరించిన బిఎస్‌పి అధినేత్రి మాయావతి పంజాబ్‌లో అకాలీదళ్‌తో అవగాహన కుదుర్చుకున్నారు.

రాజస్థాన్‌లో కాంగ్రెస్‌కు మద్దతు కొనసాగింపుపై బేరసారాలు సాగుతున్నాయి. పంజాబ్, మధ్యప్రదేశ్ వంటి చోట్ల కూడా బిఎస్‌పి గతంలో వున్న పట్టు కోల్పోయిందని ఎన్నికల వివరాలు చెబుతున్నాయి. బీహార్‌లో మూడో స్థానానికి పడిపోయి ముఖ్యమంత్రి పదవి పొందిన నితీశ్ బిజెపి పై పరోక్ష విమర్శలు చేస్తూనే తమ బలం పెంచుకోవడానికి కాంగ్రెస్ వారిపై వల వేస్తున్నారు. చాలాకాలం తర్వాత లాలూ ప్రసాద్ యాదవ్ జైలు నుంచి బెయిలుపై విడుదలైనారు. బెంగాల్‌లో తాజాగా మూడోసారి ఘన విజయం సాధించిన మమతా బెనర్జీ శాంతి భద్రతల వైఫల్యంపై విమర్శలు ఎదుర్కోవడంతో పాటు కేంద్రంతో ఘర్షణ కొనసాగిస్తున్నారు. తాను గతంలో పోషించిన పాత్రను మానేస్తున్నట్టు చెప్పిన ప్రశాంత్ కిశోర్ (పి.కె) 'ఐ క్యాప్' టీమ్‌తో మమత మళ్లీ కాంట్రాక్టు కుదుర్చుకున్నారు. జాతీయ స్థాయిలో బిజెపి వ్యతిరేక కూటమికి ఆమె నాయకులుగా వుంటారనే ప్రచారం సాగుతున్నా బలపర్చినవారు దాదాపు లేరు. ఈ పూర్వ రంగంలో ప్రశాంత్ కిశోర్ ఎన్‌సిపి కురువృద్ధుడు శరద్‌పవార్‌తో సమావేశం కావడం ప్రత్యామ్నాయ వేదికకు పునాది అని మరో ప్రచారం వినిపించింది. అసలు పి.కె నే ప్రధాని మోడీకి సరైన ... అని కూడా కథలు వినిపిస్తున్నాయి. ఒక ప్రచార వాణిజ్య మార్కెట్ సంస్థ దేశ రాజకీయాల్లో ప్రత్యామ్నాయాన్ని చూపిస్తుందనే కథనం వామపక్షేతర రాజకీయ పార్టీల దురవస్థను చెబుతుంది. గతంలో ప్రాంతీయ పార్టీల పోకడలను గమనించిన వారెవరైనా ఇంత తేలిగ్గా వాటి గురించి జోస్యాలు చెప్పరు. గతంలో రెండు మూడుసార్లు కూడా ఎన్నికల అనంతరమే రాజకీయ కూటములు ఏర్పడి కేంద్రంలో అధికారం చేపట్టాయి గాని మూడేళ్ల ముందే ఏర్పడిన దాఖలాలు లేవు. ఏర్పడినవి నిలబడిందీ లేదు. ఒక్కరోజులో యునైటెడ్ ఫ్రంట్ కన్వీనర్ నుంచి ఎన్‌డిఎ సంధానకర్తగా మారిన టిడిపి అధినేత చంద్రబాబు వంటి వారి ఉదాహరణలున్నాయి. ఇప్పుడూ ఆయన అడగకుండానే కేంద్రానికి మద్దతు ప్రకటించారు. రాష్ట్రాలలో తమకు తిరుగులేదని భావించే నవీన్ పట్నాయక్, జగన్, కెసిఆర్ వంటివారు బిజెపితో పోరాడటానికి సిద్ధంగా లేరు. తమిళనాడు ముఖ్యమంత్రి స్టాలిన్ మాత్రం రాష్ట్రాల తరపున గట్టిగా మాట్లాడుతున్నారు. ఈ మధ్య వ్యాక్సిన్‌పై కేరళ ముఖ్యమంత్రి పినరయి విజయన్ లేఖ రాయడం... తర్వాత నవీన్, జగన్ కూడా తమ పద్ధతిలో స్పందించడం కేంద్రం దిగిరావలసిన పరిస్థితిని సృష్టించింది. బిజెపి అందులోనూ మోడీ నాయకత్వం తన మౌలిక విధానాలు మార్చుకునేది

## భయపడి పారిపోకు



పరిస్థితులు ఎలా ఉన్నా  
ప్రవృత్తిని వదులుకోకు నేస్తం  
పరిధిలో ఉన్నంత కాలం  
పరిస్థితి మన చేయిదాటిపోదు

పరిశీలనగా చూడు  
పరిష్కారం దొరుకుతుంది  
ప్రశ్న నీకు అర్థమయితే  
సమాధానం అక్కడే ఉంటుంది!

ప్రతికూల శక్తులు  
ప్రతిచోటా కాపు కాసుకునే ఉంటాయి  
పారిపోవాలని చూడకు  
ప్రయత్నంతో గెలువు...

పరిగెత్తకు వాటికి భయపడి  
ఎదిరించు వాటిని ఢీకొని...  
ప్రతిఫలం నీ విజయమే అవుతుంది  
ప్రయత్నం ఆపకు పారిపోకు... పోరాడు...

**- సునీత పేరిచర్ల**

**83094 20900**

వుండదు గనక మరింతగా అడుగు జారడం అనివార్యం. ఎన్నికల ముచ్చట అవి వచ్చినప్పుడే! ఈలోగా రాష్ట్రాల హక్కుల కోసం, ప్రజాశ్రేయస్సు కోసం ఉమ్మడిగా పోరాడితేనే కేంద్రం దిగి వస్తుంది తప్ప ఎవరికివారు తమ అవకాశ వాదాలలో కూరుకుపోతే తీరం చేరడం కుదిరేపని కాదు. వామపక్షాల ఆధ్వర్యంలో ఇప్పుడు దేశవ్యాపితంగా సాగుతున్న నిరసనోద్యమం, రైతాంగ ఉమ్మడి పోరాటం వంటివి అందుకు దారి చూపిస్తాయి. ■

## కవిత

- మార్ని జానకిరామ చౌదరి
94403 38303

# మాయమైపోతున్న మనిషి



అక్కడ రోజూలానే చెట్టుంది
చెట్టు మీద పిట్టా
పిట్ట పాడే పాటా ఉంది
కానీ.. నిన్న కనిపించిన మనిషి మాత్రం
నేడు మాయమైపోతున్నాడు
గాలి కరువై.. గాలిలో కలిసిపోతున్నాడు!

ప్రళయకాల ఝంఝూమారుతానికి
పచ్చికొమ్మల్లా రాలిపోతుంటే...
పాలకులంతా రాలుతున్న ఒక్కో ఓటు
ఏ పార్టీదో లెక్కలేసుకుంటున్నారు
దేశమంటే మట్టి కాదోయ్
దేశమంటే శవాల దిబ్బలోయ్ అంటూ
కొత్త గేయం పాడుతున్నారు!

స్వార్థంతో నిండిన మనో కాలుష్యం
నీడనిచ్చిన కొమ్మనే కాదు
బతుకునిచ్చిన చెట్టునే తెగనరుకుతుంటే
ప్రకృతి ప్రకోపించక పోతుందా?
కనపడని పురుగు
కబళించక మానుతుందా?

గుక్కెడు నీళ్ళతో తీరే దాహానికి
నీటి యుద్ధాలకు తెరలేపి
నదీగర్భాల్లో కాళీయుడి పడగలై
కాలకూటాన్ని చిమ్ముతున్నారు
ఐదేళ్ళ పాలన కోసమో
ఆరడుగుల జాగా కోసమో
ఈ నేలంతా నాది నాదంటూ
హిరణ్యాక్షులై చాప చుట్టేస్తున్నారు

పంచభూతాలనే ముడిసరుకును చేసి
గాలికీ, నీటికీ ఖరీదు కట్టి
నల్లబజారులో అమ్మకానికి పెడితే
ప్రకృతి చూస్తూ ఊరుకోదు
పీల్చిన శ్వాసలకు లెక్కలడుగుతోంది
ఊళ్ళకు ఊళ్ళనే ఖాళీ చేస్తోంది...

కుంభమేళాల గేట్లెత్తితే...
గంగానదిలో తేలుతున్న శవాల్లా
ఊపిర్లను మూతిగుడ్డల్లో చుట్టి
రోడ్లమీద జనం పోటెత్తుతున్నారు
మృత్యు కన్యక విహారం చేస్తున్న వీధుల్లో
లాక్డౌన్‌లన్నీ లక్ష్మణరేఖలై చెరిగిపోతుంటే
మనుషులు వలస పిట్టల్లా రాలిపోతున్నారు

ప్రాణవాయువు ముక్కుకొసల చేరకముందే
దవాఖానాలన్నీ నోట్ల వాసన కొడుతూ
ఆక్సిజన్ సిలిండర్లు గాలికి బదులుగా
నెత్తుటి కాసులతో నిండుతున్నాయ్
ఏటీఎంల దగ్గర మొదలైన క్యూలు
మరుభూములు దాకా సాగుతున్నాయి

ఆరని చితి మంటల వెలుగుల్లో
నా దేశం వెలిగిపోతోందంటూ
ఫిడేలు రాగాల నాయకులు
పిడికెడు గుండె ధైర్యాన్నివ్వటం మాని
మొసలి కన్నీళ్ళు కారుస్తూ
యోగనిద్రలో జోగుతున్నారు!






# మనసు చెమ్మగిల్లే మానవీయ కథలు

- బి.మహేష్

89852 02723

**సా**టి మనిషి బతుకు ఎదుటివారికి కథగానే కనిపిస్తుంది. ప్రతి మనిషి జీవితంలో కష్టాలు కన్నీళ్లు సాధారణ విషయమే అయినా ఎవరి జీవితాలు వారికి బరువైనవే. కొందరి జీవితాల్లో సంతోషాలు, ఆనందాలున్న తాత్కాలికమైనవి. ఎవరి జీవితాలు వారు జీవిస్తున్నా, కొందరి జీవితాలను కొందరూ వ్యక్తులు అజమాయిషీ చేస్తూ ఉంటారు. వారే పీడిత వర్గాలుగా, బలహీన వర్గాలుగా చిత్రీకరించబడతారు. అస్తిత్వాన్ని కోల్పోయిన జీవితాలుంటాయి. మోసగించబడ్డ, అధికారం చేత అణచబడ్డ జీవితాలుంటాయి. వీటిని స్వయంగా అనుభవించిన వారు కొందరైతే, వాటిని ఎదుర్కొనటానికి, ఆ వర్గాలను మేల్కొల్పడానికి కొన్ని కలాలు, గళాలు నిరంతరం వారి వెంటనే పయనిస్తాయి. బడుగు వర్గాల అభ్యున్నతి, మార్పు, చైతన్యం కోసం కృషి చేసే కవులు, రచయితలున్నారు. అలాంటి వ్యక్తుల్లో డాక్టర్ జడా సుబ్బారావు గారొకరు. వీరు తన కలంతో సమాజంలో ఎప్పటికప్పుడు జరిగే మోసాలను, అన్యాయాలను కవిగా, కథా రచయితగా కొత్త విషయాలను సాహిత్య సేవ ద్వారా వెల్లడిస్తూనే ఉన్నారు. వీరు ఇప్పటివరకూ "ఆకుపచ్చని కన్నీళ్లు", "తలరాతలు" కథాసంపుటాలు, "గడియారం బతుకులు" కవిత్వ సంపుటి, "వ్యాస లోహిత" అనే ప్రాచీన సాహిత్య పరిశోధన వ్యాస సంపుటి వెలువరించారు.

"తలరాతలు" కథా సంపుటికి వేదగిరి రాంబాబు పురస్కారం లభించింది. వివిధ పత్రికల్లో నేటికీ వీరి కథలు ప్రచురితమవుతున్నాయి. ఈయన రాసిన పాటలు, ఉపన్యాసాలు వివిధ సందర్భాల్లో ఆకాశవాణిలో ప్రసారమయ్యాయి. జీవన పోరాటంలో కొందరి బతుకులు నిత్యం ఒక పూట గడవడానికి కూడా ఇబ్బందులు ఎదుర్కొనే కుటుంబాలున్నాయి. 'తెగిన గాలిపటం' కథలో కుటుంబం మొత్తం ఆటలాడితే గాని పూట గడవని సంచార జీవనం సాగించే యాదయ్య కుటుంబానిది. బతుకు తెరువు కోసం విన్యాసాలు చేయాలి. బడికెళ్ళాలని ఉన్నా, రోజుకొక ఊరికి తిరిగి పొట్ట పోసుకొని జీవించే కుటుంబం కాబట్టి బడికి వెళ్లలేని కొడుకు డప్పు కొట్టే రాజా. తన తోటి పిల్లలతో ఆటలాడుకునే వయసులోనే బతుకు ఆట ఆడుతున్న లచ్చి. పిల్లలను కష్టపెడుతున్నానే బాధతో, కన్నీళ్లు కడుపులో నింపుకొని బతుకు భారమైన గెడకర్రల మీదకి ఎక్కి తాడుపై నడుస్తోంది సాయవ్వ. చూసి ఆనందించే జనాలను మెప్పిస్తూ దిన దిన గండంగా బతికే సంచార కుటుంబాల గురించి తెలుపుతుంది. ఈనాడు చాలామంది బతుకుతున్న ప్రాంతాలు తమ సొంత ఊళ్లు కావు. పొట్ట చేతపట్టుకొని దొరికిన కాయకష్టం చేసుకుని ఎలాగోలా జీవించాలని తాపత్రయంతో, సొంత ఊరిలో మనుగడ ప్రశ్నార్థకమై నగరానికి వలస వచ్చే వలస కూలీల బతుకులను 'దీపం పురుగులు' కథలో కళ్లకు కట్టాడు. ఎప్పుడు చూడని, ఎక్కడున్నామో ఎరగని వెంకటేష్, భూదేవి భార్యభర్తలు.. రోడ్డుకు చివరన చిన్న పూరి గుడిసె వేసుకొని ఈ రోజు పని చేసుకుంటూ జీవనం గడిపేవారికి అనుకోకుండా వచ్చిన అంటురోగం కరోనా వల్ల వారి జీవితాలు కకావికలమవుతాయి. వారి గుడిసె ఆనుకొని ఉండే పెద్ద బంగ్లాలోకి భూదేవి రోజు తొంగిచూసి విశాలమైన మేడ, మొక్కలు పెంచడానికి విశాలమైన స్థలం, వారు కూర్చోవడానికి తూగుటుయ్యాలలు చూసి చిన్నబోయేది. నా జీవిత కాలంలో కనీసం నునుపు గోడలు గల ఇల్లు ఒకటైన కట్టుకోగలమా అని ఆలోచిస్తుంది. మరోపక్క తినడానికి తిండి లేక, కరోనా జాగ్రత్తలు చెప్పడానికి వచ్చిన ఆశ కార్యకర్తతో తమ గోడును వెళ్లబోసుకుంటుంది. పేదవారి గుడిసెలు, వారి మనసుల్లో గూడుకట్టుకున్న ఆలోచనలను ఆవిష్కరిస్తాడు

రచయిత. కొన్ని పనులు చూడటానికి సులువుగానే కనిపించినా, చేయడానికి ఎంతో శ్రమ ఉంటుంది. అలాంటి పనులు చేయడం వలన ప్రాణాలను వదులుకోవాల్సిన పరిస్థితులు ఏర్పడిన ఆశ్చర్య పడనవసరం లేదు. కాలంతోపాటు మార్పులు వచ్చే పనుల్లో కొంచెం తేడా ఉండొచ్చేమో కానీ అదే పని అంతకుముందు కాలంలో చేసినప్పుడు దుర్భరమైన, దుర్గంధంగా ఉండే మ్యాన్ హోల్లో అశుద్ధాన్ని తీసివేసే పనిని చేసే కార్మికుల గురించి 'తడియారని బతుకులు' కథలో వారి జీవితాన్ని పణంగా పెట్టి, తరతరాల నుంచి చేస్తున్న పనిగా భావించి, మరో పని చేసే అవకాశం లేక, తప్పక, తప్పని పరిస్థితుల్లో వృత్తిగా చేస్తున్న కులాల గురించి ఉంది. ఆ పనిచేసే కార్మికులు పడే ఆవేదనని, బాధల్ని తెలియజేశాడు. మ్యాన్ హోల్లో అశుద్ధం పోకుండా అడ్డుగా ఉన్న దానిని తొలగించ దానికి సాయిలు, లక్ష్మయ్య పడే ఇబ్బందులు, ప్రాణాలకు తెగించి లక్ష్మయ్య మ్యాను హొల్‌లోకి దిగి పని చేస్తాడు. అలాగే తరతరాలుగా సాయిలు తల్లి కమలమ్మ అదే పని చేస్తుంది. సాయిలు తండ్రి ఆ పని చేస్తూనే మ్యాన్ హొలులో ఊపిరాడక ఊపిరి వదులుతాడు. తరతరాలుగా ఇలాంటి పని చేస్తున్న బతుకుల్లో అయినా మార్పు రావాలని ఆకాంక్షిస్తూ సాయిలు తను నేర్చుకున్న అక్షరాలను తన జాతి వారికి చెప్పి, వారిలో మార్పు రావడానికి ప్రయత్నిస్తానని మాటిస్తాడు. ఎంతో హృదయ విదారకమైన కథ ఇది.

కాలానుగుణంగా మారుతున్న పరిస్థితుల్లో పాత ఆచారాలను, సంప్రదాయాలు పక్కనపెట్టే అవసరం ఉన్నా, అన్నింటిని విస్మరించడం అంత మంచిది కాదనే విషయాన్ని తెలియజేస్తూ 'భ్రాంతిమదం' కథ ద్వారా తెలిపారు. ఈనాడు యువతీ యువకుల్లో వస్తున్న ఆలోచనలకు అనుగుణంగా ఈ కథను రాశాడు. పెళ్లి కాకముందే ఒకరినొకరు అర్థం చేసుకున్నామని, మన మధ్య ఎవరి అవసరం ఉండదని, దుష్యంతుడు శకుంతలలా ప్రమాణాలు చేసుకొని శేఖర్, రవళి కలిసి జీవిస్తారు. కానీ అవసరాలు తీరాక, ఆకర్షణ తగ్గాక శేఖర్ నిజస్వరూపం గ్రహించి పెళ్లి ద్వారా లభించే భద్రత ఎంత విలువైనదో రవళి తెలుసుకుంటుంది. అనుభవం నుంచి నేర్చుకున్న పాఠం ద్వారా ఎప్పటికీ తన దరిని చేరుకోలేనంత దూరంగా శాశ్వతంగా వెళ్ళిపోతుంది. ఒకరిపై ఒకరికి ఎంతటి నమ్మకాలున్నా, బలమైన ప్రేమానురాగాలు ఉన్నా, ఇద్దరి మధ్య బంధాలను బలోపేతం చేసే ఒక సంఘ నియమం ఉండాలని ఈ కథ ద్వారా నేటి సమాజానికి విలువైన సూచన చేశాడు రచయిత. కరోనా నేపథ్యంలో పల్లెల్లో మాయమవుతున్న మానవత్వాన్ని, తడారిపోయిన బతుకుల్లోని లోతుల్ని అత్యంత సహజంగా, హృదయ విదారకంగా చిత్రించిన కథ 'గుండెల్లో తడి'. పాఠకుల గుండెల్లో నిప్పు రగిల్చి, మనిషి వేరు మానవత్వం వేరని భావించేవారికి కనువిప్పు కలిగించే కథ ఇది. పల్లెలూ, పట్టణాలు అని లేకుండా జనజీవన స్రవంతిని కరోనా అతలా కుతలం చేస్తున్న తీరును ఈ కథలో చిత్రించారు రచయిత. పల్లెలంటే ఒకప్పుడు తరగని ప్రేమకు, వదిలిరాలేని మమ కారాలకు, ఆత్మీయతలకు, అనురాగాలకు నిలయాలు. కులమతాలు వేరైనా అన్నదమ్ములుగా, అక్కచెల్లెళ్లుగా సహజీవనం సాగించడం పల్లీయుల జీవనానికి అద్దం పడుతుంది. అయితే కరోనా వచ్చాక పల్లెల్లో అనేక మార్పులు సంభవించాయి. ఒకరికొకరుగా బతికిన పల్లెజనాలు ఎవరికి వారుగా బతకాల్సి రావడం ఒప్పుకుని తీరాల్సిన చేదు నిజం. అటువంటి కఠిన వాస్తవాన్ని, అభద్రతా భావాన్ని ఈ కథ కళ్ల ముందుంచింది. నీళ్ళల్లోని శవం దొరకనంత వరకు మూడెకరాల చెరువు గట్టుమీద మూగిన ఊరి జనం, శవం దొరికిన తర్వాత ఎవరికి వారుగా తప్పుకుపోవడమే అందుకు నిదర్శనం. మన చుట్టూన్న వాళ్లంతా మనవాళ్లేనని భ్రమించడం మానవ సహజం. కానీ కష్టాలు వచ్చినప్పుడే మనుషుల నిజ స్వరూపాలు బయట పడుతుంటాయి. పైగా కరోనా అనే నెపంతో మనిషికి మనిషికి మధ్య భౌతిక దూరాల అడ్డుగోడలు ఏర్పడ్డాయి. రోజుకూలీ చేసుకుని బతికే పేదల జీవితాలు ఎంత దుర్భరంగా ఉంటాయో ఈ కథ చదివితే మనకు అవగత మవుతుంది. చెరువులో నుంచి శవాన్ని బయటకు తీసేవరకు ఒక కథగా, బయటికి తీశాక శ్మశానానికి తీసుకెళ్లే వరకు మరొక కథగా చూపెట్టాడు రచయిత. సమయానుగుణంగా వాడిన సామెతలు, ఉపమానాలు కథకు జీవం పోశాయి. కొన్ని సమస్యలు కంటికి పెద్దగా కనిపించకపోవచ్చు. వాటివల్ల ఎదుర్కొనే సమస్యలు మానసికంగా మనిషిని ఎంతో కుంగ దీస్తాయి. అందరికీ సమస్యలనేవి సాధారణమైన విషయమే అయినా కొందరి జీవితాలను కొన్ని సమస్యలు తలకిందులు చేస్తాయి. ఇటువంటి బాధలు ఎదుర్కొంటున్న రఘుపతి కుటుంబం గురించి 'రసం పీల్చే పురుగులు' కథలో పేదవారి సమస్యలను, వాటికి పరిష్కారాన్ని సూచించాడు రచయిత. వారం వారం అప్పు కడతానని అప్పు తీసుకున్న రాజ్యం. అప్పు కట్టలేక ఇబ్బంది పడుతూ అప్పుల వాళ్ళు రాగానే భాగ్య ఇంట్లో దాక్కునే రాజ్యాన్ని చూస్తే అప్పులు తీసుకుని కట్టలేక ఇబ్బందులు పడే మన ఇరుగు పొరుగు కుటుంబాలే కనిపిస్తాయి.

పంటే ప్రాణంగా, పసిపిల్లల కన్నా అల్లారుముద్దుగా చూసుకుంటూ పత్తి పంట పండించే రఘుపతి... పంట వేసిన చేతికి రాక, చీడ పురుగులు చేసే దాడికి తట్టుకుని నిలబడే రైతుల కనిపిస్తుంది. తల్లిదండ్రులు ఎదుర్కొనే సమస్యలు ఒక ఎత్తయితే, కంటికి కనిపించని జీవితాలను బుగ్గిపాలు చేసే సంఘటనలు, సమస్యలు మరొక ఎత్తు. మంచిచెడులను వివరించి, బడి పాఠాలు చెప్పి, బతుకులను బాగు చేయాల్సిన పంతులు... బతుకులను బుగ్గిపాలు చేసే సంఘటనలు అనేకం జరుగుతూనే ఉన్నాయి. సౌమ్య పరిస్థితి కూడా ఇదే. క్లాసులో బాగా చదివే సౌమ్య. పంతులు అసభ్యంగా ప్రవర్తించడం, ఏమి చేయాలో తెలియక చివరికి చదువుకే దూరం కావాలని నిర్ణయం తీసుకుంటుంది.

ప్రతిభకు, కులానికి సంబంధమే లేకున్నా క్రికెట్ బాగా ఆడే సందీప్‌ను కోచ్ జిల్లా స్థాయిలో ఆడే టోర్నమెంట్‌కి సెలెక్ట్ చేయరు. నేడు కాలాలు మారినా, మనుషుల ప్రవర్తనలో అంతగా మార్పు రాలేదు. ఎప్పుడు ముభావంగా ఉంటూ, పెద్దగా మాట్లాడని రఘుపతి తన కుటుంబాన్ని సమస్యలు ఎంత అవలీలగా ఎదుర్కోవాలో సూచించాడు. పొలంలో నేను, వ్యవస్థలో మీరు పోరాడకుంటే జీవించడం కష్టం. చేతకాని వారమవుతామని ధైర్యాన్ని నూరిపోస్తాడు రఘుపతి. 'మంచు కింద ఉక్కపోత' కథలో చిన్నప్పుడు సంవత్సరానికి రెండుసార్లు జాతీయ జెండాకు సెల్యూట్ చేస్తేనే హృదయంలో ఏదో తెలియని ఆనందం, జాతి పట్ల గౌరవం, గర్వం ఏర్పడుతుంది. ఈ భావాలే పెద్దయ్యాక సైనికుడిగా దేశానికి సేవలు అందించాలని చాలామంది యువత కలలు కంటారు. అలా కలగన్న సైనికుడు ఎదపై జాతీయ జెండా, చేతిలో గన్ను పట్టుకొని మంచు కొండల మధ్య మరణం సంభవించిన, శత్రు మూకలను ఎదిరించి, ప్రాణం కోల్పోయిన భయపడేది లేదని దేశానికి సేవ చేయడం తన అదృష్టమని భావించే సైనికుడు గురించి వివరించాడు. రచయితకు దేశంపై, జాతీయజెండాపై, సైనికులపై ఉన్న గౌరవాన్ని, మమకారాన్ని తెలిపాడు.

రచయిత తనదైన కోణంలో, సునిశిత అంశాలను, భావాలను కథారచనలో వివరించారు. కథా వస్తువు ఎంపిక, సందర్భానుసారంగా వాడే సామెతలు, జాతీయాలు, వ్యంగ్యాస్త్రాలు మరింత సొగసులద్దుతున్నాయి. ఔచిత్యమైన పాత్ర చిత్రణ చేయడంలో మేటి రచయిత జడా సుబ్బారావు. వీరి కలం నుంచి మరిన్ని రచనలు రావాలని ఆశిద్దాం.



## అస్థిమితం

కదల్లేని సుప్తావస్థ
కనిపించనివ్వని అజ్ఞాతవాసం
తప్పనివి కొన్ని
తప్పనిసరై ఇంకొన్ని
చుట్టూ కర్పరమై గోడ కట్టేశాయి
కదిలే అక్షర కాంతులు
కంటికానుతున్నట్లే ఉన్నాయి
మెదడు తెరపై నిక్షిప్తం కావడం లేదు
లాలిపాటలూ, జాలిగీతాలూ
కర్ణభేరిని తాకుతున్నట్లే ఉన్నాయి
తరంగ నాదానికీ హృదయాంతరానికీ మధ్య
గడ్డ కట్టుకుపోయిన పొరలేవో...
ఓ గిగాబైట్ గానో, మెగాబైట్ గానో
గ్రాఫిక్స్ సుడిగుండంలో
చుట్టుకుపోయిన వైనం

ఇప్పుడో అక్షరమై కరిగిపోవాలి
వాక్యాన్నై ప్రవహించాలి
పాటగా పరవళ్లు తొక్కాలి!

-ప్రగతి

కవిత

# మూడు ముఖాలు

- చందలూరి నారాయణరావు
83094 63567



ఒక రోజు వ్యాహ్యాళిలో
రాలిన పండ్లతో ఓ చెట్టు
దోసెడు పండ్లతో జేబు నింపి,
మనసులో నాటుకుపోయింది

♦ ♦ ♦

రెండో రోజు
నోరూరిన కళ్ళు చెట్టుని వెతుకుతుంటే
ఎదురుగా నవాబు చిరునవ్వు
గుప్పెడు పళ్లని కోసిచ్చింది.
ఇది 'మసీదు చెట్ట'ని
వెనక్కుపడ్డ అడుగులకు
రెండు మాటలతో
కొమ్మలు భుజాన్ని తాకాయి!

♦ ♦ ♦

'ఎక్కడైనా మొలుస్తాం
ఏ చేతినైనా ప్రేమిస్తాం
ఏ మట్టిలోనైనా జీవిస్తాం
కాయలతో నిలచి
రాలినా పిలిచి
మట్టి మర్యాదను కాపాడి
చెట్టు ఫలితాన్ని పంచుతూ
ధర్మనిరతిన చాటుతూ
పక్క వీధిలో చర్చి గేట్ దగ్గర
'చర్చిచెట్టు' రుచిని కూడా చూడమన్నాయి!

♦ ♦ ♦

మనసు దూరంగా ఆలోచిస్తూ
'చర్చిచెట్టు' వద్ద ఆగింది.
కాపలా భయం పెట్టని
ఫాదర్ పెంచిన చెట్టు
ప్రేమగా పంచిన ప్రేమకు
జేబు, మనసు రెండూ నిండాయి!

♦ ♦ ♦

మంచి రుచితో దీవించిన
మసీదు చెట్టు
చర్చి చెట్టు
దూరమైన కొలది తలలు ఊపుతూ
తియ్యగా తోచాయి

♦ ♦ ♦

ఈ సంగతి గుడి చెట్టుకు చెప్పాలని
గుడి పండ్లనూ
ఫాదర్, నవాబుకి
రుచి చూపాలని వడివడిగా
నడుస్తుంటే
దూరం నుండే గుడిచెట్టు
గర్వంతో ఆహ్వానం పలుకుతోంది!

మట్టి ఒక్కటే
మొలక ఒక్కటే..
చెట్టు ఒక్కటే
రుచి ఒక్కటే
నాటిన చేతులకు
చూసే కన్నులకు
పెట్టే పేరుకు
చేసే ప్రయోగాలకు
ఫలం తీయనైనా
ఫలితం విషం
ప్రకృతి ఎప్పుడూ పాఠమే
వినగలిగితే.. చదవగలిగితే..! ■





# నిశ్శబ్ద సంగీతం నా రహస్య మందిరంలో...

- భువన చంద్ర

89401 70646

పద్యం, గద్యం, కావ్యం, నాటకం, పురాణం, నవల, నవలిక, కథ, కథానికలానే రివల్యూషనరీ పొయెట్రీ, సర్రియలిస్టిక్ పొయెట్రీ, ఇన్స్పిరేషనల్ పొయెట్రీ ... ఇలా పాశ్చాత్యులు కూడా అనేక విధాలుగా కవిత్వాన్ని కొత్త పుంతలు తొక్కించారు. మాటని సంగీతంతో జోడిస్తే పాట అవుతుంది. అక్షరానికి హృదయాన్ని జోడించినప్పుడే కవిత్వమవుతుంది. లోసారి సుధాకర్ రాసేది ఈ హృదయం జోడించిన కవిత్వమే. సాహిత్య ప్రక్రియల్లో కవిత్వమే అతి క్లిష్టమైనదని నా అభిప్రాయం. అలతి అలతి పదాలలో అనంతమైన భావాన్ని ఆవిష్కరించడం సులభం కాదుగా.. ప్రతి పదమూ తన ముద్రని నిలుపుకుంటూనే మిగతా పదాలతో కలిసినపుడు సంపూర్ణంగా వాటిలో ఐక్యమై మరో కొత్త అర్థాన్ని ఇవ్వగలిగాలి. పుంఖాను పుంఖాలుగా వచనరచన చెయ్యొచ్చేమోగానీ, కవిత్వాన్ని మాత్రం వెలయించలేము. అర్థంలేని వ్యర్థ కవితల సంగతి వేరే.

సాహిత్య ప్రక్రియలో ఏ రచనకైనా మొట్టమొదటి విమర్శకుడు ఆ రచయితే తనే అయినపుడు మనకి నాణ్యమైన రచనలు లభిస్తాయి. లోసారిలో తనని తాను విమర్శించుకునే సద్గుణం ఉంది. అందుకే అక్షరాల్ని మితంగా వాడతాడు.

**'నా రహస్య మందిరంలో..'** అనే లోసారి కవితా సంకలనంలో ఈ విషయాన్ని స్పష్టంగా గమనించగలం. ఇంతకూ ఆ 'రహస్యమందిరం' ఏది? ఎక్కడుంది? ఆ రహస్యమందిరం లోసారి సుధాకర్ గారి మనసులో వుంది. అందుకే దాన్ని మనోసముద్రం అని చెప్పాలి.

అక్కడేమున్నాయి?

"భయాలు, సందేహాలు, నిర్లక్ష్యాలు, నిర్లజ్జపు సమయాలు, అంతులేని చీకటి పార్శ్వాలు, ఈర్ష్యాద్వేషాలు, రగులుతున్న హింసాగ్నులు, విశృంఖలత్వపు మోహావేశాలు, కాంక్షల కోరలు కొమ్ములు, మృగాలు, ఘోరారణ్యాలు' అన్నీ వున్నాయి. ఇది ఇండివిద్యువల్ కాదు. యూనివర్సల్. ఎవరి మనోసముద్రాన్ని చదివినా, వెదికినా ఇవన్నీ ఉండి తీరుతాయి.

**నడక మొదలైంది :** గుడిసెల్లోంచి పూరిగుడిసెల మీదుగా నిప్పుల్ని తొక్కుతూ, కరకు కత్తుల్ని దాటుతూ, తరతరాల బానిసత్వాన్ని ప్రశ్నిస్తూ, కదులుతూ, ఉరుముతూ ఆకాశపు దారులకేసి నడక మొదలైంది.

**నా బలం నా అక్షరం.. :** లోసారికి అక్షరమే బలం, అక్షరమే ఆయుధం. ఎందుకంటే, 'ఇది నిజాయితీకి శిలువ వేస్తున్న సమయం, ఇది నీతిని అవినీతి ప్రశ్నిస్తున్న సమయం' గనుక.

**యాత్ర మొదలౌతుంది :** 'నిప్పుని మోస్తూ కొందరు, నీటిని మోస్తూ కొందరు, పూలు పరుస్తూ కొందరు, భుజం మార్చుకుంటూ మరి కొందరు.. అంటూ మనకు కనుల ముందు మహాప్రస్థానపు చిత్రం గోచరిస్తుంది. జనన మరణ రహస్యాల్ని విప్పుతూ... **దాహం :** 'సాహిత్యమంటే, జీవితమంత తీరని దాహం' అంటారు. ఆ దాహమే పాఠకుల, శ్రోతల దాహాన్ని తీర్చేది!

**మబ్బుల్లోంచి :** మబ్బుల్లోంచి రాలిన పూలే కదా రేపటి కన్నీటి జ్ఞాపకాలు... ఇదో అద్భుత భావచిత్రం.

**ఆకు రాలే కాలం :** "పక్షులు ఎగిరిపోతాయి.../ చెట్టుని ఒంటరిని చేసి" మరి చెట్టు మాత్రం బతికే వుంటుంది..."

ఆశల చివుళ్లతో కొంతకాలం

ఆవేదననీ ఆకులుగా రాల్చి కొంతకాలం

ఆకాశపు దారుల కేసి చూస్తూ ఇంకొంతకాలం... అంటారు. కుటుంబ వ్యవస్థని ఎంత అర్థవంతంగా ప్రతిబింబిస్తుంది ఈ కవిత. ముఖ్యంగా నాగరికత 'చదివిన' ఈ నాటి కుటుంబ వ్యవస్థని.

**అతిశయం :** గొంతు తెగిన రాగంలా/ విప్పని నీ మనసు పుస్తకాన్ని/ రహస్యంగా నా ముఖాన విసిరేసి –' అంటూనే ...

వేల సమాధానాలు నీ చూపులు/ ఒకే ప్రశ్నను నేను' అంటారు. అగుపించని సవాళ్ళనెదుర్కొనే ప్రతి వ్యక్తి హృదయ గాథ ఇది. చెప్పలేని విప్పలేని చిక్కుముడుల చిట్టా ఇది.

**వసంతంలో విషాదం :** 'ఓ నిద్ర పక్షి కళ్ళల్లో గుచ్చుకుంది.

గొంతు పిడికిలెత్తదు / పిడికిలి నోరు విప్పదు

శతృవులా మెలకువ (వచ్చింది)... ఇదో అద్భుత కవిత. చూచే కళ్ళు చెప్పలేవు. చెప్పే నోరు చూపలేదు. మెలకువ శతృవులా (అంటే నిశ్శబ్దంగా పొంచి పొంచి) వచ్చిందనడం ఓ మహాద్భుత ప్రయోగం.

**అక్షర బలం :** 'అక్షరమే ఆయుధమైతే

ఎన్ని యుద్ధాలను కలగన్నానూ?' అంటారు.

'అక్షరమే ఆయుధం, అక్షరమే సైన్యం

అక్షరాల్ని ఎదుర్కొగల శతృవెవరో చూద్దాం' అంటారు. ఎందుకంటే అక్షరమే 'లోసారి ఆత్మ బలం గనుక'

**ఒంటరి ఏకాంతం :** ఒంటరితనం వేరు, ఏకాంతం వేరు. రెండూ ఒకే స్థితిలో అన్నట్టు అనిపిస్తాయి. 'గది నాతో మాట్లాడదు/ గాలి నన్ను పలకరించదు/ నువ్వు రాని యీ ఇల్లు / జైలు గదిలా మారుతుంది. 'అయ్యో, సంయుక్తంగా ఒంటరితనాన్నీ, ఏకాంతాన్ని అనుభవించాలంటే ఈ కవిత చదవక తప్పదు. లోసారి కృష్ణా పుష్కరాల సందర్భంగా 'డ్యూటీ'లో వున్నపుడు మదిలో మెదిలిన అనుభవ కుసుమమిది. (భార్యలో పరకాయ ప్రవేశం చేసి రాసిన కవితన్నమాట) స్త్రీ హృదయాన్ని ఆవిష్కరించిన అసమాన చిత్రమిది.

జీవితమంతా యుద్ధమైతే, దేహమంతా 'గాయా'లే కదా అంటూ జీసస్‌నీ, బుద్ధున్ని మళ్ళీ రమ్మని ప్రార్థిస్తాడు' 'రియల్ బూమ్' భూతమేదో పట్టిన పల్లె, పాడిపంటలకు దూరమైందని వాపోతాడు. 'వసుధైక కుటుంబం' లాంటి ఊరు

వట్టిపోతున్న పాడియావుని తలపిస్తోందంటాడు.

"కనులు దాటిన కన్నీటి బొట్టునై ఎటు వెళ్లనూ?" అంటూ బెడ్రూమ్ తలుచుకుంటాడు.

ప్రవహించే జ్ఞాపకాల్లో తేలుతూ పరవశిస్తాడు. కాలానికి అటూ ఇటూ నిలచిన రెండు గుండె గొంతుల ఏకగీతాన్ని 'మౌనంగా ఆలకిస్తూ' విషాదమోహాన్ని 'వాడి' పరం చేసిన పడతి హృదయమై ఎదలోకి దూసుకొస్తాడు. జీతగాడు పని మంతుడని 'సూర్య–చంద్రుడి'తో పోలుస్తాడు.

చెప్పకనే చెప్పేది ఓ విస్మృతి, ఓ ఉన్మాద ప్రేమ చెప్పే నిజాలు నీడల్లా మనని వెంటాడతాయి.

'నల్ల పంజరాల్ని' చీల్చుకు బయటికి రావడం ఓ చారిత్రక అవసరం అంటాడు. నాలోంచి నాలోకే అంటూ– నీలోకి నాలోకి మనసులోకి ప్రవహిస్తాడు. ప్రవేశిస్తాడు. ఇద్దరి ప్రేమికుల మధ్య 'అగాథాన్ని చూసి' పిడికిలి బిగిస్తాడు. పిడికిలే కదా అనుకోవద్దు, అది సమైక్యతకి చిహ్నం అంటాడు. చిత్రం ఏమంటే ఎక్కడా లోసారి సుధాకర్ నవ్వడు, నవ్వించడు. అలా అని ఏడవడు, ఏడిపిస్తాడు. 'మైనపు బొమ్మల్ని' మనముందు నిలబెట్టి. సహచరుడా... లోసారి అనే అక్షరారణ్యంలోకి ప్రవేశించాలంటే హిపోక్రసీ అనే ముసుగు ఉండకూడదు. అర్థం లేని వ్యర్థ ప్రేలాపనలతో నిన్ను నువ్వు దాచుకోకూడదు. రా.. తలెత్తి బైటకిరా. నిజాన్ని, నిర్భయంగా చూడు. 'నిజం' అనే నాగలితో దున్ని, 'సమత, సమైక్యత' అనే పంటని పండించు.

సుధాకర్ కవితని అర్థం చేసుకోవడానికి నిఘంటువులతో పనిలేదని నిర్భయంగా చెప్పగలను.

**యెర్రకలువ :** వాడు.... 'ఎప్పుడో కాలం ఉరివేసిన

శిరస్సును గుర్తు చేస్తున్నట్లు / ఎర్రెర్రని కలువలా వుంటాడు

వాడో నిరసన... రేపటి స్వేచ్ఛా ప్రభంజనాన్ని కలగంటు న్నాడు... ఈ కవితలో ఓ అద్భుతమైన లైనొకటి ఉంది. 'పిడికిలి బిగించిన ప్రశ్నలా ఉంటాడు. అని కొన్ని వేల గొంతుల ప్రశ్నల్ని ఒక్క పిడికిలి సంధిస్తోంది. వావ్..!

**మనం లేని కాలంలో :** 'కష్టకాలాల్లో కన్నీటి రుతువుల్లో

ఒకరి కన్నీళ్లను మరొకళ్ళు తుడుచుకోవడం'

ఎక్కడికక్కడే ఆది, ఎక్కడికక్కడే అనంతం అయ్యే కాలాన్ని ఎంత అద్భుతంగా చిత్రీకరించారో. 'అవును... కాలం మాత్రమే ఏ ఇద్దరి మధ్యనైనా వారధి.

**గాయపడిన వేణువు :** 'గాయపడే వేణువు' ప్రశ్నల్ని సంధిస్తూ చిట్టచివరికి చెబుతుంది. జీవితమంటే– పోరాటమని, అంతేగా మరి. శరీరమూ ఒక వేణువు వంటిది! శరీరమనే వేణువులోకి 'ప్రాణాలూదేది నీవే కదా అని రాధ కృష్ణునితో అనడం ఎంత అద్భుతం! అయితే, ఆ ప్రాణం వున్నది పోరాటానికి అంటారు సుధాకర్.

చెలికాడు, పూలవంతెన, ఒకపాట రెండు స్వరాలు, స్వరం స్వప్నం.. ఇవన్నీ కూడా సున్నితమైన, అతి వాడియైన భావాల్ని గుండెల్లో గుచ్చేవే. ముఖ్యంగా స్వరం – స్వప్నంలో...

అమ్మ పొట్టలోనే / ఉమ్మనీటిలోనే
ఈత నేర్చిన వాన్ని / పుడుతూనే
పిడికిలి బిగించిన వాణ్ని ..అనడం
సరికొత్త / వెగులు స్వప్నాన్ని

తిరగబడ్డ వేలడప్పుల స్వరాన్ని.. అనడం నిరంతర పోరాటపు 'ఆకలి' యీ స్వరం – స్వప్నం అని చెప్పక తప్పదు.

సుధాకర్ కవితల్లో అద్భుతమైన భావచిత్రాలు వుంటాయి. కళ్ళు అక్షరాల మీద పరుగిడుతుంటే, తక్షణమే మనసు భావాల్ని చిత్రీకరిస్తూ వుంటుంది.

'సుడుల తుఫానులో / చూపు కోల్పోయిన పడవ'
'నడి సముద్రంలో చేతులు నరకబడ్డ నావికుడు (వొంటరి పాట)'
'ఇక్కడే నా అనుభవాల దొంతర్లలో
గుచ్చుకున్న గాయాల్ని తడుముకొని (ఇక్కడే నా శైశవ్యం)
సాలోచనగా నడిచి వెళ్ళింది
'నేత్ర ధనస్సు వెక్కుపెట్టి /
అక్షరాలను విల్లంబుగా మలచినవాడు
'మెల్లగా పక్కకి వత్తిగిల్లాడు / ఆసుపత్రి గీతమై (అజేయుడు)
'బతుకో లాంగ్‌మార్చ్ (ముసురు)
'ఎవరు విసిరిన మాటో నగరానికి తూటాయై తగిలింది'

'ఉగ్రవాదం, ఉన్మాదం మత్తులో మనిషి ఆదిమ అవశేషం ఉన్మాదం.. ఇలా చెప్పుకుంటూ పోతే లోసారి దృష్టిపడని కవితా వస్తువంటూ లోకంలో కనబడదు. ఆచూపు కూడా మామూలు చూపు కాదు. ఎక్స్‌రేకంటే తీక్షణమైన చూపు.

'నిజానికి నేనే అబద్ధాన్ని / నేనే గొప్ప నిజాన్ని
అతి పెద్ద రహస్యాన్ని కూడా. (నేల రాలిన స్వప్నం) అంతేగా మరి. మరుక్షణం ఏం జరుగుతుందో తెలిసిందెవరికి? అందుకే 'అబద్ధాన్నీ, నిజాన్నీ, రహస్యాన్నీ, అన్నీ నేను అయ్యాను/ 'మొలకెత్తని విత్తనాలు / ప్రకృతి చేసే భ్రూణహత్యలు' (భ్రూణ హత్యలు) అంటారు లోసారి. ఎంత అద్భుతమైన యథార్థ భావచిత్రం.

'నాకన్నా.. నా కత్తి ముందుంది/ నా కత్తికన్నా చూపు మరీ ముందుంది, అందుకే నేమో తన ఎత్తు పారలేదు' (మృత్యు కరచాలనం). ఇది లోసారి స్వానుభవం. అడుగడుగునా ఆపదలు పొంచి వుండే పోలీసు వత్తిడిలో, ఎన్ని అనుభవాలో!

"జ్వరం కాసిందో / కరువు కాటేసిందో / ఆమె రాలేదు. ఆ పూటకి" అంటూ.. 'అమ్మ'ను జ్ఞప్తికి తెచ్చుకోవడమే కాక మన అమ్మల్ని కళ్లముందు నిలుపుతారు. 'బతకడమంటే నిజాల నడక / బతకడమంటే నిప్పుల మీద నడక / కత్తులతో చెలగాటం' అంటారు. **ఆడతనం కాదు. మగతనం కాదు** అనే కవితలో, ఈ కవిత మొత్తం చదవండి మనసు మూగబోకపోతే ఒట్టు. మనసులోని మనిషిని నిద్రలేపి, 'కన్నీళ్ళు కలగలిసిన కాఫీలాంటి' నిజాన్నిస్తుంది కవిత.

'మరణం ఎప్పుడూ వంద జన్మల సమూహం' అంటారు లోసారి. **ఒక వీరుడు – ఒక ఆశయం** అద్భుతమైన జీవన నిర్వచనం ఈ కవిత. జండాని రెపరెపలాడించే కవిత. 'నిజంగా నిఖార్సుగా నిప్పులా నడవాలంటే / శిఖరం తలవొంచిందా? శిశువు ఆడడం మానిందా?' అంటూ 'వెలుగు పువ్వు' కవితలో. ప్రేమించడానికి గుప్పెడు గుండె చాలు' అని, 'వాడికి నమస్కరిద్దాం' అంటూ ప్రేమని, ప్రేమించడమే బతుగ్గా పెట్టుకున్న వారికి మోకరిల్లుతారు.

'అశోకుడు అలెగ్జాండర్ / ఎవరైనా / ఎత్తిన ఆయుధాన్ని దింపాల్సిందే "(మనిషి ఆఖరి చిరునామా) అంటారు. అన్ని బంధాలకీ, అన్ని దిగుళ్ళకీ, అన్ని దు:ఖాలకి కూడా ఆఖరి చిరునామా అదేగా.. మృత్యువేగా, లోసారి హృదయపు లోతుల్లోని వైరాగ్యం ఈ కవితలో చూడొచ్చు. 'యోగి' కాని వాడు కవి కాలేడేమో..! 'రైతే సిద్ధార్థుడు' కవిత కాదు, ఎంతో అభివృద్ధి చెందుతున్న ఈ కాలచక్రంలోని రైతు దౌర్భాగ్యాన్ని వెళ్ళగక్కే వ్యథ ఇది. వేరుశనగ మొక్కకిచ్చిన నిండు గౌరవం ఇది. రోజూ మరో నిర్యాణం చెందుతున్న రైతు సిద్ధార్థుల 'నిజ' జీవితం ఇది. ఇంకేం చెప్పను. మౌనం మింగేస్తుంటే.. **ఒకప్పుడు నేను విలుకాడిని, మానవతా పీఠిక** కవితలు మరో కోణాన్ని స్పృశిస్తాయి. ఒక కవితలో కవి మగరాజైతే, మరో కవితలో మానవ మూలాలకి మానవత పీఠిక అవుతాడు. రాయలసీమ వాసులు, ముఖ్యంగా వ్యవసాయదారులు 'వానని ఎంతగా కలగంటారో ఈ 'వానని కలగంటాం' కవిత హృద్యంగా వివరిస్తుంది.

'తిరిగొస్తావా నేస్తం' కవిత చదివాక 'ఓ జానెవాలే హొస కేతో లౌటికే ఆనా' అని శైలేంద్ర రాసిన, ముఖేష్ పాడిన హిందీ పాట గుర్తుకొచ్చింది. పోయిన వాళ్ళందరూ కలల్లా నా కళ్ళముందు కదలాడారు.

'నిశ్శబ్ద సంగీతం' నిజంగా మాస్టర్ పీస్. నిపుణుడైన 'శిల్పి', హృదయమున్న శిలని శిల్పంగా మారిస్తే ఎలా ఉంటుందో అలా వుంది కవిత సోవర్ష్..

'సలాం నీ పాదాలకు ఓ సుఫారీ గీతం, ముఖ్యంగా కాలం కత్తిమీద, నడిచిపోవాలనుకునే వారికి ఎవ్వరైనా ఓ చిరుస్వప్నాన్ని

దానం చెయ్యండి.. ఈ రాత్రి నేను కవిత్వమై ప్రవహిస్తాను' అంటారు.

నిజం. కవికీ ఒక్క స్వప్నాన్ని అరువిస్తే– వెయ్యి రహస్యాల్ని ప్రభవిస్తాడు. మన మనసుగా ప్రతిఫలిస్తాడు.

'ఆర్తి' మరో హృదయాన్ని మెలిపెట్టే కవిత. నాలో నేను.. కవిత నీటిలో నిన్ను గమనిస్తుంది. 'తిరస్కృతి' ఓ చిత్రమైన రివర్స్ పోయమ్. నిందాస్తుతిలా, రంగులు కవిత ఓ అక్షరాల అద్భుత అమరిక. మోడరన్ పెయింట్ బుర్రకి పదునపెట్టి నీలోని అస్పష్ట–భావాల్ని స్పష్టంగా చూపుతుంది. కవీ–ఎన్ని చిత్రభావ వీచికలకి 'తావు' నువ్వు.

**యవ్వన వేళ ...:** నువ్వు నీరు తోడుతున్నావో/ లేదా నువ్వే నదివై / ప్రవహిస్తున్నావో.. తియ్యని బాధని తియ్య తియ్యగా వర్ణించిన కవిత ఇది. ఓ చౌదవీల్ చాంద్ హె..పాట, మరో చాంద్ ఆహే భలేగా' పాట నా గొంతులో సుడి తిరిగినై.

**ఇక్కడ స్త్రీలుంటారు :** 'గోపురాల మధ్య పావురాలై/ గోడల మధ్య గబ్బిలాలై / ఏళ్ళుగా... ఇలాగే/ తరాలు మారినా.. యుగాలు మారినా యుగాధిపత్యంలో / మగాధిపత్యంలో ఏ ఫెమినిస్టూ ఇంత ముక్కు సూటిగా రాయలేదని నిశ్చయంగా చెప్పొచ్చు.

**మాకు దేవుళ్ళు లేరు :** 'తోడేళ్ళ మందకు కుందేలు కాపలా' కథలా ఆంబోతుల కాళ్ళకింద లేగదూడలై నలిగిపోకూడదు. ఆత్మాభిమానం తలవొంచని భవిత కవాలి ! ఈ కవిత నిలువెత్తు ప్రశ్నలాంటిది. ఏ దేవుడు జవాబిస్తాడు? ఇవ్వగలడూ?!

**మిత్రుడా .. వెళ్లి వస్తా :** 'ఊరు భద్రం .. ఊపిరి భద్రం / ఆరచేయి మీద ఆకుపచ్చ సముద్రాన్ని మోసుకొస్తూ / నెత్తురు చిందని కలముందా / ఆకలి మించిన రుతువుందా ? / కవి మేఘాల మెదలు వొంచి / భుజాన మోసుకు తెస్తా / అప్పటిదాకా ఆగే వుంచు/ కత్తి కొన మీదే కానీ / ఉలి అంచు మీదనే కానీ' అక్షరీకరించలేని భావచిత్రాల సంపుటి ఇది. ఆశ నింపిన హృదయ ఘోష ఇది.

**అనంతశోభ :** 'అమావాస్య నిశిలో / వెన్నెల కొరకు వెదకటం / నడిసంద్రంలో ఒడ్డును / తడిమి చూసుకోవడం / మరణం మరో పార్శ్వం.' అని సారాంశిస్తారు.

చీకటి రాకమునుపు / తరువాత

"అన్నీ నెత్తుటి స్పర్శలే చడీచప్పుడు చేయని / అంతరంగ గాయాలే / బతుకు ఎప్పటికీ ముగియని కథ..." అన్నీ నిర్వచనాలే... సజీవ అక్షరశిల్పాలే. ప్రతి పదమూ తనని తానే వివరించుకుంటుంది.. చూపుల్ని ప్రవహింపజేస్తే– బతుకంటే ఏమిటీ. నా కవిత్వం నా జీవితం / నా కవిత్వమే నా జీవితం



## చివరగా...

**క**ట్టెను కాల్చను
కట్టెలు కరువైన వల్లకాడు
ముంగిట్లో కరెంటు తీగ మీది గువ్వల్లా
వన్ బై వన్ శవాల క్యూ లైన్

కిరోసిన్ డబ్బా రేషన్ బియ్యం
పంచదార ప్యాకెట్
క్యూలేమీ కొత్త కాదు

పిల్లనగ్రోవి రోడ్డున పడ్డది
ఊపిరి పోగొట్టుకున్న ఛిద్రాల మూగవేత దేశంలో
శవయుద్ధం
దురాశల పడగలు
ఆసుపత్రుల నిండా ధనార్జన హుండీలు శవాలను
లక్షలు కట్టి కొంటున్న దృశ్యం యధాతథం
కాలేందుకు వరుసలో చివ్వరగా...
నేను...

**- ఈతకోట సుబ్బారావు**

.. అని స్టాంపు వేసి, 'మరో ఆకాశాన్ని' వెలసిన ఆకాశాన్ని' ఆవిష్కరిస్తారు. 'ఉశ్వాస, నిచ్ఛ్వాసాల్లా' తనలో తానుగా కలిసిపోతారు. 'వేటగాడికేమి యెరుక ప్రాణమంటే ఏమిటో' అంటూ 'గాయపడ్డ పక్షిలా' అల్లాడిపోయారు. ఆ అల్లాడటం, ఆరాటపడి పోరాటం చెయ్యడం, అన్నీ మనిషి కోసమే. మనిషిలో మరుగునపడ్డ మానవత్వాన్ని తట్టి లేపడం కోసమే. నేను ఒక్కటే చెప్పగలను. కవిత్వమంటే అక్షరాల పేర్పు కాదు. కవిత్వమంటే జీవించడం, స్పందిస్తూ, అనుభవిస్తూ, అనుభవించిన దాన్ని అక్షరాలతో ఆవిష్కరిస్తూ జీవించడం.

నిజం.. కవిత్వం జీవిస్తోంది, లోసారి కలంలో... ■

సందర్భం





# కాలానికి నిలబడే కేతు విశ్వనాథరెడ్డి కథలు


**గొల్లపల్లి వనజ**

95501 43497


తెలుగు కథా ప్రపంచంలో రాయలసీమ కథలకు ఒక ప్రత్యేకమైన స్థానం, విశిష్టత ఉంది. రాయలసీమ కథా రచయితలు తమ కథల్లో చాలావరకు రైతుల ఆర్తనాదాలను, ఆక్రోశాలను, సంక్షోభాలను, సమస్యలను, కష్టజీవుల శ్రమను, వివిధవృత్తుల వారు పడుతున్న కష్టాలను, ఇబ్బందులను వారి స్థితిగతులను సమాజానికి తెలియజేశారు. వారి వేదనను తమ ఆవేదనగా మలచుకుని కలాన్ని కదిలించారు. సీమ కథా రచయితల్లో కె.సభా, మధురాంతకం రాజారాం, కలువకొలను సదానంద, కేతు విశ్వనాథరెడ్డి, పులికంటి కృష్ణారెడ్డి మొదలైనవారు మొదటి తరానికి చెందిన కథా రచయితలుగా చెప్పవచ్చు. డా.కేశవరెడ్డి, మధురాంతకం నరేంద్ర, మధురాంతకం మహేంద్ర, నామిని సుబ్రమణ్యం నాయుడు, చిలుకూరి దేవపుత్ర, వి.ఆర్. రాసాని, సింగమనేని నారాయణ, బండి నారాయణ స్వామి, సన్నపురెడ్డి వెంకట రామిరెడ్డి, తుమ్మల రామకృష్ణ మొదలైన వారిని రెండో తరానికి చెందిన రచయితలుగా పేర్కొనవచ్చు.

రాయలసీమ పేరు వినగానే ముఖ్యంగా మూడు అంశాలు గుర్తుకు వస్తాయి. అవి : వ్యవసాయం, రైతు, కరువు. రాయలసీమలో కరువుకు ప్రధాన కారణం నీళ్ళు లేకపోవడమే. నీళ్ళు లేకపోతే పంటలు పండవు. పంటలు పండకపోతే దాన్నే నమ్ముకొన్న రైతులు, రైతులను నమ్ముకున్న ప్రాంతం, ఆ ప్రాంత ప్రజలు, జీవరాశులు ఎటువంటి బాధలు ఎదుర్కోవాలో మనం ఊహించవచ్చు. అటువంటి గడ్డు జీవితాన్ని గడుపుతూ ఉన్న సీమ ప్రాంతంపై ప్రభుత్వం నిర్లక్ష్యవైఖరి అవలంబించటం వల్ల సాగునీటి వనరులు నిర్మించబడలేదు. దీంతో, వ్యవసాయం గిట్టుబాటు కాకపోవడంతో రైతులు వేరే వృత్తులను ఎన్నుకోవడం, వాటిలో కూడా రాణించలేకపోవడం వంటి పరిస్థితులను కేతు విశ్వనాథరెడ్డి గారు తన కథల్లో అక్షరీకరించారు. రైతుల జీవిత వాస్తవికతను మనసారా ఒంట పట్టించుకున్న కథకులు కేతు విశ్వనాథరెడ్డి గారికి 'విమలా శాంతి సాహిత్య జీవిత సాఫల్య పురస్కారం' రావడం సంతోషించాల్సిన విషయం.

విశ్వనాథరెడ్డి మొదట పాత్రికేయుడిగా ఉద్యోగ జీవితాన్ని ప్రారంభించారు. తరువాత కడప, తిరుపతి, హైదరాబాదు మొదలైన ప్రాంతాల్లో అధ్యాపకులుగా పనిచేశారు. డా. బి.ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయంలో డైరెక్టరుగా విధులు నిర్వహించి ఉద్యోగ విరమణ పొందారు. పాఠశాల స్థాయి నుంచి విశ్వవిద్యాలయ స్థాయి వరకు అనేక పాఠ్య పుస్తకాలకు సంపాదకత్వం వహించారు.

చిన్న రైతులకు వ్యవసాయం గిట్టుబాటు కాకపోవడంతో క్రమంగా రైతులు కూలీలుగా మారుతున్న పరిస్థితిని 'నమ్ముకున్న నేల' కథలో ఆవిష్కరించారు. ఈ కథలో వీరన్న కరువుకు భయపడి వ్యవసాయం చేసే ధైర్యం లేక భోగం మేళంలో కూలీగా కుదిరి పనిచేస్తాడు. ఆ తర్వాత వీరన్న భోగం మేళం కంపెనీని స్వయంగా తానే పెడదాము అనుకుంటాడు. భోగం మేళంలో రాణించే చాకచక్యం, సామర్థ్యం తనకు లేదని గ్రహించి సిమెంటు ఫ్యాక్టరీలో కూలీగా జీవనాన్ని గడుపుతాడు. ఈ కథలో కథకుడు ఊర్లో ఉన్న పొలాన్ని అమ్మితే డబ్బు వస్తుంది. ఆ డబ్బుతో కూతురి పెళ్లి చేయాలని ప్రొద్దుటూరు నుంచి సొంత ఊరికి వస్తాడు. కానీ ఆ ఊర్లో కరువు విలయతాండవం చేస్తుండడంతో పొలం అతి తక్కువ ధరకు అమ్ముకోవల్సిన పరిస్థితి దాపరిస్తుంది.

స్త్రీలు, పురుషులు అనే భేదం లేకుండా శ్రమను నమ్ముకున్న వారిని గౌరవింపజేయడం కేతు విశ్వనాథరెడ్డి రచనాశయం.

కాలానికనుగుణంగా శ్రమను వెచ్చించాలని 'తేడా' కథలో దివాకర్ పాత్ర ద్వారా రచయిత తెలియజేశాడు. స్త్రీలు ఎటువంటి కష్టాలనైనా, పరిస్థితులనైనా ఇంటా బయటా ధైర్యంగా, చైతన్యవంతంగా, ఆదర్శవంతంగా ఎదుర్కొంటున్న వైనాన్ని ఈ కథలో చిత్రీకరించారు. శ్రమపట్ల గౌరవం లేకుండా సోమరితనాన్ని పులుముకుని దర్జాగా కాలం గడిపే స్వభావాలను, పాత్రలను ఈ కథలో తీవ్రంగా వ్యతిరేకించారు.

విశ్వనాథరెడ్డి తన కథల్లో కరువు రోజుల్లో మూగ జీవుల దుస్థితిని స్పృశించకుండా ఉండలేకపోయారు. ప్రభుత్వం ఎప్పుడో ఒకసారి స్పందించి పశువులకు గడ్డిని సరఫరా చేస్తే ఆ గడ్డిని పేదవారి వరకు రానివ్వకుండా అధికారులు అన్యాయంగా మాయం చేయడాన్ని 'గడ్డి' కథలో వివరించారు. ఈ కథలో అచ్చమ్మ పాత్ర ద్వారా కన్న బిడ్డల్లా చూసుకుంటున్న పశువులకు గడ్డి దొరకకపోవడంతో ఆమె పడే బాధను, ఆక్రోశాన్ని, ఆవేశాన్ని వివరించారు. ఈ కథలో అచ్చమ్మ అధికారులను ప్రశ్నించి నిలదీసే ధైర్య సాహసాలు గల పాత్రగా చూపించారు.

రాయలసీమలో కరువుకు వర్షాభావం ఒక్కటే కారణమని చెప్పలేము. ప్రభుత్వం ఆ ప్రాంతాన్ని అభివృద్ధి చేయకపోవడం, నీటిని నిల్వ చేసుకునే సౌకర్యాలను కల్పించకపోవడం వంటివి కూడా కారణాలు. వాన కురుస్తుందని, పంటలు పండుతాయని, ఆ వంట చేతికి వస్తే అప్పులు తీర్చి బతుకును చక్కదిద్దుకోవచ్చునని వాన మీదే ఆశలు పెట్టుకుని అమాయకంగా మబ్బులకేసి చూసే రైతుల గాథను 'వాన కురిస్తే' కథలో దర్శించవచ్చు. ఈ కథలో పాపయ్య తాను చేసిన అప్పు కొడుకుకు భారం కాకూడదని ఈ సారైనా వాన పడుతుందనే ఆశతో మళ్ళీ అప్పు చేసి మిరప, వేరు శనగ, నిమ్మ పంటలు వేసి వాన కోసం ఎదురు చూసి చూసి ఇదిగో అదిగో అని ఊరిస్తున్న వాన రాకపోవడంతో చివరికి తన ప్రాణాలనే వదులుకుంటాడు. 'అన్నదాతలు' కథను చదివితే కేతు విశ్వనాథరెడ్డి సమరశీల కథా రచయితగా దర్శనమిస్తారు. ఈ కథలో తమ సంస్థలలో పనిచేసే కార్మికుల శ్రమను దోచుకుంటూ వారి కష్టాలను పట్టించుకోకుండా ఎంతసేపూ కీర్తి, ప్రతిష్టల కోసం తాపత్రయపడే పెత్తందారుల స్వభావాన్ని తూర్పారబట్టారు. ఈ కథలో రమణయ్య తోటి శ్రామికుడు చనిపోవడంతో అతనికి న్యాయం జరగాలని యజమాని రంగయ్యను నిలదీస్తాడు. అందుకు రంగయ్య 'మీరు పెట్టే చెయ్యిని కరిచేవాండ్ల'ని రమణయ్యను దూషించి మిల్లును మూసివేస్తాడు. శ్రామికుల కష్టాలను పట్టించుకోని రంగయ్య కొత్త సంస్థను ఏర్పాటు చేసి, ఆ సంస్థ ప్రారంభోత్సవానికి వచ్చిన మంత్రి ముందు ఒక అనాథ బాలుర అన్నదాన మందిరం ఏర్పాటు చేస్తున్నట్లు ప్రకటించి ప్రశంసలను అందుకుంటాడు. మిల్లు మూత పడడంతో వేలమంది కార్మికులు, వారి కుటుంబాలు పొట్ట చేత్తో పట్టుకుని అన్నదానం కోసం కాకుండా న్యాయం కోసం పోరాటం చేసే సన్నివేశం ఈ కథలో చూడవచ్చు. 'దప్పిక' కథలో కొందరు ధనికులు పైకి మంచి వారిగా నటిస్తూ రైతులకు అవసరానికి డబ్బిచ్చి అదను చూసుకొని వారి ఆస్తిని కాజేసి, తమ ఆస్తులను పెంచుకుని, ఆ ఆస్తిని చూసుకొని మురిసిపోతున్న దృశ్యాన్ని చిత్రీకరించారు.

కేతు విశ్వనాథరెడ్డి 'జప్తు' (1974), 'కేతు విశ్వనాథరెడ్డి కథలు' (1991), 'ఇచ్ఛాగ్ని' (1996) అనే శీర్షికలతో కథా సంపుటాలుగా వెలువరించారు. 'వేర్లు', 'బోధి' (1994) తదితర నవలికలు రాశారు. 'కేతు విశ్వనాథరెడ్డి కథలు' సంపుటానికి 1993 – 94లో తెలుగు విశ్వవిద్యాలయం పురస్కారం, 1996లో కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు లభించాయి. కేతు విశ్వనాథరెడ్డి కథకునిగానే కాకుండా పరిశోధకుడిగా, విమర్శకుడిగాను ప్రసిద్ధి గాంచారు. 'కడప ఊళ్ళ పేర్లు' ఈయన పరిశోధన గ్రంథం అయితే, సాహిత్యానికి సంబంధించిన అనేక విషయాలను చర్చిస్తూ 'దృష్టి' అనే పేరుతో 1998లో వ్యాస సంపుటిని వెలువరించారు. ఈయన సాహిత్యానికి చేసిన కృషికి గాను భారతీయ భాషా పరిషత్తు పురస్కారం, రావిశాస్త్రి పురస్కారం, రితంబరీ పురస్కారం, పులుపుల వెంకట శివయ్య సత్కారం, తుమ్మల వెంకట రామయ్య బంగారు పతకం, అజో విభో పురస్కారం, గోపీచంద్ సాహిత్య సత్కారం ... ఇలా ఎన్నో పురస్కారాలు వరించాయి.

కేతు విశ్వనాథరెడ్డి గారి కథలు అభ్యుదయ భావజాలానికి చెందినవి. రైతుల బాధను, వ్యథలను, గాథలను యథార్థంగా చిత్రించే అసలైన అక్షర సేనాధిపతి కేతు. ఈయన కథలు శ్రామికులను ప్రోత్సహించే విధంగా ఉండి వారి ఎదుగుదలకు మార్గనిర్దేశం చేస్తాయి. స్త్రీల శక్తిని, వారి శ్రమను గౌరవించి, గుర్తింపునిస్తాయి. పేదవాడి ఆవేదనను, ఆక్రోశాన్ని, వ్యథను, బాధను వెల్లడి చేస్తాయి. సామాన్య జన పక్షాన అక్షరాన్ని నిలబెట్టటమే కేతు విశ్వనాథరెడ్డి కథాసారాంశం. అందుకే ఆయనివి కాలానికి నిలిచే కథలు.. కదిలి కదిలించే కథలు.

**(ఆచార్య కేతు విశ్వనాథ రెడ్డి గారికి విమలా శాంతి సాహిత్య జీవిత సాఫల్య పురస్కారం ప్రకటించిన సందర్భంగా...)**

■

# తెలుగు సాహిత్యానికి దిక్సూచి శ్రీశ్రీ



తెలుగు సాహిత్యానికి, ఆధునిక కవిత్వానికి శ్రీశ్రీ చెక్కుచెదరని దిక్సూచి అని సాహితీస్రవంతి నిర్వహించిన శ్రీశ్రీ వర్ధంతి సభలో సాహితీస్రవంతి గౌరవ అధ్యక్షులు తెలకపల్లి రవి పేర్కొన్నారు. జూన్ 15న శ్రీశ్రీ వర్ధంతి సందర్భంగా సాహితీస్రవంతి గూగుల్ మీట్ ద్వారా వెబినార్ నిర్వహించింది. ఈ సభకు సాహితీస్రవంతి నాయకులు పిల్లా కుమారస్వామి, సత్యాజీ అధ్యక్ష వర్గంగా వ్యవహరించారు. కుమారస్వామి తన తొలి పలుకులు మాట్లాడుతూ శ్రీశ్రీ వదిలివెళ్లిన కవితా ఊపిరులు వర్తమాన సాహిత్య కారుల కవిత్వంలో ప్రతిఫలిస్తోందని అన్నారు. "నా ఇంటిపేరు ప్రపంచం. నా ప్రజలే నా కుటుంబం" అంటూ ఆయన ప్రపంచ మానవులందరి తరపున వకాల్తా పుచ్చుకున్న మరో ప్రపంచపు కవని అన్నారు. ఇటీవల కన్నుమూసిన కారా మాస్టారికి వెబినార్ నివాళి సమర్పించింది. ఈ సందర్భంగా తెలకపల్లి రవి మాట్లాడుతూ కథకు పెద్ద దిక్కుగా నిలిచిన కాళీపట్నం రామారావు వర్గ సమాజంలో సమిధలయ్యే వారి గురించి రాశాడని అన్నారు. శ్రీశ్రీ చెప్పిన 'వ్యధార్థ జీవిత యదార్థ దశ్యాన్ని' తన కథల్లో కళ్లకు కట్టినట్టు చూపించాడని, ఆయన కథా వారసత్వాన్ని నిలబెట్టడమే ఆయనకు ఇచ్చే నివాళి అని పిలుపునిచ్చారు. తదనంతరం శ్రీశ్రీ సాహిత్యాన్ని సమగ్రంగా విశ్లేషిస్తూ మాట్లాడారు. శ్రీశ్రీ ప్రజాకవని, ఆయన వర్ధమాన కవులకు దిక్సూచి అని అన్నారు. తెలుగు భాషను శ్రీశ్రీ ప్రభావితం చేసినంతగా మరెవరూ చేయలేదన్నారు. 'నిన్నటి కంటే రేపు బాగుంటుందనుకుంటాను' అంటూ శ్రీశ్రీ ఆశావహ దృక్పథంతో ఆధునికతను ప్రదర్శించారని పేర్కొన్నారు. 'శ్రీశ్రీ కన్నా శ్రీశ్రీ కవిత్వం గొప్పది. శ్రీశ్రీ కవిత్వం కన్నా శ్రీశ్రీ మార్గం గొప్పదని కొనియాడారు. సమాజ నిర్మాణానికి పునాదులులైన వారిని శ్రీశ్రీ సాహిత్యంలోకి తీసుకువచ్చి సమాజానికి కొత్త చూపు అందించారని చెప్పారు. శ్రీశ్రీ సాహిత్యానికున్న బహుముఖ పార్శ్వాలను ఆవిష్కరించారు.

తర్వాత జనకవనం జరిగింది. "నేను కవిత్వాన్ని" అంటూ కెంగార మోహన్ తన కవిత్వం వెలుతురు బాటలో పయనిస్తోందని చదివారు. డాక్టర్ ప్రగతి తన "అస్థిమితం" కవితలో వాక్యాన్నై ప్రవహించాలని, పాటగా పరవశించాలనే ఆకాంక్షను వ్యక్తం చేశారు. పాలక పక్ష దుర్నీతిని ఎండగడుతున్న ధిక్కార స్వరాలకు శాంతిశ్రీ తన 'దేశద్రోహం' కవితలో అభివందనాలు తెలిపారు. శ్రీనివాస్ గౌడ్ 'గోడలేనిగది' కవిత వినిపించారు. శ్రీరాం తన 'ఫిదాయి' కవితలో "చనుబాలకేడుస్తున్న పర్వతాల్ని చూస్తున్నాను" అంటూ పాలస్తీనాలో జరుగుతున్న విధ్వంసాన్ని ప్రతిఫలింపచేశారు. పక్కి రవీంద్రనాథ్ తన 'స్వప్న లోకం' కవితలో 'ఓ స్వప్న లోకాన్ని రేపటి కోసం నిర్మించుకుందాం రండి' అంటూ పిలుపునిచ్చాడు. ఇంకా డాక్టర్ బల్లూరి ఉమాదేవి, జంధ్యాల రఘుబాబు, చింతకుంట శివారెడ్డి, డాక్టర్ నాగేంద్ర, పి. గోపీనాథ్, వొరప్రసాద్, అనిల్ డ్యానీ తదితరులు కవితలు వినిపించారు. మధుప్రియ నూతన తరం కవి తన 'స్ఫూర్తి' కవితలో మారిన తన తండ్రి, కష్టజీవే తన స్ఫూర్తి అని స్ఫూర్తిదాయకమైన సందేశాన్ని వినిపించారు. చివరగా సాహిత్య ప్రస్థానం వర్కింగ్ ఎడిటర్ సత్యాజీ కార్యక్రమానికి భరతవాక్యం పలుకుతూ శ్రీశ్రీ కవిత్వస్ఫూర్తి నిరంతరంగా కొనసాగుతోందని, కారా మాస్టారి కృషి కథాసాహిత్యంలో వెలుగుదాఇగా పని చేస్తుందని అన్నారు.

– పిల్లా కుమారస్వామి

# కాళీపట్నం రామారావు మాస్టారి సంస్మరణ సభ



ప్రముఖ సాహితీవేత్త, కథానిలయం వ్యవస్థాపకులు కాళీపట్నం రామారావు మాస్టారి సంస్మరణ సభను సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో కాకినాడలో జూన్ 7వ తేదీన జూమ్ వేదికగా నిర్వహించారు. ప్రముఖ సాహితీవేత్త గనారా అధ్యక్షత వహించగా, సాహితీ స్రవంతి నగర అధ్యక్షుడు మార్ని జానకిరామ చౌదరి సభ్యులను ఆహ్వానించారు. కవి, విశ్లేషకులు బొల్లోజు బాబా మాట్లాడుతూ విశాఖపట్నంలో సిలపరశెట్టి పురస్కారం కాళీపట్నం రామారావు చేతులమీదుగా అందుకోవటం మధురానుభూతిగా పేర్కొన్నారు. గనారా మాట్లాడుతూ మొట్టమొదటి కథ దిద్దుబాటు దగ్గరనుంచి నేటి తరం రచయితల కథల వరకూ కథానిలయం ద్వారా సేకరించిన కారా మాస్టారు అభినందనీయులు అన్నారు. డా.స్టాలిన్ మాట్లాడుతూ మాస్టారి కథలు సమాజంలోని నిరుపేదల జీవితాల్ని, దోపిడీ వ్యవస్థని ప్రతిబింబించేవని అన్నారు. కథారచయిత దాట్ల దేవదానం రాజు కాళీపట్నంతో కథల పరంగా తనకున్న పరిచయాన్ని తెలియజేసారు. ఆయన కథల్లో 'యజ్ఞం' కథ ఒక మైలురాయి వంటిదని పేర్కొన్నారు. జానకిరామ చౌదరి మాట్లాడుతూ ఆయన శ్రీకాకుళంలో నెలకొల్పిన కథానిలయంలో దాదాపు లక్ష వరకూ తెలుగు కథల్ని సేకరించినట్టు చెప్పారు. వక్కలంక రామకృష్ణ మాట్లాడుతూ రామారావు మాస్టారు కాకినాడ వచ్చినప్పుడల్లా తమ ఇంటి వద్ద బస చేసి, ఎన్నో సాహిత్య సమాలోచనలు చేసేవారని అన్నారు. కార్యక్రమంలో కథా రచయితలైన శ్రీకంఠస్ఫూర్తి, ఆకుల మల్లేశ్వరరావు, మీనాక్షీ శ్రీనివాస్, అద్దేపల్లి ప్రభు, పద్మజవాణి, జ్యోతి, దీక్ష, ఉండవిల్లి, శిఖామణి, కృష్ణబాబు, వాడ్రేవు వీరలక్ష్మీ దేవి, పఠాన్ని, శిరీష, దాడి చంద్రశేఖర్ మొదలైన సాహితీవేత్తలు పాల్గొని, కారా మాస్టారితో వారి అనుభవాలను తెలియజేస్తూ నివాళులు అర్పించారు.

# విలువలకు కట్టుబడిన కవి అద్భుష్టదీపక్



సినీ గేయరచయిత, అభ్యుదయ కవి అదృష్టదీపక్ సంస్మరణ సభను కాకినాడ సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో జూన్ 20వ తేదీ ఆదివారం సాయంత్రం ఆన్‌లైన్ వేదికగా నిర్వహించారు. సభకు అధ్యక్షత వహించిన డా.జోస్యుల కృష్ణబాబు మాట్లాడుతూ అదృష్టదీపక్ రాసిన పాటలన్నీ సమాజాన్ని జాగృతపరిచేవిగా ఉంటాయన్నారు. సాహితీ స్రవంతి నగర అధ్యక్షుడు మార్ని జానకిరామ చౌదరి వక్తలను ఆహ్వానించి, అదృష్టదీపక్‌తో గల వ్యక్తిగత సాన్నిహిత్యాన్ని పంచుకున్నారు. జనవిజ్ఞాన వేదిక రాష్ట్ర గౌరవాధ్యక్షులు డా.స్టాలిన్ మాట్లాడుతూ దీపక్ చిన్న వయసులోనే కమ్యూనిస్టు సిద్ధాంతాలకు ఆకర్షితుడై ఆఖరిశ్వాస వరకూ తను నమ్మిన విలువలకు కట్టుబడిన వ్యక్తిగా అభివర్ణించారు. మరొక వక్త డా.ఆలూరి విజయలక్ష్మి అదృష్టదీపక్ సాహిత్య, కళారంగ జీవన ప్రస్థానాన్ని విశ్లేషించారు. శ్రీశ్రీ సాహిత్యనిధి వ్యవస్థాపకులు సింగంపల్లి అశోక్ కుమార్ .. మహాకవి శ్రీశ్రీతో అదృష్టదీపక్‌కి గల సాన్నిహిత్యాన్ని, దీపక్‌తో తనకుగల నాలుగున్నర దశాబ్దాల అనుబంధాన్ని గుర్తుచేసుకున్నారు. ఎర్రజెండా నా ఎజెండా అంటూ కలంపట్టి, గళమెత్తిన అభ్యుదయవాది అదృష్టదీపక్ అని సాహితీ స్రవంతి రాష్ట్ర నాయకులు గనారా పేర్కొన్నారు. సభలో గొడవర్తి సత్యమూర్తి, అద్దేపల్లి ప్రభు, పద్మజవాణి, బొల్లోజు బాబా, శ్రీవత్స, మణిబాబు, గరికపాటి మాస్టారు, జ్యోతి, శివ, దుర్గాప్రసాద్, పద్మావతి, ఇందిర, తదితర కవులు పాల్గొని నివాళులు అర్పించారు.

## ఐదో సంవత్సరంలోకి సమన్విత

అర్ధ శతాబ్దానికి ముందు కళ్లు తెరిచి, సమాజాన్ని తమదైన దృష్టికోణంలో చూసి, పాఠకులకు భిన్న అంశాలలో దిశానిర్దేశం చేసే విజయవాడ ప్రాంత రచయిత్రులు కలిసి 2017, జూన్ 25వ తేదీన ఏర్పడిన వేదిక 'సమన్విత'. 'సాహిత్యం ద్వారా సమానత్వం, సాధికారత, సాంస్కృతిక వికాసం మా లక్ష్యం' అంటూ ఆ దిశగా అడుగులు వేస్తోంది. ఈ ఏడాది జూన్‌లో ఐదో వసంతంలోకి అడుగుపెట్టింది. డాక్టర్ దుట్టా శమంతకమణి కన్వీనర్‌గా, కందికుప్ప ఉషారాణి కో-కన్వీనర్‌గా, కోపూరి పుష్పాదేవి, ఉమామహేశ్వరి, సీనియర్ జర్నలిస్టులు వడ్లమూడి పద్మ, శాంతిశ్రీ సభ్యులుగా ఆరంభమైన సమన్విత ఆవిర్భావమే వినూత్నంగా జరిగింది. మహిళా కళాకారుల సంగీత, సాహిత్య కార్యక్రమాలతో మాకినేని బసవపున్నయ్య విజ్ఞానకేంద్రంలో 11 మంది అనువాదకుల చేతిలో రూపుదిద్దుకున్న 'మేం గొంతు సవరించుకున్నాం' తొలి ప్రచురణ ఆవిష్కరణతో మొదలైంది. అదేరోజు ప్రపంచవ్యాప్తంగా వందమంది తొలి మహిళలతో పోస్టర్ ఆవిష్కరణ జరిపాం. కొత్తగా రాస్తున్న రచయితలకు, అనువాదకులకు ఒక వర్క్‌షాపు నిర్వహించాం. రెండో సంవత్సరంలో 'రైలుబండి కథలు' ఆవిష్కరణ జరిపింది. మూడో వార్షికోత్సవం సందర్భంగా 'హిజ్రాల సమస్యలు-పరిష్కారాలు' దిశగా కథల పోటీ నిర్వహించింది. 'అస్మిత' పేరుతో ఆ కథలను ప్రచురించి, దేశవ్యాప్తంగా ఉన్న రచయితలు 'ఆన్‌లైన్'లో ఏకకాలంలో తమ పుస్తకాన్ని తామే ఆవిష్కరించుకునే కొత్త ఒరవడి ప్రవేశపెట్టింది. నాల్గో ఏడాది 'ఒక్క క్షణం', 'గమ్యం' పుస్తకాల ఆవిష్కరణ జరిపి.. యూట్యూబ్‌లో విడుదల చేసింది. కోవిడ్ కారణంగా ఐదవ వార్షికోత్సవం జరపనప్పటికీ వెబ్‌సైట్ రూపలో అక్టోబర్‌లో అంతర్జాలంలో అడుగు పెట్టడానికి సమాయత్త మవుతోంది. త్వరలో 'స్వీయ చరిత్రల' పోటీ నిర్వహణకు ప్రణాళిక సిద్ధం చేస్తోంది. **- సమన్విత బృందం**

## 'అసాధ్యుడు' పుస్తకావిష్కరణ

**తొలి** తెలుగు ప్రధాని అయిన పివి నరసింహారావు గురించి మొగ్గల ప్రక్రియలో రచించిన అసాధ్యుడు (పివి మొగ్గలు) కవితా సంపుటిని తెలంగాణా రాష్ట్ర వ్యవసాయ, సహకార, మార్కెటింగ్ శాఖా మంత్రి సింగిరెడ్డి నిరంజన్ రెడ్డి ఆవిష్కరించారు. జూన్ 17న హైదరాబాద్‌లోని మినిస్టర్ క్వార్టర్స్‌లోని తన ఛాంబర్‌లో ఈ పుస్తకాన్ని ఆవిష్కరించారు. యువకవి భీంపల్లి శ్రీకాంత్ పివిని స్మరిస్తూ రాసిన మొగ్గలు ఆలోచింపే విధంగా ఉన్నాయని ప్రశంసించారు. ఈ కార్యక్రమంలో విశ్రాంత జిల్లా విద్యాశాఖాధికారి డాక్టర్ శివార్చక విజయకుమార్, నాగర్ కర్నూలు జిల్లా జెడ్పీ వైస్ చైర్మన్ బాలాజీ ఠాగూర్ సింగ్, మధు తదితరులు పాల్గొన్నారు.



## కథల, కవితల పోటీలు

**■ విశాలాక్షి మాస పత్రిక శ్రీ ఆళ్ల దశరథరామిరెడ్డి స్మారక కథల పోటీ నిర్వహిస్తోంది. 15 ఉత్తమ కథలకు రూ.3 వేలు చొప్పున సమాన బహుమతులు ఉంటాయి. ఎ4 సైజులో 5 పేజీలకు డిటిపి లేదా యూనికోడ్లో రచనలు పంపాలి. కథలు పంపటానికి ఆఖరి తేదీ జులై 15, 2021. మరిన్ని వివరాలకు 94405 29785 నెంబర్లో తెలుసుకోవొచ్చు.**

**■ మల్లెతీగ మాస పత్రిక ఈ ఏడాది కూడా కవితల పోటీ ప్రకటించింది. ఉత్తమ కవతకు రూ.5 వేలు, మరో ఏడు కవితలకు రూ.1000 చొప్పున బహుమతులు ఉంటాయి. కవితలు పంపటానికి ఆఖరి తేదీ జులై 15, 2021.మరిన్ని వివరాలు 92464 15150 నెంబర్లో సంప్రదించొచ్చు.**

## రాష్ట్ర స్థాయి జోకులు, స్కిట్ పోటీ

**దా**సరి క్రియేషన్స్, సుప్రసిద్ధ కథకులు ఇ.టి రామారావు గారి స్మారక కమిటీ సంయుక్తంగా నిర్వహిస్తున్న జోకులు/స్కిట్ పోటీలకు జోకులు, స్కిట్‌లు వీడియోల రూపంలో ఆహ్వానిస్తున్నామని నిర్వాహకులు దాసరి చంద్రయ్య తెలిపారు. వీడియో నిడివి 3 నుంచి 5 నిమిషాలు ఉండాలని, వీడియోలు ఫోను అడ్డంగా ఉంచి రికార్డు చేయాలని తెలిపారు. మొత్తం పది నగదు బహుమతులు ఉంటాయన్నారు. వీడియోలను పంపాల్సిన వాట్సాప్ నంబర్ 9440407381. వీడియోలు పంపటానికి చివరి తేదీ జూలై 20.

# దేవరకొండ బాలగంగాధర తిలక్



'అమృతం కురిసిన రాత్రి' వీరి ప్రసిద్ధ కవితా సంపుటి. గోరువంకలు, సీత కావ్యాలు రాశారు. నల్లజెర్ల రోడ్, ఊరి చివరి ఇల్లు వీరి ప్రసిద్ధ కథలు. కవిత్వంలోనూ, కథారచనలోనూ సమానస్థాయిలో ప్రతిభ చూపిన రచయిత.

SAHITYA PRASTHANAM ▪ SAMPUTI - 2 ▪ SANCHIKA - 10 ▪ KRISHNA ▪ July 2021
RNI NO.APTEL/2004/18396 ▪ Postal Regd. No.VJ/187/2020-22 PAGES : 68
Date of Posting : 1st & 2nd of Every Month ▪ Date of Publication : 27.6.2021



**If Un delivered please return to: Prasthanam, C/o M.B. Vignana kendram, 27-30-4, 3rd Floor Akulavari veedhi, Governorpet, Vijayawada - 520002. Ph: 0866-2577248, Cell: 94900 99057**



**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| పుస్తకం సంఖ్య | KRSA102M335 |
| --- | --- |
| పుస్తకం పేరు | సాహిత్య ప్రస్థానం |
| తారీఖు | 23 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Mahi |
| పేజీలు విడదీసినది | K Daveed |
| స్కాన్ చేసినది | DAVEED |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good. |